# చతుర

జనవరి 2011

రూ. 10/-

- పొత్తూరి విజయలక్ష్మి **ఏనాడు ఏ జంటకో** ..22
- సచ్చిదానంద రావుత్‌రాయ్ ..126





డా॥ పద్మజ సంతాన సాఫల్య కేంద్రం

వీధి నెం. 7, హబ్సీగూడ, హైదరాబాద్ 98483 43244 - 95535 07755

- IUI - ఇంజెక్షన్ విధానం
- IVF - టెస్ట్‌ట్యూబ్ బేబి
- ICSI - మైక్రో ఇంజెక్షన్ పద్ధతి
- HSG - అండవాహికల పరీక్ష
- ల్యాపరోస్కోపి / హిస్టరోస్కోపి
- అవసరమైన ఇతర పరీక్షలు - పద్ధతులు
- Recanalisation - మళ్లీ పిల్లల కోసం రివర్స్ ట్యూబెక్టమీ
- అందరికీ అందుబాటైన ఖర్చులో...

ప్రపంచ స్థాయి ఆధునిక ల్యాబ్ & యంత్ర పరికరాలతో....

మీ కలలు సాకారం చేసుకోండి




డా॥ పద్మజా దివాకర్

సంతాన సాఫల్య వైద్య నిపుణులు

web: www.drpadmajaivf.com e-mail: drpadmajaivf@yahoo.co.in

## ప్రకృతి చెక్కిన పలకల దొంతర

దాదాపు ఆరువేల ఏళ్లుగా ఫిలిప్పీన్స్‌లోని బానో రైస్ టెర్రేసెస్‌ను సమష్టి కృషితో మానవుడు వ్యవసాయ యోగ్యంగా మలచుకున్నాడని ప్రతీతి. ఎగువనున్న దట్టమైన అడవులనుండి ప్రవహించే నీరు వీటికి ఆధారం. ఈ పలకల్ని ఒకదాని తర్వాత ఒకటి పేర్చుకుంటూ పోతే సగం భూగోళాన్ని ఆక్రమిస్తాయట. సముద్ర మట్టానికి 1500 మీటర్ల ఎత్తున, 10,360 చదరపు కిలోమీటర్ల వరకు ఇవి వ్యాపించి ఉన్నాయి.



rage
mobiles

Battery that goes on & on!



SUMO
RD 30









Digital Camera | Bright torch | Dual sim | Mp3 player | FM



For any queries SMS RAGE <your query> send it to 54545, call (toll free no.) 1800-103-2565 or email: info@rage-mobile.com (More than 300 service centres across India)

**BRANCH OFFICE:** SUNSTRIKE TELECOM PVT. LTD, # 155, Street No. 6, Beside Andhra Bank Lane, Ashok Nagar, Hyderabad – 500020. Ph.: 040-40111639.

**REGIONAL DISTRIBUTOR FOR CENTRAL ANDHRA:** M/s Abhishek Marketing – 0866 6697776, 2576668.

**REGIONAL DISTRIBUTOR FOR TWIN CITIES & TELANGANA:** Space Technolozgies, 7-3-196/1, Portion-A, 1st floor, Laxmi Complex, R.P. Road, Secunderabad, Ph: 040-66339343, 9246824633.

**FOR TRADE ENQUIRY CONTACT:** 9848103388 & 9703581666

పాఠకులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు

# చతుర

సంపుటి -33, సంచిక - 12
396వ సంచిక, పేజీలు : 132
జనవరి 2011





'**నా** కుమారుడితో పెళ్లి వద్దన్నావట?' అంది సువర్ణ.
'అవునాంటీ! బాధ పెడితే క్షమించండి' అంది దివ్య.
'అదేంమాట! నీ జీవితం నీ ఇష్టం. మీ అమ్మతో ఒకసారి మాట్లాడతానంతే'
'ఇక ఈ విషయంలో చర్చలు వద్దాంటీ. నాన్న పోయిన బాధలో ఉందామె' అంది దివ్య.
'సరే, అయితే ఫైనల్‌గా పెళ్లి వద్దనేగా?' అంది సువర్ణ లోలోన సంబరంగా.
తనకు నిశ్చితార్థమైన పెళ్లిని ఓ అమ్మాయి రద్దు చేసుకునేందుకు దారితీసిన పరిస్థితులేమిటి? ఆద్యంతం ఆసక్తిగా చదివించే

**పొత్తూరి విజయలక్ష్మి** నవల
**ఏనాడు ఏ జంటకో**

22వ పేజీలో..

బొమ్మలు : ఆనంద్



# 2011లో ఇంప్రింట్‌వారి
# భారతదేశంలోని తీర్థయాత్రలు
# పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక,
ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6,
8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్,
తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేంద్రం.
7 రోజుల యాత్ర , రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6,
19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5,
24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్,
నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6,
19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7,
19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు
గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేంద్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7,
28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి
ర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7,
23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సంపూర్ణ నేపాల్ యాత్ర

లుంబిని, పోక్రా, ముక్తినాథ్, మనోకామ్న, పశుపతినాథ్,
దక్షిణకాశీ, జనక్‌పురి, చిన్నమస్త, కోసిదామ్, ఖాట్మండ్,
రూ. 42,000/- ఒక్కరికి
(ప్రయాణ భోజన వసతులతో సహా)

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం,
గంగాసాగర్, చంద్రాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది,
ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6,
22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి
జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం
కల్పించబడును. 6 రోజుల యాత్ర, రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## చార్‌ధామ్ యాత్ర

హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
13 రోజుల యాత్ర. రూ. 20000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 3/5,20/5,27/5,3/6,17/6,24/6,1/7,22/7,
29/7,5/8,19/8,26/8,2/9,16/9,30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర

శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్,
పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్,
శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర. రైలు, బస్సు ప్రయాణం.
రూ. 32000/- యాత్ర తేదీలు : 27/1,24/2,24/3,26/4,
23/5,21/6,25/7,22/8,20/924/10,24/11,22/12

వివరాలకు :





**దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**
ఫ్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్,
హైదరాబాద్ - 20, ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

అపార్ట్‌మెంటాలజీ 36

# 'ఆజ్ కీ తాజా టీవీ సీరియల్'

యర్రంశెట్టి శాయి



మా అపార్ట్‌మెంట్స్ తాలూకు రెసిడెంట్స్ వెల్ఫేర్ సొసైటీకి సుమారు పాతిక లక్షల ఫండ్స్ పోగయినయ్. ప్రతి వినాయక చవితి పండక్కీ రెండు లక్షలు కచ్చితంగా మిగుల్తుంది. పైగా లడ్డూ వేలం వేయటం వల్ల ఇంకో లక్ష వస్తుంది. ఆ ఫండ్స్‌తో సమాజానికి పనికి వచ్చే కార్యక్రమం ఏదైనా చేపట్టాలని మెంబర్స్ కోరే సరికి ఏ కార్యక్రమం చేపట్టాలా అని అందరూ ఆలోచనలో పడ్డారు.

"టీవీలో వచ్చే సీరియల్స్ పరమ చెత్తగా ఉంటున్నయ్ కదా! పైగా వాటిల్లో ఒక మెసేజ్ ఉండదు, పాడూ ఉండదు. అందుకని మన సొసైటీయే ఒక మంచి ఫామిలీ టైప్ సీరియల్ తీస్తే ఎలా వుంటుంది? " అంది షైనీ.

లేడీస్ అంతా షైనీని సపోర్ట్ చేశారు.

"ఆ సీరియల్లో చాలావరకూ మన కాలనీలో ఉన్నవాళ్లనే యాక్ట్ చేయించవచ్చు" అంది సీతావరదరాజన్.

మామూలుగానే హమీద్‌మియా ఆ సీరియల్‌ని తనే డైరెక్ట్ చేస్తానన్నాడు.

"నిజానికి నేను సినిమా డైరక్టర్ ఉన్నయ్. ఎప్పటికయినా సినిమాయే డైరక్షన్ చేస్తయ్. కానీ ఇది మన సొసైటీ టీవీ సీరియల్ ఉన్నయ్ కనుక నేను డైరక్షన్ చేసి హెల్ప్ చేస్తయ్" అన్నాడతను త్యాగం చేస్తున్న పోజులో.

మా అపార్ట్‌మెంట్స్‌లోనే ఉన్న ఓ రచయిత్రి వారంలో సీరియల్‌కి స్టోరీ తయారుచేసింది. ఆ తర్వాత లేడీస్ వింగ్ వాళ్లు ఆ స్టోరీకి మార్పులు చేర్పులు చేశారు.

కొంతమంది ప్రొఫెషనల్ టీవీ ఆర్టిస్టులతో పాటు మా అపార్ట్‌మెంట్స్‌లో పుష్కలంగా ఉన్న టాలెంట్‌ని కూడా ఆ సీరియల్లో ఉపయోగించాడు హమీద్‌మియా.

ఒక స్టేజీలో మాకే ఆశ్చర్యం కలిగింది. ఇంచుమించుగా ప్రతి ఫ్లాట్‌లోనూ ఒక నటుడు గానీ, నటిగానీ, చైల్డ్ ఆర్టిస్ట్‌గానీ ఉన్నారు.

"ఎక్స్‌పీరియెన్స్ లేదుగానీ అవకాశమిస్తే దుమ్ము దులిపేస్తాం" అన్నారు వాళ్లు.

సీరియల్ షూటింగు ప్రారంభమై మొత్తం పది ఎపిసోడ్‌లు కంప్లీట్ అయినయ్. ఏదొక ఛానెల్‌కి దాన్ని అమ్మి, ఆ తర్వాత వాళ్లిచ్చే డబ్బుతో మిగతా 1400

ఎపిసోడ్లు తీయాలని ప్లాన్ చేశాం.

వెంటనే ఓ మంచి రోజు చూసుకుని 'కామిని' టీవీ ఛానెల్ ఆఫీస్‌కి చేరుకున్నాం. టీవీ సీరియల్స్ ఇన్‌ఛార్జ్ భోలక్ మమ్మల్ని రెండు గంటల తర్వాత లోపలకు పిలిచాడు. విషయమంతా చెప్పాం. షైనీతోపాటు మా అపార్ట్‌మెంట్స్ రచయిత్రి కల్పకం ఆ సీరియల్ స్టోరీ గురించి వివరించారు. ఇంకా మిగతా వివరాలన్నీ కూడా చెప్పబోతుంటే అతను వారించాడు.

"అవన్నీ మాకు ఇంపార్టెంట్ కాదు" అన్నాడతను ఆఖర్లో.

మేము షాకయ్యాం.

సీరియల్‌కి ముఖ్యం- డైరెక్షన్, ఆర్టిస్ట్స్, స్టోరీ, మ్యూజిక్కే కదా" అడిగింది షైనీ.

"సీరియల్‌కి ముఖ్యమే! కానీ మా ఛానెల్‌కి అవేమీ ఇంపార్టెంట్ కాదు"

"అయితే మీకేది ఇంపార్టెంట్?"

"పర్సంటేజ్ ఎంత?"

మాకా ప్రశ్న అర్థం కాలేదు. అందరం ఒకరి మొఖాలొకరు చూసుకున్నాం. ఎవరికీ ఏమీ తెలీలేదు.

"పర్సంటేజ్ అంటే.. కొంచెం డిటెయిల్డ్‌గా చెప్తారా?"

"వ్వాట్.. పర్సంటేజ్ మేటర్ తెలీకుండా సీరియల్ ఎలా తీశారయ్యా! ఇంక వెళ్లండి! ఏమీ తెలీని వాళ్లతో డీల్ చేసేంత టైమ్ నాకు లేదు" చిరాగ్గా అన్నాడు భోలక్.

"సారీ సార్, ఫస్ట్ టైమ్ సీరియల్ తీశాం! కొంచెం హెల్ప్ చేయండి" బతిమాలాడు విజయ్‌యాదవ్.

"అంటే మీరిచ్చే పర్సెంటేజీ ఎంత?"

మా కన్‌ఫ్యూజన్ మరింత పెరిగింది.

"మేము మేమిచ్చే పర్సంటేజా? అదేంటి? మీరే మాకు డబ్బిస్తారు కదా సీరియల్ తియ్యడానికి"

అతను తల రెండు చేతుల్తో పట్టుకుని, "అబ్బా! మీతో కాసేపు మాట్లాడితే బీపీ




పెరిగిపోయేటట్లుంది.. వన్ మినిట్.." అన్నాడు. సొరుగులోనుంచి ఒక టాబ్లెట్ తీసి వేసుకుని మంచినీళ్ళు తాగాడు.

"చూడు! నువ్ సీరియల్ తీశావ్.. అవునా?"

"అవున్సార్"

"అందుగ్గాను ప్రతి ఎపిసోడ్‌కి మేము మీకు కొంత డబ్బిస్తాం అవునా?"

"అవున్సార్"

"అలా మీకిచ్చే మనీలో మీరు నాకెంత పర్సెంటేజ్ ఇస్తారు?"

అప్పుడర్థమయింది హమీద్‌మియాకి.

మా అందరి చెవిలో గుసగుసలాడాడు.

"వీడు మనల్ని కమిషన్ అడుగుతున్నయ్! ఇలాంటివి ఛానెల్స్‌లో మామూలే"

"ఓ! అదా!" అన్నాడు మొహిందర్‌సింగ్.

"మీరెంతంటే అంత!" అన్నాడు శంకరమూర్తి.

"ట్వంటీపర్సెంట్.. అంటే, మీకు నేను ఎపిసోడ్‌కి యాభై వేలిస్తే మీరు నాకు పదివేలివ్వాలి"

మేమంతా ఓ మూలకెళ్లి డిస్కస్




చేసుకున్నాం.

"అన్ని ఛానెల్స్‌లో ఇదే గొడవంటలే.. ఇచ్చేద్దాం" అన్నాడు విజయ్.

"ఓకే సార్! అగ్రీడ్" అన్నాడు హమీద్.

"గుడ్! ప్రతి ఎపిసోడ్ టెలికాస్ట్ ముందు నాకు మనీ తెచ్చివ్వాలి"

"అలాగే సర్"

"అయితే ఇంక క్రియేటివ్ హెడ్ దగ్గర కెళ్ళండి!"

"అతనెవరు? "

"అతను కాదు.. ఆమె.. పేరు భామ! ఆ భామాకలాపం సక్సెస్‌ఫుల్‌గా పూర్తయి తేనే మీ సీరియల్‌ని యాక్సెప్ట్ చేస్తాం"

అందరం క్రియేటివ్ హెడ్ అని రాసి ఉన్న చాంబర్‌లోకొచ్చాం.

"అప్పటికే కళ్ళజోడు భామ ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతోంది.

"మీకేమయినా కామన్ సెన్సుందా? తెలుగు సీరియల్ అన్నాక ఒకే మొగుడు ఒకే పెళ్ళాంతో ఎనభై ఎపిసోడ్స్ వరకూ కాపురం చేస్తాడా? వాట్ నాన్సెన్స్ యూ ఆర్ స్పీకింగ్? వ్యూయర్స్ చెప్పు తీసుక్కొడతారు.. నెక్స్ట్ ఎపిసోడ్‌లోనే వాడు పెళ్లాన్నొదిలేసి ఇంకో లేడీతో కాపురం చేస్తున్నట్లు చూపించండీ! ఓకే? అన్నట్లు హీరోయిన్ చెల్లెలు పద్నాలుగు ఎపిసోడ్స్ నుంచీ ఒకే బాయ్‌ఫ్రెండ్‌తో తిరుగుతుంది! అలా జరుగుతుందా? లవ్ ట్రయాంగిల్ స్టార్ట్ చేసేయండి! అన్నీ నేనే చెప్పాలి! ఒక్కడికీ తెలివిలేదు, చిల్లరగాళ్లు.." అంటూ ఫోన్ పెట్టేసి మావేపు చూసింది.

"రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ వాళ్లేనా? "

"అవును మేడమ్"

"భోలక్ చెప్పాడు.. మీ స్టోరీ లైనేదీ? "

ఫైల్ ఆమెకిచ్చింది షైనీ.

కొంచెం చదవగానే ఉలిక్కిపడిందామె.

"ఏంటీ? ఈ సీరియల్‌లో క్రైమ్ ఎలిమెంట్ లేదా? "

సీరియల్‌లో క్రైమ్ ఎలిమెంట్ లేకపోవటమే పెద్ద క్రైమ్ అన్నట్లు మాట్లాడింది.

"లేదు మేడమ్! ఎందుకంటే మేము కేవలం ఒక ఫ్యామిలీ సెంటిమెంట్ సీరియల్ తియ్యాలని ప్రయత్నించాం"

"క్రైమ్ లేకుండా ఫ్యామిలీ సెంటిమెంటేంటింకా? క్రైమ్‌తోనే మంచి సెంటిమెంట్ వస్తుంది. ఇలాక్కుదరదు.. మొదటి ఎపిసోడ్ నుంచే క్రైమ్ యాడ్ చేయండి!"

"కానీ ఫ్యామిలీ సబ్జెక్ట్‌లో క్రైమ్‌నెలా ఇరికిస్తాం మేడమ్? " కల్పకం అడిగింది.

"ఎలా గేంటి? పేపర్లో చూట్టంలా? అక్క ఇంట్లో ఉంటున్నమ్మాయ్ తన స్వంత అక్కని మర్డర్ చేస్తుంది"

అందరం షాకయ్యాం.

"చెల్లెలు అక్కని మర్డర్ చేస్తుందా? అదేంటి మేడమ్? మేమింతవరకూ ఎక్కడా ఏ ఫ్యామిలీలోనూ అలాంటి చెల్లెల్ని చూడలేదు"

"అందుకే టీవీ సీరియల్లో అలాంటివి చూపించాలి"

"కానీ చెల్లి అక్కనెందుకు చంపుతుంది? "

# ఒక్క ఓటు మహత్యం!

చాలామంది 'నేను ఒక్కడినీ ఓటు వేయక పోతేనేం? అది ఎంపికయ్యే అభ్యర్థి తలరాతనే మైనా మారుస్తుందా?' అనుకుంటారు. కాని ఆ ఒక్కఓటే చరిత్రలో ఎన్నో కీలక మార్పులకు నాంది అయింది.




1. ఒక్క ఓటు ఆలివర్ క్రామ్‌వెల్‌ని 1645లో లార్డ్ ప్రొటెక్టర్ ఆఫ్ కామన్‌వెల్త్‌గా, ఇంగ్లండ్ రక్షకుడిగా చేసింది.

2. ఒక్క ఓటే 1649లో చార్లెస్ రాజుకు మరణ శిక్షను విధించింది.

3. 1800లో ఆరోన్‌బుర్‌ని అధ్యక్షుడు కాకుండా అడ్డుకుంది.

4. 1839లో మార్కస్ మోర్టన్‌ని మసాచుసెట్స్ రాష్ట్ర గవర్నర్‌ని చేసింది.

5. 1845లో టెక్సాస్‌ను అమెరికాలో కలిపిందీ ఒక్క ఓటే.

6. 1868లో ప్రెసిడెంట్ ఆండ్రూ జాన్సన్‌ను అభిశంసన తీర్మానం నుంచి రక్షించింది కూడా ఆ ఒక్క ఓటే.

7. 1875లో ఫ్రాన్స్‌ను రాజరికం నుంచి రిపబ్లిక్‌గా మార్చింది.

8. కాలిఫోర్నియా, ఒరేగాన్, వాషింగ్టన్, ఇడాహో రాష్ట్రాలను యూనియన్‌లోకి అనుమతించింది ఒక్క ఓటు తేడానే.

9. 1876లో రూథర్‌ఫర్డ్ భాగెస్‌ని అధ్యక్షుడ్ని చేసింది. ఆ ఒక్క ఓటును వేసిన ఇండియానా ప్రతినిధి కూడా కీలకమైన ఒక్క ఓటుతోనే ఎన్నిక కావడం విశేషం.

10. 1923లో అడాల్ఫ్ హిట్లర్‌ని నాజీ పార్టీకి అధినేతని చేసింది.

ఒక్క ఓటు ఎప్పుడూ ఒంటరిది కాదు. ఆ ఒక్కటే మొత్తం చేయలేకపోయినా, చాలా సందర్భాల్లో చరిత్రలో ఎంతో చేసిందనేది రుజువైంది. కాబట్టి ఎన్నికల్లో ఏ ఒక్కరూ ఓటు వేయకుండా తాత్సారం చేయకూడదు.




# ప్లాస్టిక్ కవర్లతో వరద ముప్పేనా?

తిరుమలలో ప్లాస్టిక్ కవర్ల వాడకాన్ని ఇటీవలే నిషేధించారు. కాని మనదేశంలో మొదటగా ఈ విషయమై చొరవ తీసుకుంది కాశీలోని విశ్వనాథ ఆలయం ట్రస్ట్ బోర్డ్. మే 2010 నుంచి ఆలయ పరిసరాల్లోకి పాలిథీన్ కవర్లను తీసుకురాకూడదని కాశీ విశ్వనాథ్ టెంపుల్ ట్రస్ట్ ఛైర్మన్ హరిహర త్రిపాఠీ నిర్దేశించాడు. ఈ విషయంలో తర్వాతి స్థానం రాజస్థాన్ ప్రభుత్వానిదే. దేశంలోనే అతి పెద్దరాష్ట్ర మైన అక్కడ ప్లాస్టిక్ కవర్ల వాడకం, తయారీ, నిల్వ, అమ్మకం, రవాణాలను కొన్ని నెలల కిందటే చట్టవిరుద్ధమని ప్రకటించేశారు.




2005లో ముంబయిలో లక్షలాది ప్లాస్టిక్ కవర్లు డ్రైనేజీ పైపుల్లో అడ్డుపడి, భారీ వర్షాలు కురిసినప్పుడు నగరం వరదలో ముంచెత్తేందుకు కారణమయ్యాయి. అప్పట్లో దాదాపు వెయ్యిమంది మరణించారని అంచనా. 1988, 1998లోనూ బంగ్లాదేశ్‌లో ఇదే జరిగింది. 2002లో బంగ్లాదేశ్ కూడా వీటిని నిషేధించింది. కాని బాంబేలో మరోసారి వరద రాకుండా ప్రభుత్వం వీటిని నిషేధించక పోవడం గమనార్హం.




"ఆ అమ్మాయికి ఓ డాన్‌తో అక్రమ సంబంధం. అతడి వలలో పడి ఆస్తికోసం మొత్తం ఫ్యామిలీని లేపెయ్యాలని ట్రై చేస్తుంది. అదీకాక ఆ చెల్లెలికి ఆ అక్క స్వంత అక్క కాదు. చిన్నప్పట్నుంచీ అక్క అంటే ద్వేషం!"

"మాకు పిచ్చెక్కేట్లుంది"

"కరెక్ట్! చూసేవాళ్ళకు పిచ్చెక్కిస్తేనే సీరియల్‌కి వ్యూయర్‌షిప్ బాగుంటుంది"

"సరే మేడమ్, అలాగే చేస్తాం" ఒప్పుకున్నాడు మొహిందర్ కుర్చీలోంచి లేస్తూ.

"అప్పుడే ఎక్కడయింది? ఇంకా చాలా మార్పులు చేయాలి"

"ఇంకానా? "

"అవును. హీరో తండ్రికి అక్రమ సంబంధం ద్వారా పుట్టిన మరో అమ్మాయి సడెన్‌గా ఆ ఇంట్లో దిగాలి"

"అంటే అక్రమ సంబంధాలు లేని మనిషంటూ ఫ్యామిలీస్‌లో ఎవరూ ఉండరని మీ ఉద్దేశమా? " చిరాకుగా అంది షైనీ.

"ఫ్యామిలీ సంగతి కాదు.. సీరియల్స్‌లో అలా ఉండకూడదు"

"ఇంకా ఏమేం చేయాలంటారు? "

"ఆ ఇంటికోడలు కథ ఇలా సాదాసీదాగా ఉండకూడదు. ఫస్ట్‌నైట్ తన భర్త నపుంసకుడని ఆమెకు తెలియాలి!"

అందరం మొఖాలు చూసుకున్నాం.

"ఓర్నాయనో!" అదిరిపడింది కల్పకం.

"తర్వాత? " అడిగాడు శంకరమూర్తి.

"ఆ అమ్మాయి తన భర్త నపుంసకుడన్న విషయం తల్లిదండ్రులకక్కూడా చెప్పదు. తన భార్యకు సంసారసుఖం ఇవ్వలేకపోతున్నాడన్న అశాంతితో ఆమె భర్త పరమ శాడిస్ట్‌గా మారి, ఆమెను చిత్రహింసలు పెడుతుంటాడు. అంతేకాదు. తన ఫ్రెండ్ దగ్గర పడుకోమని గొడవ చేస్తుంటాడు"

వాంతొస్తున్నట్లు మొఖం పెట్టింది షైనీ.

"మేడమ్! మా సీరియల్ చూసేది ఫ్యామిలీసా, బ్రోతల్ హౌసెసా? " అడిగాడు హమీద్‌మియా.

ఆ ప్రశ్నతో ఆవిడకి కోపం పొడుచుకొచ్చింది.

"డోంటాక్ రాట్! వ్యూయర్‌షిప్ రావాలంటే ఇలాంటి ఎలిమెంట్స్ అన్నీ సీరియల్స్‌లో ఉండాల్సిందే!"

"ఇంతేనా? ఇంకా ఏమైనా ఉన్నాయా మేడమ్? "

"ఆ అమ్మాయికి తన అన్న సంసార సుఖం ఇవ్వలేడని తెలిసిన మరిది ఆమెను అవకాశం దొరికినప్పుడల్లా రేప్ చేయడానికి ట్రై చేస్తుంటాడు"

"ఏంటి? వదినను రేప్ చేయడానికి మరిది ప్రయత్నిస్తాడా? మీకేమైనా మెంటలా? మన ఫ్యామిలీస్‌లో వదిన తల్లితో సమానం! మీకు తెలీదా? మీరు ఫ్యామిలీ టైప్ కాదా? " అడిగింది షైనీ.

"ఇదిగో! తెలీకపోతే మూసుకోండి. అంతేగానీ కామెంట్స్ వద్దు. అయినా మీతో డిస్కషన్ అనవసరం. మీదారిన

# చతుర కతలకు ఆహ్వానం!

★ కొసమెరుపుతో 'వావ్' అన్పించే చతుర కతలను మాకు పంపండి.

★ వ్యంగ్యానికి, హాస్యానికే ప్రాధాన్యం.

★ స్పార్క్‌కే మార్కు!

★ ప్రతి కథా అచ్చులో ఒకటి రెండు పేజీలకు మించకూడదు.

★ ప్రతి కథకూ పారితోషికం!

★ తిరస్కరణకు గురైన కథలను కావాలనుకునేవారు స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరును జతపరచాలి.

★ ఎంపికలో సంపాదకులదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలకు వీలుండదు.

మీ కథలు పంపాల్సిన చిరునామా:

**చతుర కతలు**

చతుర మాసపత్రిక, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500082

*E-mail:* vipula.chatura@gmail.com


మీరు ఫోండి" చిరాగ్గా అందామె.

మొహిందర్‌సింగ్ సారీ చెప్పాడు. "ఏదో తెలీక మాట్లాడారులెండి మేడమ్"

"ఆ తర్వాత మూడు ఫ్యామిలీస్ మధ్య వార్ అప్పుడప్పుడూ చూపిస్తూండాలి"

"వార్..."!

"అంటే డాన్‌లను ఇన్వాల్వ్ చేయాలన్న మాట! వాళ్ళల్లో వాళ్ళు కొట్టుకుంటుంటారు. ఇక ఇంటికోడలు ఎంతో కష్టపడి తన భర్తను దేశంలోని డాక్టర్లందరికీ చూపించి, చివరకు అతనిని ఒక మామూలు మనిషిగా చేస్తుంది. ఇద్దరూ కొద్దిరోజులు హేపీగా సంసారం చేస్తారు. ఒక పాప కూడా పుడుతుంది. కానీ అతనికి ఆ పాపకు తండ్రి తనుకాదని నమ్మకం. అందుకని భార్యనీ పాపను కూడా చంపడానికి ప్రయత్నిస్తూంటాడు. ఈలోగా ఆఫీస్‌లో అతని కొలీగ్ ఒకామె అతనితో అక్రమ సంబంధం పెట్టుకుంది. అంతే కాదు! భార్యనొదిలేసి తనను పెళ్ళి చేసుకొమ్మని డిమాండ్ చేస్తూంటుంది. కానీ అతని భార్య విడాకులివ్వటానికి ఒప్పుకోదు. విడాకులిచ్చి బయటకు గెంటితే తనూ తన పాపా దిక్కులేని చావు చావాల్సివస్తుందనీ అతని కాళ్ళమీదపడి అయిదారు నెలలు ఏడుస్తుంది. అయినా ఆమె భర్త ఆమె మాటలు పట్టించుకోకుండా తన ప్రియురాలిని గుళ్ళో పెళ్ళి చేసుకొచ్చి ఇంట్లో కాపురం చేస్తూంటాడు. అతని భార్య వాళ్ళిద్దరికీ సేవలు చేస్తూ పనిమనిషిగా గడుపుతూంటుంది"

శంకరమూర్తికేదో అనుమానమొచ్చింది.

"ఇదేదో పాత తెలుగు సినిమా కథలా గుందే" అన్నాడతను.

భామ అసహనంగా చూసింది.



"పాత సినిమాలనే కొంచెం మార్చి సీరియల్స్‌లో చూపించాలి. అది బేసిక్ రూల్! ఆ మాత్రం తెలీదా? " అంది చిరాగ్గా.

"ఈ మార్పులు చేస్తే మా సీరియల్ ఓకే చేస్తారా మేడమ్? " అడిగాడు విజయ్.

"అసలైన పాయింట్స్ ఇంకా బోలెడున్నయ్. వినకుండా మధ్యలో న్యూసెన్స్ లేంటి? " మండిపడిందామె.

మేము నోరు మూసేసుకున్నాం.

"ఇప్పుడు ఒక ఇంపార్టెంట్ పాయింట్ ఏమిటంటే ఆ కోడలిని మొదటినుంచీ ఆరాధిస్తోన్న ప్రియుడు ఆమెను తరచుగా గుళ్లో కలుసుకుని ఓ అరగంట ఆరాధించి, ఆమెకు ధైర్యం చెప్పి, ఆమెనాదుకోవడానికి తను రాత్రింబగళ్లు సిద్ధంగా ఉన్నానని చెప్పి వెళ్ళిపోతూంటాడు.."

"అంటే వాళ్ళిద్దరికీ మధ్య అక్రమ సంబంధం ఉంటుందా మేడమ్? "

"చచఛ! ఏం చిల్లర టేస్టయ్యా మీది. వాళ్ళ మధ్య ఉన్నది కేవలం పవిత్ర ప్రేమ."

"కొన్ని కారణాలవల్ల ఆమె అతనిని పెళ్ళి చేసుకోలేకపోతుంది. అయినా అతను ఆమె మీద ప్రేమతో జీవితాంతం బ్రహ్మాచారిగానే ఉండిపోతాడు. ఈలోగా ఆమె భర్త తమ్ముడు ఒకమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని నమ్మించి గర్భవతిని చేస్తాడు. అయితే వాడికప్పటికే పెళ్ళయింది గనుక ఆ అమ్మాయి ఆ విషయం తెలుసుకుని గొడవ చేస్తుంది. దాంతో అతని తండ్రి ఆ అమ్మాయిని తీసుకొచ్చి నపుంసక పెద్దకొడుక్కిచ్చి పెళ్ళిచేస్తాడు"

మాకు ఆ కథ వింటూంటే మెదడు మొద్దుబారిపోయింది. అసలు మేమెవరు? మేమెక్కడున్నాం? మా పేర్లేమిటి? అన్నీ మర్చిపోయే స్థితికి చేరుకున్నాం! కానీ భామ మాట్లాడటం ఆపలేదు. క్రియేటివ్ హెడ్‌గా మొత్తం కథంతా ఇష్టమొచ్చినట్లు క్రియేట్ చేసి పారేస్తోంది.

"ఆ తర్వాత ఆ కోడలి పాపను ఆమె భర్త రెండో భార్య లాక్కుని తల్లి మొఖం చూడనీకుండా తనే తల్లినని చెప్పి పెంచుకుంటుంది. కొద్దిరోజులకు పాప తల్లిని



మర్చిపోయి ఆమే తన తల్లి అనుకుం టుంది. కన్నతల్లిని కేవలం పనిమనిషిగానే చూస్తుంది. పాప పెరిగి పెద్దదవుతుంది. పాప కాలేజీలో తప్పుమార్గంలో వెళ్తున్న విషయం తెలుసుకున్న కన్నతల్లి ఆమెను మందలిస్తుంది.

అందుక్కోపం వచ్చి పాప ఒక బెల్ట్ తీసుకుని తల్లికి వాతలు తేలేట్లు కొడు తుంది. ఆ వాతలతో జ్వరం వచ్చి తల్లి హాస్పిటల్లో చేరుతుంది. ఈలోగా ఆమె భర్తా మూడో భార్యగా చెలామణీ అవు తోన్న తమ్ముడి ప్రియురాలు తన భర్త తోనే లవ్‌లో పడుతుంది. ఆ మూడో పెళ్లానికో పాతిక ఎపిసోడ్‌ల ఫ్లాష్‌బ్యాక్ ఉంటుందన్నమాట!" ఆమె చెపుతోంది కిటి కీలోనుంచి బయట గార్డెన్ చూస్తూ.

మేమంతా ఆమె చూడకుండా సైగలు చేసుకుని శబ్దం కాకుండా అడుగులో అడుగు వేసుకుంటూ బయటకు వచ్చేశాం.

అయినా ఆ విషయం ఆమెకు తెలిసిన ట్లులేదు. బయటక్కూడా ఆమె క్రియేటివ్ నెస్ వినబడుతోంది.

ఎందుకైనా మంచిదని ఒకసారి ఆ భవనం బయటకు నడిచి దానివేపే చూశాం. అది టీవీ ఛానెలా మెంటల్ హాస్పిటలా అన్న బోర్డ్ ఉందేమోనని.

"ఏంటి సార్, చూస్తున్నారు" అడిగాడు వాచ్‌మన్.

"ఇది టీవీ ఛానెలా లేక మెంటల్ హాస్పిటలా? " అడిగాం అతనిని.

అతను మావంక డౌటుగా చూశాడు.

"ఇప్పుడు మెంటల్ హాస్పిటల్స్ అనేవి ప్రత్యేకంగా ఏమీ లేద్సార్. చాలా టీవీ ఛానెల్స్ ఇప్పట్లో మెంటల్ హాస్పిటల్స్‌గా మారిపోయాయ్ సార్"

*(ఈ శీర్షిక ఇంతటితో సమాప్తం)*


**ఒక ఎకరంలో జామాయిల్ మొక్కలు నాటండి.**
**3.5 సంవత్సరాలలలో లక్ష రూపాయల ఆదాయం పొందండి.**





**మావద్ద అధిక దిగుబడినిచ్చే జామాయిల్ మొక్కలు (నీలగిరి)**
**నెం. 3,7,316,411,413 యూరోగ్రాండిస్ లభించును.**

- ఏ విధమైన నీటితడులు, పురుగుమందులు అవసరం లేదు - కూలీల ఖర్చు లేదు
- ఈ జామాయిల్ క్లోన్స్ నల్లనేలలు, ఎర్రనేలలు, ఇసుక నేలలు, మాగాణి నేలలకు కూడా అనువైనవి.
- అన్ని జిల్లాల వారికి ఆర్డర్‌పై సకాలంలో నాణ్యమైన జామాయిల్ క్లోన్స్ సప్లయ్ చేయబడును.
- కాంట్రాక్టు పద్ధతిపై నాటించి ఇవ్వబడును.
- టేకు, మామిడి, జీడిమామిడి, కొబ్బరి, చీనీ నిమ్మ, ఎర్రచందనం మొక్కలు లభించును.

మరిన్ని వివరములకు సంప్రదించండి: **బూరుగుపల్లి రవీంద్ర**
**94403 23244, 99486 33611**
**BRC BIO-TECH**
**భద్రాద్రి క్లోన్స్**
అశ్వారావుపేట రోడ్, జంగారెడ్డిగూడెం, పశ్చిమగోదావరి జిల్లా - 534 447

# సహజ సౌందర్యమే ఐశ్వర్య

పుట్టుకతో వచ్చిన సహజ సౌందర్యమే అందం, ఐశ్వర్యం అంటుందామె. ప్రకృతి తన సౌందర్యాన్నంతా రంగరించి పుత్తడిబొమ్మగా మలిచిందా అన్నట్లుంటుంది ఆమె అందం. సునాయాసంగా 'ప్రపంచ సుందరి' కిరీటాన్ని చేజిక్కించుకుని దేశానికి కీర్తిప్రతిష్టల్ని తెచ్చింది. సూపర్ మోడల్.. బ్రాండ్ ప్రమోటర్.. బాలీవుడ్ తారామణిగానే కాక అమితాబ్ కోడలిగా కూడా ఆమె ప్రఖ్యాతిగాంచింది. ఆ భామ మరెవరోకాదు.. ముప్పై ఎనిమిదేళ్ల ఐశ్వర్యా రాయ్. అందం, సౌకుమార్యంతోపాటు ప్రతిభాసామర్థ్యాలు ఆమె సొత్తు. అణకువ ఆమెకు అదనపు అలంకారం. నీలికనుల ఆ సహజ సుందరి చెప్పే సౌందర్య చిట్కాలేమిటో తెల్సుకుని తీరాల్సిందే!

ఐశ్వర్య పుట్టింది కర్నాటకలోని మంగళూరులో. మోడల్‌గా, బ్రాండ్ ప్రమోటర్‌గా తన కెరీర్ ప్రారంభించి, బిజీ సెలెబ్రిటీగా మారింది. నటనానుభవం అంతగా లేకున్నా బాలీవుడ్‌లో ప్రవేశించింది. పట్టుమని పది సినిమాలు చేయకుండానే ఉత్తమ నటిగా ప్రేక్షకుల మదిలో స్థానం సుస్థిరం చేసుకుంది. 'హమ్ దిల్ కే సనమ్' సినిమాతో ఫిలిమ్ ఫేర్ అవార్డు చేజిక్కించుకుంది. వెంటవెంటనే అనేక పురస్కారాలు సొంతం చేసుకుంది. కేన్స్ ఫిలిం ఫెస్టివల్‌కి ప్రత్యేక ఆహ్వానం అందుకున్న తార ఆమె. ప్రపంచ వ్యాప్తంగా వున్న అతి కొద్దిమంది అత్యంత సుందరీమణుల్లో ఒకరైన ఐశ్వర్య అందం, ఆరోగ్యాల గురించి చెబుతోందిలా..

★ మానసిక ప్రశాంతతే బాహ్య సౌందర్యాన్ని ఇనుమడింపజేస్తుంది.

★ ఉదయాన్నే గోరువెచ్చని నీరు, నిమ్మరసం, తేనె కలిపి తాగడమనేది తూచా తప్పక పాటిస్తాను. ఇక రోజు మొత్తంలో ఎనిమిది గ్లాసులకు తగ్గకుండా మంచి నీరు తాగుతాను. దాంతో

శరీర లావణ్యం, చర్మపు నిగారింపు నిలకడగా ఉంటుంది.

★ ఆహార విషయంలో చాలా శ్రద్ధ తీసుకుంటాను. నిజానికి నేను చిన్నప్పటి నుంచీ మితాహారినే. అలాగే సాత్వికాహారం నాకెంతో ఇష్టం.

★ తాజాగా వుండే పండ్లూ కూరగాయలూ అందంతోపాటు మనల్ని ఆరోగ్యంగా ఉంచుతాయి.

★ ఎక్కువ కేలరీలు ఇచ్చే ఘన ఆహారపదార్థాల జోలికి పోనేపోను. ఫాస్ట్‌ఫుడ్స్, నూనె, కొవ్వు తిళ్లంటే నాకసలు గిట్టదు.

★ శరీర పోషణ గురించి ప్రత్యేకించి అదే పనిగా ఆందోళన చెందను. నా అలవాట్లే నన్ను హాయిగా, ఆనందంగా వుంచుతున్నాయి

★ చర్మం మృదువుగా, కాంతిగా ఉండేందుకు సహజ సౌందర్య సాధనాలపైనే ఆధారపడతాను.

★ కీరా, దోస, పాలు, పెరుగు, తేనె కాంబినేషన్‌ని రోజువారి శరీరానికి మర్దన చేసుకుంటే చర్మపు నిగారింపు చెక్కుచెదరదు.

★ వంటింట్లో వుండే పదార్థాలు, దినుసులే అందం, ఆరోగ్య ప్రదాతలు.

★ ఉదయాన్నే తేలికపాటి ఎక్సర్‌సైజులు, జాగింగ్ తప్పనిసరి. అలాగే వీలున్నప్పుడల్లా వాకింగ్ చేస్తా. ఔట్‌డోర్ షూటింగులప్పుడు కూడా వెసులుబాటు చేసుకుని వాకింగ్ చేస్తాను. దానిని అలవాటుగా మార్చేసుకున్నాను. నా జీవితంలో భాగమయింది.

★ దేనికీ హైరానాపడను. మిన్ను విరిగి మీద పడుతుందన్నా ప్రశాంతంగానే ఉంటూ సమస్యల నుండి ఎలా బయటపడాలో ఆలోచిస్తాను.

★ యోగా, ధ్యానం అంటే నాకెంతో ఇష్టం. ఎంత బిజీగా ఉన్నా ఉదయం, సాయంత్రం కొంత సమయం వాటికి కేటాయిస్తా.

★ కేశసౌందర్యం పట్ల ఎక్కువ జాగ్రత్తలు తీసుకుంటాను.

★ తలస్నానం విషయంలోనూ సహజసిద్ధ సౌందర్య సాధనాలనే వాడతాను. రసాయనాలు ఉన్న లిక్విడ్స్, క్రీములు నాకు అంతగా సరిపడవు.

★ ఇంటి వద్ద ఉన్నప్పుడు ఎలాంటి ప్రత్యేక మేకప్ అవసరం వుండదు. అందుకే అలాంటప్పుడు రిలాక్స్ అవుతాను.

★ షూటింగ్ సందర్భంలో సరళంగా ఉండే మేకప్‌తో సరిపెట్టేస్తాను. నా బ్యూటీకిట్‌ని నేనే



ప్రత్యేకంగా సర్దుకుంటాను.

★ నామమాత్రపు పౌడర్, క్రీములతోనే నా మేకప్ పూర్తవుతుంది.

షూటింగుల తర్వాత సహజ క్లీనర్‌లు కీర, దోసగుజ్జు, శెనగపిండితోనే మేకప్‌ను శుభ్రంగా కడిగేసుకుంటాను.

★ వస్త్రధారణ విషయంలోనూ చాలా సింపుల్. నాకు నప్పే లేత రంగులు ఎంచుకుంటాను.

★ శరీరాన్ని, ముఖ్యంగా చర్మాన్ని మన దుస్తులు ఇబ్బంది పెట్టకూడదు. వాటిని వేసుకుంటే హాయిగా ఉండాలి.

★ నలుగురిలోనూ, ఒంటరిగా వున్నా మౌనమే నాకిష్టం. అలా అని మరీ మూడీని కాదండోయ్!

★ నేను అందరితో చాలా ఆప్యాయంగా వుంటాను. నా మోముపై చిరునవ్వు చెరిగిపోనివ్వను. అందుకేనేమో 'ఐశ్వర్య చిరునవ్వు ఎప్పుడూ పెదాలపై నాట్యం చేస్తూనే వుంటుంది' అంటారు.

★ ప్రశాంతమైన నిద్రతో సంపూర్ణ ఆరోగ్యమే కాక అందంగానూ ఉంటాం. అందువల్ల నిద్రకూ తగినంత సమయం తప్పక కేటాయించాలి.

**–రేవతి**



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

చిరునామా : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

# కాలాతీతం



జోసెఫ్ కోన్రాడ్



# హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్

**ఒ**క సాయంత్రం లంగరు వేసిన నౌక 'నెల్లీ' థేమ్స్ నదిమీద తేలియాడుతున్నది. గాలివాటం అనుకూలించగానే బయల్దేరటానికి అయిదుగురు యాత్రికులు నిరీక్షిస్తున్నారు. అందులో ఒకడు ఛార్లెస్ మార్లో. శతాబ్దాల క్రితం సంపదను కొల్లగొట్టటానికి రోమన్లు, ఇంగ్లండు మీద చేసిన దండయాత్రను కథలుగా వినిపిస్తున్నాడు.

"పరదేశాలను కొల్లగొట్టటం ఇప్పటికీ కొనసాగటం లేదా? నా అనుభవమే నిదర్శనం. కొన్నేళ్ల క్రితం కాంగో వెళ్లాను" అంటూ ప్రారంభిస్తాడు మార్లో. ఇలా కథలో కథ చెప్పటాన్ని 'ఫ్రేం స్టోరీ' అంటారు.



ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

ఒక ఫ్రెంచి స్టీమర్ మీద కాంగో నది ముఖద్వారానికి యాత్ర ప్రారంభమవుతుంది. అనేక మజిలీలు చేస్తూ నెమ్మదిగా కదులుతుంది స్టీమర్. దట్టమైన, చీమలు దూరలేని ఆఫ్రికా అడవులు ప్రకృతి విరాట్ స్వరూపానికి ప్రతీకలుగా కనిపిస్తాయి. ఈ అడవుల్లో ఆటవికులు నివసిస్తారు. వాళ్ల ఆత్మరక్షణ దాడుల నుండి తప్పించుకొనటానికి అప్పుడప్పుడూ తుపాకులు పేల్చక తప్పదు.

నదీ ముఖద్వారం వద్ద ఒక స్వీడన్ దేశస్థుడు కమాండర్‌గా ఉన్న మరో స్టీమర్ ఎక్కి ప్రయాణం కొనసాగిస్తాడు మార్లో. యూరోపియన్లు అందరూ ఆఫ్రికాకు ఎందుకొస్తున్నారు? ఈ అడవుల్లో వీళ్లకేం పని? అని ప్రశ్నించుకుంటాడు.

స్టీమర్ సైటు కార్యాలయం ఉన్న చోటుకు చేరుతుంది. దీన్ని కంపెనీ స్టేషన్ అంటారు. అక్కడ పాడైన మెషీన్లు, ఆకలితో, రోగాలతో మృత్యు కోరల్లో చిక్కుకున్న స్థానిక ఆటవికులను చూసి విస్మయం చెందుతాడు. మొదటిసారిగా

# జోసెఫ్ కోన్రాడ్ (1857-1924)

కోన్రాడ్ అసలుపేరు జోసెఫ్ తియోడర్ కోన్రాడ్ కోర్జెనియోవ్స్కీ. తల్లి దండ్రులది పోలిష్ సంతతి. రష్యా సామ్రాజ్యంలోని ఉక్రెయిన్‌లో డిసెంబర్ 3, 1857న పుట్టాడు కోన్రాడ్.

ఈయన తండ్రి అపోలో, పోలిష్ జాతీయ విముక్తి పోరాటంలో పాల్గొన్న యోధుడు. ఫలితంగా ఆనాటి జార్ ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసి, ఉత్తర రష్యాలోని వొలోగ్డా జైలుకు తరలించింది. భర్త వియోగం భరించలేని కోన్రాడ్‌తల్లి క్షయతో మంచం పట్టి 1865లో మరణించింది. అపోలో మంచి సాహిత్యకారుడు కూడా. ఫ్రెంచి, ఇంగ్లీష్ గ్రంథాలను ముఖ్యంగా విక్టర్‌హ్యూగోనూ, షేక్స్పియర్‌నూ పోలిష్ భాషలోకి అనువదించాడు. ఆయన జైలునుండి విడుదలైన కొద్దికాలానికే 1869లో మరణించాడు. మేనమామ పోషణలో పెరిగిన జోసెఫ్‌కు బాల్యం నుండే సముద్ర ప్రయాణాల మీద మోజు. పదిహేనో ఏట ఫ్రాన్స్‌లోని మార్సై పోర్టుకు చేరుకుని తరువాతి ఇరవైఏళ్లు సముద్రం మీదే గడిపాడు. 1878లో బ్రిటిష్ నేవీలో చేరి ఇంగ్లండు నేల మీద తొలిసారిగా అడుగుపెట్టాడు. అప్పటికి జోసెఫ్‌కు ఒక్క ఇంగ్లీషు ముక్క కూడా రాదు. అయితేనేం, పట్టు వదలని విక్రమార్కులే మహానుభావులు. నిర్విరామ కృషితో భాషమీద పట్టు సాధించి 1886లో ఓ కథరాసి పోటీకి పంపాడు. బహుశా అప్పటికే సముద్రయానాలతో మొహం మొత్తిందేమో! రచయితగా కొత్త జీవితం ప్రారంభించాలనిపించి, 1889లో తొలి నవల 'ఆల్మేయర్స్‌ఫాలీ' ప్రారంభించాడు. అయితే చీకటి ఖండం ఆఫ్రికాను చూడాలనే కోరిక మాత్రం ఇంకా తీరలేదు. 1890లో మరోసారి స్టీమర్‌లో ఉద్యోగం సంపాదించి, కాంగోను దర్శించి తన జీవితం ధన్యమైందనుకున్నాడు. ఈ యాత్రా ఫలితమే 'హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్'.

ఆఫ్రికా ప్రయాణంతో ఆరోగ్యం పాడైంది. గవదబిళ్లలు, మలేరియాతో చాలా రోజులు

కర్ట్జ్ అనే వ్యక్తి గురించి కూడా అక్కడే తెలుస్తుంది.

ఆ చీకటి ఖండంలోని చీకటి అరణ్యాల గుండెల్ని చీల్చుకుంటూ ప్రయాణం కొనసాగుతుంది. ఇక అంతా నడకే. అరవై మంది స్థానికులు, సామాన్లు మోసుకుంటూ వెంటవస్తారు. నాగరికులు, సంస్కారవంతులైన యురోపియన్లు తమకు అడ్డొచ్చిన వాళ్లను ఉపేక్షించే ప్రసక్తే ఉండదు. దారిలో బుల్లెట్ గాయాలతో చెల్లాచెదురుగా పడివున్న స్థానికుల శవాలు కనిపిస్తాయి. అక్కడక్కడా ఈ ఆటవికుల గూడేలు కనిపించినా అవి నిర్మానుష్యంగా ఉన్నాయి. ఒకప్పుడు మనుషులు నడిచిన దారిలో ఇప్పుడు కలుపు మొక్కలు ఏపుగా పెరిగాయి. పదిహేను రోజుల నడక తర్వాత కంపెనీ సెంట్రల్ స్టేషన్‌కు చేరుకుంటాడు మార్లో. అయితే అక్కడో కొత్త సమస్య ఎదురవుతుంది. మార్లో నడపాల్సిన స్టీమర్ నీటిలో మునిగిపోయింది. దాన్ని పైకి తీసి, రిపేరు చేయాల్సిన బాధ్యత కూడా తనదే. పైగా అవసరమైన పరికరాలు, సిబ్బంది కూడా లేరు. మొత్తంమీద మూడు నెలలు శ్రమించి స్టీమరును బాగు చేస్తాడు. అక్కడున్నన్నాళ్లు యూరోపియన్ల దమనకాండ, దౌష్ట్యం, లాభార్జన కోసం స్థానికులను నిర్దాక్షిణ్యంగా చిత్రహింసలకు గురిచేస్తున్న వైనం కళ్లారా చూస్తాడు. దంతాలు, రబ్బరు, ఖనిజసంపదల అన్వేషణ కోసం వచ్చిన యూరోపియన్లతో కాంగోనదిమీద ప్రయాణం పునః ప్రారంభమవుతుంది.

★ ★ ★

కర్ట్జ్‌ను ఇంతవరకూ చూడలేదు

బాధపడ్డాడు. 1894లో 'ఆల్మేయర్స్‌ఫాలీ' ప్రచురణతో సాహితీ జీవితం ప్రారంభమైందని చెప్పవచ్చు. రెండో నవల 'ఎన్ ఔట్‌కాస్ట్ ఆఫ్ ది ఐలాండ్స్' తర్వాత ఓ ఇంగ్లీషు యువతిని పెళ్లాడాడు కోన్రాడ్. కాని సుదీర్ఘ సముద్రయానాల దుష్ఫలితాలు అతణ్ణి వెంటాడాయి.

మోకాళ్ల నొప్పులతో కదలలేని స్థితి వచ్చింది. పెద్దనవల రాసే ఓపిక లేక కథలు ప్రచురించాడు. కోన్రాడ్ రాసిన గొప్ప సముద్ర సాహసగాథ 'నిగ్గర్ ఆఫ్ ది నార్సిసస్' 1897లో అచ్చయింది. ఆ వెంటనే అప్పటి ప్రసిద్ధ రచయితలు స్టీఫెన్ క్రేన్, ఆర్నాల్డ్ బెనెట్, హెచ్.జి. వెల్స్, హ్యూవాల్‌పోల్, 'ఫోర్డ్ మేడో ఫోర్డ్'లతో పరిచయమేర్పడింది.

టేల్స్ ఆఫ్ అన్‌రెస్ట్, ది ఇన్‌హెరిటర్స్, టైఫూన్, నోస్ట్రోమో, సీక్రెట్ ఏజెంట్, ది సీక్రెట్ షేరర్, విక్టరీ, ది షాడోలైన్, ది ఆరో ఆఫ్ గోల్డ్, టేల్స్ ఆఫ్ హియర్‌సే తదితరాలు ఆయన ఇతర రచనలు.

'కథలు రాయటమెలా?' అన్న ఔత్సాహికుల ప్రశ్నలకు కోన్రాడ్ ఇచ్చిన జవాబు-

కథానాయకుడన్నవాడు సామాన్యులకు అసాధ్యమైన పనులన్నీ చేయగలగాలి. రాక్షసులతో యుద్ధాలు చెయ్యాలి. రహస్యాలు ఛేదించాలి. అడ్డంకులను అధిగమించి విజేతగా నిలవాలి. పంచేంద్రియాలతో గ్రహించిన జ్ఞానమంతా కథాగమనంలో పాఠకుడికి చేరాలి.

★ ★ ★

1899లో బ్లాక్‌వుడ్స్ మేగజైన్‌లో మూడుభాగాల పెద్ద కథగా వచ్చిన 'హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్' 1902లో పుస్తకంగా అచ్చయింది.

కాంగో ఫ్రీస్టేట్‌ను అప్పటి బెల్జియంరాజు రెండో కింగ్ లియోపాల్డ్ తన స్వంత ఎస్టేట్‌గా మార్చుకుని రబ్బరు, దంతాల(ఐవరీ) కోసం, అక్కడి జనాభాలో సగం మందిని చిత్రహింసలకు గురిచేసి, నరమేధానికి పాల్పడిన వైనం ఈ నవలలోని కథా వస్తువు. కోన్రాడ్ స్పందించింది ఈ దారుణాలకే అయినా, కథలో ప్రస్తావన అన్యాపదేశంగానే ఉంటుంది.

నోబెల్ గ్రహీత, బ్రిటిష్ మహాకవి టి.ఎస్. ఇలియట్ రాసిన కవిత 'హాలో మాన్'కు ఈ కథలోని కొన్ని పంక్తులే ప్రేరణ.

కథా రచనకు కొత్త కొలమానాన్ని నెలకొల్పింది 'హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్' అంటారు విమర్శకులు.

మార్లో. కాని అతడు గొప్ప సాహసికుడనీ, దంతపు వ్యాపారంలో నిష్ణాతుడనీ, సంపదను వెదుక్కుంటూ అడవుల్లోకి వచ్చిన చాలామంది తెల్లవాళ్లు మృత్యువాతపడ్డారనీ తెలుస్తుంది.

కర్టిజ్ స్థావరమైన ఇన్నర్ స్టేషన్‌వైపు పడవ కదులుతుంది. అది రెండు నెలల ప్రయాణం. దారి చూపటానికి ఇరవైమంది నరమాంస భక్షకులు తోడుగా వుంటారు. నాగరికతకు అలవాటుపడిన యూరోపియన్లకిది మరో వింత లోకం. కొన్ని శతాబ్దాలు వెనక్కి చేస్తున్న ప్రయాణమది. ఇక్కడి వాళ్లు ఆటవికులే. కాని వీళ్లలో మానవత్వం వుంది. సంపద కోసం వచ్చి, వీళ్లను వేటాడుతున్న నాగరికులే నిజమైన ఆటవికులు అంటాడు మార్లో.




కర్టిజ్ స్థావరం, ఇంకా యాభై మైళ్లుండగా, ఒక పాడుపడిన పాక, అందులో కొంత వంటచెరుకూ కనిపిస్తాయి. సముద్రయానాన్ని గురించిన ఒక పుస్తకం కూడా అక్కడ పడివుంటుంది. 'చీకటి హృదయం'లోకి ప్రవేశించాననుకుంటాడు మార్లో.

మరో రెండు రోజులు గడుస్తాయి. ఇన్నర్ స్టేషన్ ఇంకా ఎనిమిది మైళ్ల దూరంలో వుంది. కాని దట్టమైన పొగమంచులో పడవ ముందుకు కదలలేదు. అల్లంత దూరం నుండి కేక వినిపిస్తుంది. ఆ వెంటనే మరికొన్ని కేకలు, రోదనలు.

ఎక్కడా ఏమీ కనిపించదు. ఏడుపు తప్ప మరేమీ వినిపించదు. పడవలో వున్నవాళ్లు భయంతో వణికిపోతారు. కాని మార్లోకు తెలుసు. స్థానికులు ఆటవికులే అయినా, అకారణంగా ఎవరినీ చంపరు. అంత అమానుషంగా చంపగలిగేది తెల్లవాళ్లే.

మరో అరమైలు కదులుతుంది పడవ. ఎదురుగా ఒక ద్వీపం కనిపిస్తుంది. దాన్ని చేరుకోవాలంటే తీరంవెంట పయనించాలి. కాని అది చాలా ప్రమాదకరం. ఆటవికులు తమ మీద దాడిచేసే అవకాశముంది. అంతలోనే కొన్ని వేల బాణాలు పడవ మీద వర్షిస్తాయి. సరంగు నదిలోకి దూకుతాడు. కాని బాణం తగిలి మరణిస్తాడు. పడవకున్న పెద్ద విజిల్ ఊదుతాడు మార్లో. ఆటవికులు అడవిలోకి పారిపోతారు. పరిస్థితేమిటో ఎవరికీ తెలీదు.

సరంగు మృతదేహాన్ని పడవలోకి చేర్చుతాడు మార్లో. నరమాంస భక్షకులకిది నచ్చదు. మొత్తం మీద పడవ ఇన్నర్ స్టేషన్‌కు చేరుతుంది. ప్రయాణికుల్ని దగ్గరకు రమ్మని సైగ చేస్తాడొక యూరోపియన్. అతడు కర్ట్జ్ కాదు, సముద్ర ప్రయాణం గురించిన పుస్తకం అతనిదే. కర్ట్జ్‌తో పరిచయాన్ని మార్లోకు వివరిస్తాడతడు.

"రెండేళ్లుగా కర్ట్జ్ నాకు తెలుసు. అతడు జబ్బు పడితే తనే సేవ చేశాడు. ఆటవికుల మీద పట్టు సాధించిన కర్ట్జ్ దంతాల సేకరణ కోసం అనేక దాడులు నిర్వహించాడు. తనకు అతడంటే అభిమానం. అతడే తన హీరో. దంతాల సేకరణ కోసమే ఇంత దూరం వచ్చి ఇన్ని కష్టాలెదుర్కుంటున్నాం గనక, స్థానికుల్ని చంపినా తప్పులేదు. అయితే ప్రస్తుతం కర్ట్జ్ ఆరోగ్యం క్షీణించింది. అతడికి వైద్య సహాయం అవసరం. త్వరగా తీసికెళ్లమని మార్లోను అర్థిస్తాడు.

అలా అతడి అభ్యర్థన మేరకు కర్ట్జ్ నివాసానికెళతాడు మార్లో. ఇంటిచుట్టూనే ఓ కంచె వేసి ఉంటుంది. కంచె మీద మానవ కంకాళాలు, నాగరికతకు ఆదివాసులు కట్టిన స్వాగత తోరణాల్లా వేళ్లాడుతున్నాయి. అంతలో కొందరు స్థానికులు, కర్ట్జ్‌ను స్ట్రెచర్ మీద మోసుకొస్తారు. అతడి మొహంలో జీవకళ లేదు. బట్టతల. దంతపు బొమ్మలా తెల్లగా ఉన్నాడు. కొన్ని ఉత్తరాలు మార్లోకు అందచేసి బోటులోనే విశ్రమిస్తానంటాడు కర్ట్జ్. ఒక ఆదివాసి సుందరి అతడి వెంట వస్తానని వేడుకుంటుంది. నిజానికి అటవీ సంపద దోపిడీలో కర్ట్జ్ ఎవరికీ తీసిపోడు. మార్లో ప్రయాణించిన పడవ మీద దాడి చేయించింది కూడా అతడే.

చీకటి పడటంతో అందరూ నిద్రకుపక్రమిస్తారు. అర్థరాత్రి ఏదో చప్పుడై, ఉలిక్కిపడి లేస్తాడు మార్లో. కర్ట్జ్ కనిపించడు. చుట్టూ నరమాంస భక్షకులు. అంతర్ధానమైన ఒక సహశ్వేత జాతీయుడు. పైగా స్థానికుల పట్ల అతడు చెయ్యని ఘోరం లేదు. వెదకటానికి ఒంటరిగానే బయల్దేరుతాడు మార్లో. నదీ తీరంలో అడుగు జాడలు కనిపిస్తాయి. దూరంగా కర్ట్జ్ కదల్లేక, జంతువులా వంగి, చేతుల సాయంతో ఒక్కొక్క అడుగూ పాకుతున్నాడు. అతికష్టం మీద అతణ్ణి ఒప్పించి మళ్లీ పడవలోకి చేర్చుతాడు మార్లో. ఆదివాసీ సుందరిని పెళ్లాడాలనుకున్నాడు కర్ట్జ్. కాని ఇప్పుడా కల చెదిరిపోయింది. కొంత దూరం ప్రయాణం తర్వాత, రిపేరు కోసం ఆగుతుంది పడవ. అప్పటికే కర్ట్జ్ ఆరోగ్యం క్షీణించింది. తెలిసిన వైద్యం చేస్తాడు మార్లో. కాని కాసేపటికే తుది శ్వాస విడుస్తాడు కర్ట్జ్ అతడి చివరి మాటలు 'హారర్! హారర్!'

★ ★ ★

ఓ రకంగా ఇది నిజంగా జరిగిన





# బాత్‌రూం ఎన్నికలు!



ధనికదేశాల్లోని ప్రజల తీరుతెన్నులు చూస్తే పేద దేశాలవారికి కొన్ని విషయాల్లో ఆశ్చర్యంగా ఉంటుంది. ఉదాహరణకి కెనడాలోని టోరంటో నగరంలో ఇటీవల బెస్ట్ బాత్‌రూం ఏదో తెలుసుకునేందుకు టోరంటో పౌరులకి చిన్న ఎన్నిక జరిపారు. వాటిలో గెలుపొందిన మొదటి ఐదు బాత్‌రూంలలో తిరిగి మూడింటికి ఎన్నిక జరిపారు. ఆ




తర్వాత ఆగస్ట్ 31, 2009న ఆ మూడింటిలో ఉత్తమమైన బాత్‌రూం ఎంపికకు మళ్ళీ ఎన్నిక జరిపారు. స్పైస్‌రూట్ బిస్ట్రో అండ్ బార్‌లోని బాత్‌రూం అత్యుత్తమమైనదిగా ఎన్నికయింది. తర్వాతి స్థానాలు మెట్రో టోరెంటో కన్వెన్షన్ సెంటర్‌లోని బాత్‌రూం, మూడోస్థానం మిల్‌డ్రెట్స్ టెంపుల్ కిచెన్ అనే రెస్టారెంట్‌లోని బాత్‌రూం గెలుచుకున్నాయి. ది షాంగ్రీలా హోటల్, కాక్టిస్ క్లబ్బులోని బాత్‌రూంలు బేంకోవర్ నగరంలో మొదటి రెండు స్థానాలు సాధించాయి.

# సోదరి కోసం..



మాస్కో యూనివర్సిటీలో సీటుకోసం ప్రవేశ పరీక్ష రాయడానికి జసుస్కయ్ తరపున ఆమె సోదరుడు యస్లెన్ ఆడవేషంలో హాజరయ్యాడు. పరీక్ష కూడా రాశాడు. అయితే ఓ సెక్యూరిటీగార్డు అతని అధిక మేకప్ చూసి, అనుమానించడంతో ఆ మోసం బయటపడింది. జర్నలిజంలో సీటుకోసం ఈ ప్రయత్నం జరిగింది.

ప్రయాణం. మరో పద్ధతిలో అంతర్ముఖుడైన మార్లో తన గతంలోకి చేసిన ప్రయాణం.

తెల్లవాళ్లు, నల్లవాళ్లను దోపిడీ చెయ్యటం నాగరికతా లక్షణమా? అని ప్రశ్నిస్తాడు కోన్రాడ్. అంతరాత్మ లేని మనుషులే 'ఖాళీ మనుషులు' అనే అర్థంలో హాలోమాన్ కవిత రాశాడు ఇలియట్.

చిత్రకారులు రంగుల్ని అర్థవంతంగా వాడినట్టు, కథనరీతిలో వెలుగు/ చీకట్ల వర్ణనల ద్వారా తెలుపు, నలుపు మనుషుల గురించి చెప్పాడు రచయిత. అయితే ఏది నలుపు? యూరోపియన్ నాగరికత నలుపు. నల్లగా ఉన్నా ఆఫ్రికన్లే స్వచ్ఛమైన తెలుపు.

★ ★ ★

1889లో నాగరిక ప్రపంచం ఆఫ్రికాలోని కాంగో గురించి తొలిసారిగా తెలుసుకుంది. 1875 నుండే వివిధ దేశాల సాహసికుల బృందాలు అక్కడి సంపదను, సహజవనరులను అంచనా వెయ్యటానికి వెళ్ళాయి. ఇది తెల్లవాడి రాక్షసప్రవృత్తికీ, సంపదను లూటీ చెయ్యటం కోసం నరమేధానికైనా వెనుదీయని దౌష్ట్యానికీ నిదర్శనం. అప్పటికి అందరికీ ఆఫ్రికా 'చీకటి ఖండం'గానే తెలుసు. కాంగో యాత్రలు ఎక్కువగా బ్రస్సెల్స్ నుండే ప్రారంభం కావటం గమనార్హం. కోన్రాడ్, 'రివర్‌బోట్ కెప్టెన్' ఉద్యోగం కోసం అక్కడికెళ్ళినప్పుడు మొదటిసారిగా కాంగో గురించి విన్నాడు.

ఒక మిత్రునికి రాసిన లేఖలో, "ఇక్కడికి వచ్చినవాళ్లలో అరవై శాతం మంది ఆర్నెల్లు తిరక్కుండానే వెళ్లిపోతారు. మిగతావాళ్లు రోగాల బారిన పడతారు. ఎంతటి మొండి వాళ్లైనా ఏడాదికి మించి ఉండరు. నాదేమో మూడేళ్ల వుద్యోగం!" అంటూ దిగులు పడ్డాడు కోన్రాడ్.

– ఎం.వసంత

చిన్న కొడుకు శ్రీరామ్‌కు పేదింటి పిల్ల దివ్యతో పెళ్లి నిశ్చయిస్తుంది సువర్ణ. నిజానికి దివ్య అందం, చదువు చూసి సువర్ణ పట్టుబట్టి ఆ సంబంధం ఖాయం చేస్తుంది. అయితే దివ్యతో ఈ పెళ్లి కుదిరి ఉండక పోతే తన కూతురిని శ్రీరామ్‌కు ఇచ్చేదాన్నని సువర్ణకంటే ఐశ్వర్యవంతురాలైన ఆమె మిత్రురాలు చెబుతుంది. అప్పటినుంచీ సువర్ణలో తన అంతస్తుకు తగని సంబంధం ఖాయం చేశానన్న ఓ రకమైన అసంతృప్తి... ఈ నేపథ్యంలో కాబోయే అత్తాకోడళ్ల నడుమ తలెత్తిన మనస్పర్ధలు కథను ఏ దిశగా నడిపించాయి? ఆర్థిక అసమానతలు అందమైన మనసుల మధ్య ఎలాంటి అగాధాలను సృష్టిస్తాయో కరుణార్ద్రభరితంగా చిత్రించిన పొత్తూరి విజయలక్ష్మి నవల ఏనాడు ఏ జంటకో చతుర నూతన సంవత్సర కానుక!



"ఏవండీ! మధ్యాహ్నం వచ్చేటప్పుడు పుల్లారెడ్డికి వెళ్ళి స్వీట్స్ తెండి. జీడిపప్పు పాకం, కాజా బర్ఫీ తీసుకోండి. ఇంట్లో మైసూర్ బజ్జీ చేస్తాను" అంది శాంత.

"మళ్ళీ నాన్న అటు వెళ్ళటం ఎందుకమ్మా? నాకు దగ్గరవుతుంది కదా! నేను తెస్తాలే" చెప్పింది దివ్య.

"అదేమిటే! నువ్వు ఆఫీసుకి వెళ్తావా? సెలవు పెట్టమన్నాను కదుటే!" శాంత కాస్త విసుక్కుంది.

"నేను సెలవు అడిగాను కానీ వీల్లేదన్నారు. మధ్యాహ్నానికల్లా వచ్చేస్తాలే!"

"ఏం వస్తావే? ఒకసారి వెళ్తే రావటం నీ చేతుల్లో ఉందా? వాళ్ళు అయిదున్నరకి వస్తామన్నారు! నువ్వెప్పుడొస్తావు? ఎప్పుడు తయారవుతావు? " అంటూ భర్త వైపు చూసిన శాంతకి ఒళ్ళు మండింది.

అంతా తయారై టీవీ చూస్తూ స్తంభంలా నిలబడి ఉన్నాడాయన. అసలా సమయానికి ఆఫీసుకి వెళ్ళిపోవాలి. కానీ సచిన్ టెండూల్కర్ తొంభైదాకా సర్రున దూసుకొచ్చిన వాడల్లా అక్కడి నించీ మీనమేషాలు లెక్క పెడుతున్నాడు. ఆ సెంచరీ ఏదో కొట్టేస్తే చూసి వెళ్ళాలని ఆగాడు.

"ఇదుగో చూస్తున్నారా దీన్ని? " అంది శాంత.

"ఆ! చూస్తూనే ఉన్నా. ఇంకా ఆరు రన్స్ కావాలి. ముందుకొచ్చి సిక్సర్ కొట్టేస్తే ఒక్క షాట్. కానీ ఈ కండీషన్లో అంత ఛాన్సు తీసుకోడులే. కాబట్టి ఈ ఓవర్లో కష్టమే" అన్నాడు రాజా.

"దిక్కుమాలిన క్రికెట్టు. దీంతో మాచెడ్డ చిరాగ్గా ఉంది. వాడెవడో సెంచరీ కొడతాడో, మానతాడో వాడిష్టం. మీరు కాస్త నా మాట వింటారా!" అరిచింది శాంత.

ఉలిక్కిపడి ఇహలోకంలోకి వచ్చాడు.

"ఆ! చెప్పు ఏంటీ" అన్నాడు కంగారుగా.

"ఇవ్వాళ పెళ్ళిచూపులు పెట్టుకుని ఇది ఆఫీసుకెళ్తుందిట. వద్దంటే వినడంలేదు. కాస్త మీరు చెప్పండి" అంది.

టీవీలో ప్రకటనలు వస్తున్నాయి.

"అదికాదురా అమ్మలూ!" అంటూ చెప్పేవాడల్లా ఆగిపోయాడు. దివ్యకి ఏమి చెప్పనక్కర్లేదు. అన్నీ తెలుసు. ఎప్పుడేం చెయ్యాలో అప్పుడాపని చక్కగా చేస్తుంది. అంతేకాదు- అమ్మకీ నాన్నకీ కూడా సలహాలు ఇస్తుంది. కాబట్టి ఇప్పుడు చెప్పాల్సింది కూతురికి కాదు భార్యకి.

"చూడు శాంతా" అంటూ చెప్పబోయి అక్కడ సచిన్ మళ్ళీ బ్యాట్ చేత్తో పట్టుకుని రెడీ అయ్యేసరికి, మళ్ళీ ఆ టీవీకి కళ్ళప్పగించేశాడు.

శాంతకి ఓర్పు నశించిపోయింది. "ఆ టెండూల్కర్ ఔటు అవ్వాలి. అప్పుడుగానీ కుదరదు మీ తిక్క" అనేసింది.

అక్షరాలా అదే జరిగింది. బాల్‌ని పైకి కొట్టాడు. 'సిక్సర్' అని అరిచాడు రాజా. కానీ బౌండరీలైన్ వద్ద ఎగిరి బంతిని పట్టుకున్నాడు ఫీల్డరు. ఖిన్నుడైపోయాడు.

"ఛ. ఎప్పుడు చూసినా అపశకునం మాటలు తప్ప శుభం పలకవు కదా!" విసుక్కున్నాడు.

"కొంపేం మునిగిపోలేదు. వంద కొట్టినా కొట్టకపోయినా అతనికి రావాల్సిన లక్షలూ కోట్లూ ఎలాగా వచ్చేస్తాయి గానీ మీరు కాస్త ఆ క్రికెట్ ప్రపంచంలోంచి బయటపడితే నేను ఆనందిస్తాను" అంది.

"సరే. బయటపడ్డాను. ఏమిటో చెప్పు!"

"ఇవ్వాళ మీ కూతురుకి పెళ్ళి చూపులు. ఆ విషయం గుర్తుంది కదా? "

"భలేదానివే. ఎందుకు గుర్తులేదూ? మధ్యాహ్నం త్వరగా వచ్చేసి అన్ని ఏర్పాట్లు చూస్తానని చెప్పాను కదా!"

"చెప్పార్లెండి. మీరు త్వరగా వచ్చేసినా నాకు ఒరిగిపడేది ఏమీ ఉండదు. వచ్చినా

మీ ఫోన్లు చేసుకోవటమో, టీవీ చూడ్డమో, లేకపోతే తీరిగ్గా తయారవటంతోనో గడిపేస్తారు. నేను భయపడేది దీని గురించి. ఇది ఆఫీసులోనో, ట్రాఫిక్‌లోనో ఇరుక్కుపోయి ఆఖరి నిముషంలో ఆదరాబాదరాగా దిగుతుందేమో? లేకపోతే పెళ్ళివారొచ్చేక వస్తుందేమో? అని నా భయం" చెప్పింది శాంత.

"ఛ. అలా చెయ్యదు శాంతా! ఏ మాత్రం అనుమానంగా ఉన్నా అసలు ఆఫీసుకే వెళ్ళదు. వెళ్తానందీ అంటే సమయానికి వస్తాననే ధైర్యముంది దానికి. నువ్వారికే కంగారుపడకు" అని ధైర్యం చెప్పాడు.

శాంతకి ఇంకేం మాట్లాడాలో తోచలేదు. ఇంట్లో తనెన్ని ఆలోచనలు చేసినా వ్యర్థం. వాళ్ళు చెయ్యాలనుకున్నదే చేస్తారు.

వాకిలిదాకా వెళ్ళింది.

రాజా బైక్‌ను, దివ్య ఏక్టివాను స్టార్ట్ చేసుకుని ఒకరికొకరు బై చెప్పుకున్నారు. తర్వాత ఇద్దరూ శాంతకి చేతులూపి చెరో దిక్కు వెళ్ళిపోయారు.

రాజా చాలా అందంగా ఉంటాడు. దానికితోడు చాలా శ్రద్ధగా తయారవుతాడు. 'నేను చేసే ఉద్యోగంలో నా ఆహార్యం, మాటతీరు చాలా ప్రముఖ పాత్ర వహిస్తాయి' అంటాడు. మడతనలగని ఇస్త్రీ బట్టలు, మెళ్లో టై, నిగనిగలాడే బూట్లు వేసుకుంటాడు. జుట్టు పొడిగా ఉన్నా జాగ్రత్తగా దువ్వుకుంటాడు.

దివ్య తండ్రికి తగ్గ కూతురు. దివ్య పుట్టినప్పుడు ఆ చంటిబిడ్డను లేబర్ రూమ్ లోనించి బయటకు తీసుకురాగానే చూసిన వారంతా ఆశ్చర్యపోయారు. సాధారణంగా పిల్లలకి మూడోనెల దాటాకగానీ పోలికలు తెలియవు. 'ఇదేంటి బాబూ అచ్చుగుద్దినట్లు తండ్రిపోలికలు స్పష్టంగా తెలిసిపోతున్నాయి' అన్నారు. ఇక రాజా సంబరం వర్ణనాతీతం. అపురూపంగా ఆ పసిబిడ్డని ఎత్తుకునేవాడు. పగలంతా పడుకుని రాత్రి జాగారం చేయించేది పాప. 'నీకు రేపు ఆఫీసుంది కదా నాయనా? నేను చూసుకుంటాలే! నువ్వు పడుకో' అనేది అత్తగారు. అయినా వినేవాడు కాదు. 'ఫర్వాలేదు. నాకు నిద్రరావటం లేదు' అనేవాడు.

నెలరోజులైనా నిండని ఆ పసిపాపతో బోలెడు కబుర్లు చెప్పేవాడు. భవిష్యత్తు గురించిన తన ప్రణాళికలన్నీ వివరంగా చెప్పేవాడు. శాంత ఎగతాళి చేసేది. అయినా వినేవాడు కాదు. 'ఇదుగో ముందే చెప్తున్నా. నువ్వు మా విషయాల్లో జోక్యం కలిగించుకోకు' కచ్చితంగా చెప్పేవాడు. తెల్లవారుజామున నాలుగింటికి పాపాయి ఆవలిస్తూంటే అత్తగారికి దాన్ని అందించి, అప్పుడు తనూ పడుకునేవాడు.

ఎనిమిదింటిదాకా నిద్రపోయి అప్పుడు లేచి గబగబా తయారై ఆఫీసుకి వెళ్ళిపోయేవాడు.

పాపకు మూడో ఏడు వచ్చాక అతని తల్లి, 'ఏవిట్రా అబ్బాయ్! మరి వంశోద్ధారకుడు ఉండొద్దా?' అంటూ కాస్త సణగటం మొదలుపెట్టింది.

భార్యతో ఆ విషయం చర్చించాడు. తన ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రం. చెల్లెలి పెళ్ళి తనే చేశాడు. తండ్రికేమీ ఆదాయం

## కొత్తగాలి...

**చెట్టుకీ**
**మనసు ఉంది**
**పువ్వులే**
**దానికి సాక్ష్యం**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు,
నెల్లూరు

లేదు. వాళ్ళ బాధ్యతా తనమీదే ఉంది. 'మన శక్తికి ఈ ఒక్కబిడ్డా చాలని నా అభిప్రాయం. నీ ఆలోచనేమిటి? ' అన్నాడు.

శాంతకి ఇంకో బిడ్డ కావాలనే ఉండేది మనసులో. దివ్యకీ పెద్దయ్యాక తోడుగా మరొకరుంటారు అనుకునేది. కానీ లోతుగా ఆలోచిస్తే కష్టమేమో అనిపించింది. అందుకే భర్త అభిప్రాయంతో ఏకీభవించింది.

'సరే, అయితే పెద్దవాళ్ళకి మాత్రం ఏమో ఆ దేవుడివ్వలేదు' అనే చెప్దాం అన్నాడు. అలానే చెప్పారు కూడానూ.

తండ్రి అందమే కాదు తెలివితేటలు, చురుకుదనం అన్నీ పుణికి పుచ్చుకుంది

**కొత్తగాలి...** 

**నాయనలోని ప్రేమ**
**అమ్మలోని అనురాగం**
**కలగలుపే**
**నాయనమ్మ**

– రఘుపాత్రుని శ్రీనివాసరావు,
శ్రీకాకుళం

దివ్య. ఆమె కాస్త పెద్దదై పన్నెండేళ్ళ పిల్ల అయ్యేసరికి రాజా స్నేహితులు ఏడిపించేవారు. 'ఒరే! నీ కూతురికోసం నువ్వు స్వయంవరం ఏర్పాటు చేయ్యాల్సిందే. ఏ మత్స్యయంత్రమో పెట్టాలి' అనేవాళ్ళు.

ఎంసీఏ పాసయింది. కేంపస్ ఇంటర్వ్యూలోనే మంచి ఉద్యోగం వచ్చింది. చక్కటి పిల్ల. చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. చాలామంది పెళ్లి చేసుకుంటామని కబుర్లవీ పెట్టారు. కానీ రాజాకే ఇష్టం లేదు. 'అప్పుడేనా? ఇంకో రెండు మూడేళ్ళు ఆగాక చేద్దాం' అనుకున్నాడు.

దివ్య కూడా ఆ మాటే అంది.

కానీ రెండేళ్ళు ఆగకుండానే పెళ్ళికి మొగ్గవలసి వచ్చింది.

ఒకరోజు దివ్య తన కొలీగ్‌తో షాపింగ్‌కి వెళ్ళింది. అక్కడ ఆ కొలీగ్‌కి తెలిసినవాళ్ళు కనిపించారు. 'వీళ్ళు మా ఫేమిలీ ఫ్రెండ్స్' అని పరిచయం చేసిందా కొలీగ్.

ఆ ఫేమిలీ ఫ్రెండ్స్‌లో ఉంది సువర్ణ. ఆవిడ చాలా డబ్బుగల కుటుంబంలో పుట్టి పెరిగింది. భర్త శ్రీధర్‌కి మంచి బిజినెస్. బంజారాహిల్స్‌లో పెద్ద ఇల్లు. హంగూ ఆర్భాటం అన్నీ ఉన్నవాళ్ళు. ఆవిడకి ఇద్దరు కొడుకులు. ఇద్దరూ తండ్రి బిజినెస్‌నే వృద్ధి చేస్తున్నారు.

పెద్దవాడు శ్రీకాంత్. తనతో చదువుకునే అమ్మాయినే ప్రేమించాడు. మరి అన్నీ విచారించే ప్రేమించాడో లేదా కాకతాళీయంగా జరిగిందోగానీ ఆ అమ్మాయి అన్ని విధాలా వాళ్ళకు సరిసమానమైన స్థాయిలోనే ఉంది. ఎవరికీ ఏమీ అభ్యంతరం అనిపించలేదు. సరే అన్నారు. నిశ్చితార్థం కూడా అయిపోయింది. కానీ పెళ్ళి మాత్రం కాలేదు.

కారణం ఆ అమ్మాయి అక్కకి ఇంకా పెళ్ళికాలేదు. కాబట్టి వీళ్ళ పెళ్ళి కూడా ఆపారు. ఆ అమ్మాయి పేరు పూజ. చదువుకుంది. బోలెడంత ఆస్తి ఉందిగానీ పిల్ల సుమారుగానే ఉంటుంది. సువర్ణ చాలా అందంగా ఉంటుంది. కొడుకులిద్దరూ తల్లి పోలికే. ఆవిడ కాబోయే కోడలిని చూసి కాస్త నిరుత్సాహపడింది.

అది పసిగట్టిన శ్రీధర్, భార్యకి నచ్చచెప్పాడు. "వాడికి నచ్చింది. మిగిలిన విషయాలన్నీ బావున్నాయి. నువ్వేదో మనసులో పెట్టుకుని బాధపడటం తెలివిగల పనికాదు. నీలోని అసంతృప్తిని ఆ అమ్మాయి గ్రహించిందనుకో.. చాలా గొడవలు వస్తాయి. ఈ కాలం పిల్లలు ఆవలిస్తే పేగులు లెక్కపెడుతున్నారు. కోరి

# కాప్షన్ మీదే - 25



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

## ఉత్తమ వ్యాఖ్య :

వస్తే... రండోయ్... పిట్టలూ!
కానీ తివాచీ మీద వెయ్యకండి రెట్టలు!

–బొడ్డాల నిర్మలారావు
బరంపురం, ఒడిషా





## కాప్షన్ మీదే -24

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

మన ప్రైమ్ మినిష్టర్ గారే!
నింగినంటిన ధరల్ని దించడానికట!

– సి.భానుమూర్తి, కోదాడ, నల్గొండ జిల్లా

ఎగిరి ఎగిరి రెక్కలు నొప్పెడుతున్నాయి.
మాయా తివాచీ ఎక్కి పోదాం పద!

– పి.శ్రీనివాసరావు, రాజమండ్రి

మాయా తివాచీ మీద ఎగిరినంత సులువు కాదు!
రాష్ట్ర సమస్యల్ని పరిష్కరించడం
శాంతి పావురాలను బతకనివ్వడం!

–వేలేటి శ్రీనివాసరావు, విజయనగరం

ఏరియల్ సర్వే అని ఇలా ఎయిర్‌లో
తిప్పుతున్నారేంటి?
ఇప్పుడు సుడిగాలి వస్తే నా గతేంటి?!

–పిడపర్తి విజయలక్ష్మి, కాకినాడ

కోరి అనర్థం కొనితెచ్చుకున్నట్లవుతుంది.

అందులోను మన అబ్బాయిలవి ఉద్యోగాలు కావు. వేరే వెళ్లే అవకాశాలు తక్కువ. అందరం కలిసే ఉండాలి. అలా ఉండాలంటే అందరం సన్నిహితంగా ఉండాలి. అందుకు మనసులో ఏ కలతలూ ఉండకూడదు. ఈ ఇంటికి ఇల్లాలివి నువ్వు. ఈ ఇంటి మంచిచెడ్డలు పూర్తిగా నీ మీదే ఆధారపడి ఉన్నాయి. కాబట్టి మనసులో ఉన్న అసంతృప్తిని మొగ్గగా ఉండగానే తొలగించేసెయ్. ఆనందంగా ఉండు. ఏమాత్రం అటూ ఇటూ అయినా మన కుటుంబం ముక్కలైపోతుంది. జాగ్రత్త" హెచ్చరించాడు.

## కొత్తగాలి...

**అప్పటి**
**మైక్రో రుణం**
**ఇప్పుడు**
**మెగా భూతం**

*– మరో భారతీయుడు*

భర్త చెప్పిన మాటలు అక్షర సత్యాలని గ్రహించింది సువర్ణ. అందుకే మనసులోని అసంతృప్తిని లోపలే దాచుకుని పైకి తృప్తిగా, సంతోషంగా ఉంది. పూజని ఎంతో ప్రేమగా చూసుకుంటోంది.

పెళ్ళి కాకపోయినా తరచూ వస్తూపోతూనే ఉంటుంది పూజ. పెద్దకోడలు విషయంలో మనసు కుదుర్చుకోవలసి వచ్చింది కాబట్టి రెండో కోడలి విషయంలో ఆ లోటు లేకుండా చూసుకోవాలనుకుంది. ఎక్కడ కంటికి నచ్చిన అమ్మాయి కనిపించినా పరీక్షగా చూడటం ఆవిడకు అలవాటయిపోయింది. ఎక్కడైనా చక్కని పిల్ల కనిపిస్తే వివరాలు సేకరించడం వగైరా పనులు చేసేది. కులం ఒకటి కాదనో, మరో కారణం వల్లనో అవి ఏవీ ముందుకు సాగలేదు.

షాపులో దివ్యను చూసిన దగ్గర్నుంచీ సువర్ణకి ఒకటే ఆరాటంగా ఉంది. చాలా చక్కగా ఉంది. ఒక్కసారి ఆ అమ్మాయిని చిన్నకొడుకు శ్రీరామ్ పక్కన ఊహించుకునేసరికే ఆవిడ మనసు ఉప్పొంగిపోయింది. షాపింగ్ ముగించుకుని ఇంటికి రాగానే ఆ ఫేమిలీ ఫ్రెండ్‌కి ఫోన్ చేసింది. 'ఇందాక మీ అమ్మాయి షాపులో కనిపించింది. వెంట తన కొలీగ్ ఉంది. ఆ అమ్మాయి వివరాలు కావాలి' అని అడుగుదామనుకుంది. తీరా చూస్తే వాళ్ళ నెంబరు మారిపోయింది. ఇంకెవరెవరికో ఫోన్లు చేసి ఎలాగైతేనేం ఆ అమ్మాయి నెంబరు సంపాదించింది.

"చూడమ్మా నిన్న నీతో వచ్చిన అమ్మాయి పేరేంటి? వాళ్ళ వివరాలు చెప్తావా? " అడిగింది సువర్ణ.

ఆ అమ్మాయికి విషయం అర్థం అయిపోయింది. ఏ ఆలోచనా లేకుండానే తీరికగా కూర్చుని అపరిచితుల వివరాలు అడగరెవరూ. అందుకే చిన్నగా నవ్వి, "ఏమిటి ఆంటీ? మీ అబ్బాయికి పెళ్ళి ప్రయత్నాలు మొదలుపెట్టారా? " అడిగేసింది.

సువర్ణ కాస్త ఇబ్బంది పడింది. అయినా చల్లకొచ్చి ముంత దాచటం అనవసరం కాబట్టి "అవునమ్మా. పెద్దబాబుకి ఎలాగా కుదిరిపోయింది. చిన్న బాబుకీ కుదిరితే ఇద్దరికీ ఒకేసారి పెళ్ళిళ్ళు చేసేద్దామని వుంది" చెప్పింది.

"ఆ అమ్మాయి పేరు దివ్య. తనొక్కతే కూతురు" అంటూ వివరాలు చెప్పింది దివ్య కొలీగ్. అన్నీ రాసుకుంది సువర్ణ.

ఆ కొలీగ్ దివ్యతో ఆ విషయం

## ముందుకు రండి!

నిన్నటి నిజం

వెన్నుపోటు పొడవటం రాజకీయాల్లో మామూలే. కుర్చీలో ఉన్నవాడిని కిందకు లాగి, దాన్ని ఇతరులు ఆక్రమించడం చూస్తున్నదే. రాజకీయాల్లో భ్రష్టత్వం స్వాతంత్ర్యానికి పూర్వమూ కొంచెం ఉండేది. అయితే నేడున్నంత పతనం అప్పట్లో లేదు. అప్పటి మన నాయకుల్లో 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అద్వితీయులు. కానీ ఆయన రాజకీయ చదరంగంలో ఎన్నో ఎదురు దెబ్బలు తిన్నారు. అయితే ఆయన దానికి చింతించేవారు కాదు. తేలిగ్గా నవ్వేవారంతే.



ఒకరోజు గోపాలకృష్ణయ్య గుర్రపు బండిలో జిల్లా కార్యాలయానికి బయలుదేరారు. బండిలోకి వెనకవైపు నుంచి ఎక్కి కూర్చోగానే గుర్రం మెడకు కట్టిన నొగలు పైకి లేచాయి. గుర్రం ముందుకాళ్లు రెండింటినీ పైకెత్తి వెనక కాళ్ళ మీద నిలబడింది. బండి తోలే సాయెబు 'అయ్యా పంతులుగారూ.. మీరంత వెనుక ఉండిపోతే ఎలా? కొంచెం ముందుకు రండి' అన్నాడు. బండి దిగగానే గోపాలకృష్ణయ్య ఎప్పుడూ ఇచ్చే పావలాకు బదులు రెండు పావలాలు ఇచ్చారు. అది చూసి సాయెబు 'నా కిరాయి పావలానేనండీ' అన్నాడు.

'అది కాదు మిత్రమా! ఇందాక వెనక ఉండిపోతే ఎలా, ముందుకు రండి- అన్నావు. ఇప్పటివరకూ నువ్వొక్కడే నాతో ఆ మాట అన్నది. నేనెక్కడ ముందుకు పోతానో అని కాళ్లు పట్టుకుని లాగేవాళ్లే ఎక్కువ. నువ్వు అంత మంచిమాట అన్నావు. అందుకే ఈ రెండో పావలా' అన్నారు. ఆయన మాటలు అర్థంకాక బిక్కపోయి చూస్తున్న సాయెబును, గోపాల కృష్ణయ్యను చూస్తూ అక్కడ గుమిగూడిన వారంతా నవ్వుకున్నారు

చెప్పింది. "నిన్న మనం షాపింగ్‌కి వెళ్ళినప్పుడు ఓ ఆంటీ కనిపించారు, గుర్తుందా? " అని అడిగింది.

"ఆవిడని అంత తేలికగా మర్చిపోతామా? ఎంత అందంగా వున్నారు? ఈ వయసులోనే ఇంత అందంగా వున్నారంటే వయసులో ఇంకెంత అందంగా వుండేవారో కదా! నిన్నరాత్రి అమ్మతోకూడా చెప్పాను" అంది దివ్య.

"పోన్లే. ఆవిడ నీకు అంతగా నచ్చటం శుభసూచకం" అందా అమ్మాయి.

"ఆవిడ నాకు నచ్చటమేమిటి? ఇవేమైనా పెళ్ళి చూపులా? " నవ్వేసింది దివ్య.

"ఒక విధంగా అంతే మరి? ఆవిడకి నువ్వు చాలా నచ్చావుట. నన్నడిగి నీ వివరాలు తీసుకున్నారు!"

దివ్య నిరాకరించింది. "నా వివరాలా? నావివరాలు ఆవిడకెందుకూ? "

"ఆవిడకి ఓ అబ్బాయి వున్నాడు. అతనికి పెళ్ళిచేసే ఆలోచనలో వుందావిడ!"

"చాల్లే ఊరుకో. ఎక్కడో బజార్లో కనబడిన మనిషి వివరాలడగటం ఏమిటి? " దివ్యకి చిరాగ్గా అనిపించింది.

"ఏం అడిగితే? తప్పా? ఇప్పటికి వివరాలు మాత్రమే అడిగిందంతే. ఈ వ్యవహారం ఇంకా ముందుకి నడిచిందంటే నువ్వు చాలా అదృష్టవంతురాలివి" అంది ఆ అమ్మాయి.

"చాల్లే ఊరుకో. పిచ్చిమాటలూ నువ్వూనూ!"

"పిచ్చి మాటలు కాదు. మంచి మాటలే. ఆగర్భ శ్రీమంతులు ఆంటీ వాళ్ళు. ఇక

వాళ్ళబ్బాయి ముందు ఈ సినిమా హీరో లందరూ బలాదూర్. అంత అందంగా వుంటాడు" చెప్పింది.

"ఇక వదిలేయ్. నాకు చిరాగ్గా వుంది" విసుక్కుంది దివ్య.

ఆ తర్వాత వేరే విషయాలేవో మాట్లాడుకున్నారు.




**స**త్యంగారిని పిలిపించింది సువర్ణ. ఆయన పెళ్ళి సంబంధాలు చూస్తూవుంటాడు. వృత్తి కాదు, సరదాకి. వివరాలన్నీ చెప్పింది. వాళ్ళని కదిపి చూడమంది.

కాస్త సంశయంలో పడ్డాడు సత్యం. "వాళ్ళు ఆ అమ్మాయి పెళ్ళి ఆలోచనలో ఉన్నారో లేదో మరి! కనుక్కుంటాలేండి. ఇప్పుడే ఫోన్ చేస్తాను" అంటూ సెల్ ఫోన్ నుంచి దివ్య ఇంటికి ఫోన్ చేశాడు.

శాంతే తీసింది. తాను ఫలానా అని పరిచయం చేసుకున్నాడు. "మా అమ్మాయికి ఇప్పుడే పెళ్ళి చేసే ఉద్దేశ్యం లేదండీ. మరో ఏడాదో రెండేళ్ళో పోయాక చేస్తాం" ఆవిడ చాలా మర్యాదగానే చెప్పింది.

ఆవిడతో మాట్లాడి "నా అనుమానమే నిజమయిందమ్మా! వాళ్ళిప్పుడే పెళ్ళి చెయ్యరుట" అన్నాడు సువర్ణతో.

"ఇలా ఫోన్‌లో మాట్లాడి తేల్చేసే వ్యవహారం కాదు. మీరు స్వయంగా వాళ్ళింటికి వెళ్తే బావుంటుంది. మనం మాత్రం వెంటనే పెళ్ళి చేసే ఆలోచనలో లేం కదా! మాకూ పెద్దబ్బాయి పెళ్ళికావాలి. ఇవన్నీ వాళ్ళతో చేప్తే పని సానుకూలం అవుతుంది. ఈ విషయంలో అనుభవమున్న మీకు నేను చెప్పాలా? ఎలాగైనా సానుకూలం అయ్యేలాగా చూడండి. మీ కష్టం ఉంచుకోను" అంది సువర్ణ.

సత్యం కూడా ఆలోచించాడు. ఇది లాభసాటి వ్యవహారం. కాబట్టి శ్రద్ధగా చిత్తశుద్ధితో పని చేశాడు. రాజా వాళ్ళింటికి నేరుగా వెళ్ళాడు. అదీ అతను లేని సమయంలో. శాంత దగ్గర ఈ వివరాలన్నీ చెప్పాడు. మొదటిసారి వెళ్ళినప్పుడు శాంత అంత ఆసక్తి చూపించలేదు.

రెండోసారి వెళ్ళి మళ్ళీ మళ్ళీ చెప్తే, కాస్త మెత్తబడింది. "మీరు పిల్ల తల్లి. ఏ తల్లైనా బిడ్డ భవిష్యత్తు దివ్యంగా వుండాలనే కోరుకుంటుంది. ఈ ఏడాది కాకపోతే వచ్చే ఏడాదైనా అమ్మాయి పెళ్ళి చెయ్యాలి కదా! అప్పుడు ఇంత మంచి సంబంధం రాకపోవచ్చు. అదీగాక వాళ్ళు వెంటనే పెళ్ళి చెయ్యమని అడగరు. వాళ్ళ పెద్దబ్బాయి పెళ్ళికి ఇంకా అడ్డంకి వుంది. కాబట్టి మీరు సావకాశంగా పెళ్ళి చేసే వెసులుబాటు కూడా వుంది. వెంటనే వద్దనకుండా నిదానంగా ఆలోచించుకోండి. ఏదో మంచి మాట చెప్పి మాటసాయం చెయ్యడమే గానీ ఈ పెళ్ళి కుదిర్చినందువల్ల నాకేమీ ఒరిగిపడిపోదు" అన్నాడు.

"సర్లేండి, మావారితో మాట్లాడతాను" అంది శాంత.

అన్నట్లే భర్త దగ్గర ఆ ప్రస్తావన తెచ్చింది. "అదేవిటి? ఇంకో రెండుమూడేళ్ళ దాకా దివ్య పెళ్ళి మాట ఎత్తద్దనుకున్నాంగా!" అన్నాడు రాజా ఆశ్చర్యంగా!

"అవుననుకోండి. కానీ ఇది చాలా మంచి సంబంధం" అంటూ వివరాలన్నీ

చెప్పింది.

అంతా విన్నాడు. "అంత గొప్పవాళ్ళతో మనం తూగగలమంటావా? " అంటూ తన సందేహం బయటపెట్టుకున్నాడు.

"మన వివరాలన్నీ తెలుసుకుని వాళ్ళే కబురుపెట్టారు. వాళ్ళకి లేని అభ్యంతరం మనకెందుకు? " అంది శాంత.

కాసేపు ఆలోచించాడు రాజా! "అయితే ఇప్పుడేం చేద్దాం? " అలవాటు ప్రకారం అర్ధాంగినే సలహా అడిగాడు.

"మీ పెద్దనాన్నగారు జాతకాలు చూస్తారు కదా! ముందు ఆ అబ్బాయి వివరాలు అడిగి జాతకాలు చూపిద్దాం. కుదిరితే ఏం చెయ్యాలో అప్పుడాలోచిద్దాం!"

"సరే, అయితే ఆ సత్యంగారికి ఫోన్‌చేసి అతని వివరాలు కనుక్కో!" అన్నాడు రాజా.

"ఇది మరీ బావుంది. నీనెత్తిన తేలు ఉందంటే నీ చేత్తోనే తీసెయ్యమన్నాడుట వెనకటికెవరో. ఆ పనేదో మీరే చెయ్యొచ్చుగా. మళ్ళీ నాకు పురమాయించటం ఎందుకు? "

"ఇలాటి చిన్న చిన్న పనులన్నీ నువ్వు చూసుకో. నా అవసరం వచ్చినప్పుడే దిగుతాను రంగంలోకి" అన్నాడు నవ్వేస్తూ.

మర్నాడు సత్యంకి ఫోన్‌చేసి పెళ్ళికొడుకు వివరాలు అడిగింది. ఆయన చాలా సంతోషించాడు. వెంటనే వివరాలు చెప్పాడు.

ఆ తేదీ, సమయం జాగర్తగా రాసుకుంది శాంత. భర్తకి ఫోన్‌చేసి చెప్పింది. "మీరు మీ పెద్దనాన్నగారికి ఫోన్ చెయ్యండి" అంది.

"నేనా? పీకల్లోతు పనిలో మునిగిపోయి వున్నాను. ఇప్పుడు నేను ఆ వివరాలన్నీ చెప్పాలంటే కష్టం. నువ్వే ఫోన్ చేసెయ్. నువ్వైతే అన్నీ వివరంగా మాట్లాడతావు. నేనొకటి చెప్పి, పది మర్చిపోతాను" అన్నాడు.

## గాంధీజీ చతురోక్తులు



జాతిపిత గాంధీజీ కోట్లాదిమందిలో చైతన్యం నింపిన స్ఫూర్తి ప్రదాత. ఆయన పెదాలపైన చెరగని, నిష్కల్మషమైన నవ్వు ఎంతో మందిని ప్రభావితం చేసింది. జనవరి 30న బాపూజీ వర్ధంతి సందర్భంగా ఆయన చతురోక్తులు కొన్ని..

### నేనే ప్రధాని అయితే..?

గాంధీజీని ఓ విలేఖరి, 'దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మీరు ప్రధాన మంత్రి పదవిని స్వీకరిస్తారా? ' అని ప్రశ్నించాడు.

'నాకెలాంటి పదవులూ వద్దు. ఎందుకంటే అవి ముసలిముగ్గులకు కాదు. యువతరంకోసమే ఆ పదవులు' అన్నారు గాంధీజీ.

'మిమ్మల్ని ఎవరైనా బలవంతం చేసి ఆ పదవిని అంగీకరింపజేస్తే మీరేం చేస్తారు? ' మళ్లీ రెట్టించాడు ఆ విలేఖరి.

'ఏముంది? మీలాంటి విలేఖరుల వెనుక చేరి ఆశ్రయం పొందుతాను' అన్నారు నవ్వుతూ.

"మీకు చెప్పడం నాదీ బుద్ధితక్కువ" విసుక్కుంది శాంత.

తర్వాత పెద్ద మామగారికి ఫోన్ చేసింది. యోగక్షేమాలూ అవీ మాట్లాడాక ఈ పెళ్ళి సంబంధం గురించి వివరంగా చెప్పింది. కాకపోతే వాళ్ళు చాలా డబ్బుగలవాళ్ళు అనేది మాత్రం చెప్పలేదు.

"సరేలే నేను చూసి రెండు మూడు రోజుల్లో ఫోన్ చేస్తాను" అన్నాడాయన.

అన్నాడేగానీ వారంరోజులు గడిచినా ఏ విషయమూ చెప్పలేదు.

ఈలోగా సత్యం రెండుసార్లు ఫోన్ చేశాడు. శాంత విషయమంతా చెప్పింది.

"నేను చూశాను. బాగానే కుదిరాయి జాతకాలు. కానీ శంఖంలో పోస్తేగానీ తీర్థం కాదు కదా! మీవాళ్ళు చెప్తే మీకూ నమ్మకం కుదురుతుంది. కానివ్వండి మరి. వారు మర్చిపోయారేమో! మీరే ఓసారి ఫోన్‌చేసి కనుక్కోండి" అన్నాడు.

అలా పెద్దమామగారికి ఫోన్ చేసి 'ఏమైంది నేను చెప్పిన పని' అని అడగడానికి మొహమాటపడింది శాంత. భర్తని అడిగిందిగానీ, అతని సమాధానం డిటో డిటో. సర్లే ఇంకా వారం ఆగి చూద్దామనుకుంది. ఆ అవసరం లేకుండా ఆయనే చేశారు. "వారం రోజులుగా నాకు జ్వరం. అందుకే చూడలేకపోయాను. ఆ తర్వాత చతుర్దశీ, అమావాస్య వచ్చాయి. ఎందుకులే అని చూడలేదు. నిన్ననే చూశాను. అబ్బాయి జాతకం అద్భుతంగా ఉంది. మంచి ధనయోగం. అమ్మాయి జాతకం కూడా చూశాను. ఇద్దరికీ చక్కగా కుదిరాయి జాతకాలు. కానీ అబ్బాయి జాతక రీత్యా ఒకటి రెండు దోషాలున్నాయి వివాహ విషయంలో. కానీ అవేమంత అపాయకరమైనవి కావు. జపాలు చేయిస్తే సరిపోతుంది. మీరు నిశ్చింతగా ముందుకి వెళ్ళొచ్చు" అన్నారాయన.

ఆ విషయమే భర్తకి చెప్పింది. "అలా అన్నారా? ఆ జపాలూ తపాలూ మనమెక్కడ చేయిస్తాం? వద్దనేద్దాం" అన్నాడు రాజా.

"జపం అంటే మనం కూర్చుని చెయ్యక్కర్లేదు. ఏ గుళ్ళోనైనా చేస్తారు. అదేమంత కష్టమైన పనికాదు" చెప్పింది.

"సరే, అయితే ఆ సత్యంగారికి ఫోన్ చెయ్యి" అన్నాడు.

శాంత ఫోన్ అందుకుని చాలా సంతోషించాడు సత్యం. "రేపు మీ ఇంటికి వస్తాను, వివరంగా మాట్లాడుకుందాం" అన్నాడు.

"రేపు నాకు చాలా ముఖ్యమైన పనులు వున్నాయి. ఆఫీస్‌కి వెళ్ళాలి. సాయంత్రం రండి..." అన్నాడు రాజా.

మర్నాడు సాయంత్రం వచ్చాడు సత్యం. మరోసారి మగపెళ్ళివారి గురించి చెప్పాడు. "మీరు అదృష్టవంతులు. మీ అమ్మాయి వాళ్ళకి నచ్చడం, వాళ్ళకై వాళ్ళే మీ సంబంధం చేసుకోవాలనుకోవడం అంతా కలలోలాగా జరిగిపోయాయి. జాతకాలు కలిసాయి. మీరూ ఇష్టపడ్డారు. శుభం. ఇక మంచిరోజు చూసి మీరొక్కసారి వారింటికి వెళ్ళి పరిచయం చేసుకుని వారిని పెళ్ళి చూపులకు రమ్మని ఆహ్వానించండి. అది మన పద్ధతి" అన్నాడు.

"అలాగే, ఆదివారం నాకు తీరిగ్గా వుంటుంది. వెళ్దాం" అన్నాడు రాజా.

"మీరిద్దరూ రండి" అన్నాడు సత్యం.

"మొదటిసారే నేనెందుకు? అయినా ముగ్గురం వెళ్ళడం మంచిదికాదు. మీరూ ఆయనా వెళ్ళిరండి. తర్వాత నేను వెళ్తా" అంది శాంత.

ఆదివారం ఆటోలో వీళ్ళింటికి వచ్చాడు సత్యం. అప్పటికే సిద్ధంగా వున్నాడు రాజా. దివ్య జాతకం, మంచి ఫొటోలు రెండు ఓ కవర్లో పెట్టి, ఇచ్చింది శాంత. రాజా బైక్‌మీద బయలుదేరారు ఇద్దరూ!

రాజా ఇల్లు ఉప్పల్ దగ్గర. చాలా దూరమే. కానీ ఆదివారం కాబట్టి ట్రాఫిక్ మరీ అంత దారుణంగా, జీవితం మీద విరక్తి కలిగేలా లేదు. నలభై నిముషాల్లో బంజారా హిల్స్‌కి వెళ్ళారు. 'అటు తిరగండి, ఇటు తిరగండి' అని సత్యం దారి చూపిస్తుంటే అలా నడిపిస్తూ చివరికి ఇంటి ముందు ఆగారు.

బైక్ స్టాండ్ వేసి హెల్మెట్ తీసి ఇంటి వైపు చూసిన రాజా బిత్తరపోయాడు.

# బడికోసం రాజీనామా

అనంతపురం విద్యారంగంలో సాధించిన ప్రగతికి కీ.శే. సిరివరం ఆది నారాయణరావు కృషి ఎంతో ఉంది. ఆయన దేశభక్తుడు, జాతీయవాది. దీనికి తోడు షిర్డిసాయి భక్తుడు. ఈ నేపథ్యంలోనే 'శ్రీ సాయిబాబా నేషనల్ హైస్కూల్' అనే పాఠశాలను ఆరు నుండి ఎనిమిదో తరగతులతో




ప్రారంభించారు. తర్వాతి సంవత్సరం తొమ్మిది, పది, ఆపై పదకొండో తరగతులతో ఉన్నత పాఠశాల పూర్తి రూపం దాల్చింది. అందువల్ల మరిన్ని తరగతి గదులను నిర్మించడానికి తగిన ఖాళీ ప్రదేశం అవసరమైంది. స్థానిక సివిల్ లైన్స్‌లో ఉన్న ఒక పెద్ద బంగళా, అక్కడున్న ఏడున్నర ఎకరాల స్థలం అనువైనదిగా కన్పించింది. బళ్లారి వాస్తవ్యులు కోలాచలం వెంకటరావు ఆ ఇంటిని, స్థలాన్ని బొంబాయికి చెందిన సేట్ భీమాజి మోతీజీకి అమ్మేశారని తెలిసింది. బొంబాయి సేట్‌కు ఆదినారాయణరావు సవినయంగా ఆ స్థలం అవసరాన్ని వివరిస్తూ జాబు రాశారు. విద్యా పక్షపాతి అయిన ఆ సేట్ తను కొన్న ధరకే దాన్ని తిరిగి అమ్మేశాడు. వెనువెంటనే ఆదినారాయణరావు ఆ ఖాళీ స్థలములో తరగతి గదుల కోసం షెడ్లు నిర్మించేందుకు పూనుకున్నారు.

అయితే ఆ స్థలం ఆయనకు అంత సులువుగా దక్కలేదు. అప్పటి వరకూ ఆ భవనం అనంతపురం క్లబ్‌వారి ఆధీనంలో ఉండేది. ఆ క్లబ్బులో పెద్ద అధికారులు, ప్రముఖ వ్యక్తులు సభ్యులు. వారికి టెన్నిస్, పేకాట ఆడటానికి ఆ ప్రదేశం ఉపయోగపడేది. ఆదినారాయణరావు దాన్ని కొనేందుకు చేస్తున్న ప్రయత్నం గురించి తెలుసుకొన్న ఆ సభ్యులు, అధికారులు దాన్ని అడ్డుకునేందుకు ప్రయత్నించారు. ఆ స్థలం పోలీస్ సార్జెంట్ క్వార్టర్స్‌కు అవసరమని ప్రభుత్వమే భూ సేకరణ చట్టం కింద ప్రకటన విడుదల చేసింది. కానీ ఆదినారాయణరావు దాన్ని సకాలంలో ఎదుర్కొని ప్రభుత్వంలోని పై అధికారులకు తమ ప్రయత్నం వెనుకనున్న సదుద్దేశాన్ని వివరించారు. ఇక ప్రభుత్వ జోక్యం ఆగిపోయింది.

దీనికంతా కారణమైన స్థానికులైన పెద్దలు ఆదినారాయణరావు పనిచేస్తున్న సహకార బ్యాంకు అధికారులతో చెప్పి ఆయనను మద్రాసుకు ప్రమోషన్‌పై బదిలీ చేయించారు. ఆ బదిలీ విషయంలో తన విన్నపాలను పైఅధికారులు తోసిపుచ్చడంతో ఆయన తప్పని పరిస్థితుల్లో ఆ ఉద్యోగానికి రాజీనామా చేశారు. అలా పూర్తికాలం విద్యాసంస్థ పనుల్లోనే నిమగ్నమయ్యారు. దీంతో క్లబ్బువారు ఆ స్థలాన్ని 'శ్రీ సాయిబాబా నేషనల్ హైస్కూల్'కే వదిలిపెట్టాల్సి వచ్చింది.

రోడ్డుకి ఎత్తుగా వున్న ప్రదేశంలో వుంది ఆ ఇల్లు. కాదు కాదు భవనం. పెద్ద గేటు.

"ఇదా వాళ్ళ ఇల్లు? " అడిగాడు.

"అవును ఇదే! రండి లోపలికి వెళ్దాం" అంటూ ముందుకి నడిచాడు సత్యం.

గేటు దగ్గర కాపలాదారు వున్నాడు. వీళ్ళని చూడగానే "ఎవరి కోసం? " అంటూ నిలదీశాడు.

ఫలానా అని పరిచయం చేసుకుని 'అమ్మగారి కోసం వచ్చాం' అని చెప్పాడు సత్యం. ఈ అనుభవాన్ని ముందుగానే ఊహించి సువర్ణకి ఫోన్‌చేసి మేము ఫలానా టైముకి వస్తామని సత్యం చెప్పాడు. ఆవిడ కాపలాదారుకి ఆ విషయం చెప్పి వాళ్ళని పీకి పాకాన పెట్టకుండా లోపలికి పంపించమని చెప్పే వుంచింది.

కాకపోతే మరీ బొత్తిగా మోటారుసైకిల్



మీద వస్తారని అతగాడు అనుకోలేదు. అందుకే ఒకటి రెండు ప్రశ్నలు వేసి వీరే వారు అని నిర్ధారణ చేసుకుని, గేటు కొద్దిగా తెరిచి లోపలికి పంపించాడు. లోపల పచ్చని లాన్. అందులో బెంచీలు. ఓ పక్క ఉయ్యాల, మరోపక్క స్కోడా, ఇన్నోవా, హోండాసిటీ కార్లు. ఎన్నో పూలమొక్కలు. ఓ చివర కిందికి మెట్లు. ఆ మెట్లు దిగి వెళ్తే కింద తోట వుందనడానికి గుర్తుగా పైకి కనిపిస్తున్నాయి రకరకాల చెట్లు. దాదాపుగా అన్ని పళ్ళచెట్లో వున్నాయి. అదంతా చూస్తున్న రాజాకి

వెనక్కి తిరిగి పారిపోవాలనిపించింది.

తనలాంటి సామాన్యుడు, ఏదో మధ్య వర్తి మాటలు విని, తగుదునమ్మా అని పిల్లనిస్తామని వీళ్ళింటికి వెళ్ళి అడిగితే పిల్ల మాట అటుంచి తండ్రినైన తనకి పెళ్ళిచేసి పంపిస్తారేమో అని భయం వేసింది. కానీ సత్యం మాత్రం దర్జాగా మెట్లెక్కి వెళ్లి బెల్ నొక్కాడు. తలుపు తీసిన పనివాడు వీళ్ళ వివరాలు తెలుసుకుని 'రండి' అని వినయంగా ఆహ్వానించాడు. విశాలంగా వుంది హాలు. పెద్ద సోఫాసెట్. ఎన్నో రకాల అలంకరణలతో శోభాయమానంగా వుంది.

పనివాడు కూర్చోమని మర్యాద చేశాడు. లోపలికి వెళ్ళి పొడవాటి వెండి గ్లాసులతో కొబ్బరినీళ్ళు తెచ్చిచ్చాడు. 'అమ్మగారు వస్తున్నారు' అని చెప్పాడు.

ఆ వాతావరణంలో ఊపిరాడడం లేదు రాజాకి. మరో రెండు నిముషాల తర్వాత లోపలినుంచి వచ్చింది సువర్ణ. సత్యం లేచి నిలబడి నమస్కారం చేశాడు. రాజా కూడా నిలబడి చేతులు జోడించాడు.

"అయ్యో కూర్చోండి" అంటూ సువర్ణ తను కూడా వాళ్ళెదురుగా కూర్చుంది.

"ఈయన రాజా. దివ్యా వాళ్ళ నాన్నగారు" పరిచయం చేశాడు సత్యం.

"క్షమించాలి. మావారూ అబ్బాయిలూ బయటికి వెళ్ళారు. మీరొస్తున్నారని ఇంట్లో వుందామనే అనుకున్నారు. ఏదో అర్జెంట్ పని వచ్చిందిట. వెళ్ళక తప్పలేదు. మిమ్మల్ని ఏమి అనుకోవద్దన్నారు" అంది.

ఏం మాట్లాడాలో అర్థంకాలేదు రాజాకి. ఓ వెర్రి నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

ఆవిడని చూస్తుంటే కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. పౌరాణికగాథల్లో వర్ణించే మహారాణిలాగా వుంది ఆ అందం, ఠీవి.

"మీరెక్కడ పనిచేస్తున్నారు? మీ శ్రీమతిగార్నీ తీసుకురావాల్సింది. మీకెంతమంది పిల్లలు? మీ స్వంత ఊరెక్కడ? " సువర్ణే మాట్లాడుతూంటే అడిగిన వాటికి సమాధానం చెప్తున్నాడు రాజా.

పనివాడు ట్రాలీలో ఫలహారాలు పెట్టి తోసుకుంటూ వచ్చాడు. ఆవిడ స్వయంగా ప్లేట్లల్లో పెట్టి అందించింది. వెజిటెబుల్ కట్లెట్లు, స్వీటు అందించింది. కాఫీ కూడా పనివాళ్ళు తెస్తే తనే అందించింది.

కాఫీలు అయ్యాక రాజాగారూ! "ఏవీ అమ్మాయి ఫొటోలు, జాతకం" అన్నాడు సత్యం.

మెల్లగా తీసి ఇచ్చాడు రాజా!

ఆవిడ ఫొటో చూసి నవ్వేసింది. "నేను అమ్మాయిని అదివరకే చూసేశాను. కదా!" అంది ప్రసన్నంగా.

"జాతకం కూడా వుంది. వీరి పెద్దనాన్నగారు చూశారట. బాగా కుదిరాయి. మరి మీరు కూడా చూపించుకుంటే బావుంటుంది" అన్నాడు సత్యం.

"ఎవరు చూసినా అవే జాతకాలు కదండీ! అయినా మాకు అంత పట్టింపులేం లేవు" అంది సువర్ణ.

మరో రెండు నిముషాలు ఆగి "ఇక మనం వెళ్దామా" అన్నాడు రాజా!

"అలాగే! అమ్మా! మరి మేము బయలుదేరతాం" అన్నాడు సత్యం.

"సమయానికి ఆయన లేకుండా అయిపోయింది. లేకపోతే అన్నీ వివరంగా మాట్లాడుకునే వాళ్ళం" అంది సువర్ణ.

లేచి ఆవిడకి నమస్కారం పెట్టారు. ఆవిడ గుమ్మందాకా వచ్చి సాగనంపింది. గేటు దాటి బైక్ స్టార్ట్‌చేసి గుండెనిండా ఊపిరి పీల్చుకున్నాడు రాజా!

"ఏంటి సార్? ఏం మాట్లాడరేం? " అన్నాడు సత్యం.

"ఏం మాట్లాడతానండీ నామొహం. వాళ్ళేదో అమ్మాయిని చూసి మురిసిపోయారు. సరే! కానీ వాళ్ళ అంతస్థేవిటి? నా అంతస్థేవిటి? ఆశకైనా హద్దుండాలి.

నేను తూగలేను. మాకొద్దండీ" అనేశాడు రాజా కాస్త చిరాగ్గా.

"అదికాదండి. వార్నికైవారు అడిగారు కాబట్టి!"

చెప్పబోతుంటే వారించాడు రాజా. "ఇక ఆ విషయం మర్చిపోండి. నాకు ఇష్టం లేదు" కచ్చితంగా చెప్పేశాడు.

సత్యానికీ విసుగేసింది. "సర్లేండి. మీ అమ్మాయి వివాహం మీ ఇష్టం. మధ్యవర్తిని నేనేం చెప్పగలను. నన్ను ఈ పక్కన దించేయండి" అన్నాడు.

బైక్ పక్కకి తీసి ఆపితే దిగిపోయాడు. మరోసారి నమస్కారం పెట్టి ముందుకి వెళ్ళిపోయాడు రాజా.

★ ★ ★

ఇంట్లో కాలుగాలిన పిల్లిలా తిరిగేస్తోంది శాంత. దివ్య మాత్రం ఏ విధమైన ఆదుర్దా లేకుండా టీవీ చూస్తోంది. తల్లి కంగారు చూసి బాగా ఆటపట్టిస్తోంది.

"అనవే! అను. రేపు నీకు పెళ్ళై పిల్లలు పుట్టాక తెలిసివస్తుంది" అంటోంది శాంత. అంతలోనే వచ్చేశాడు రాజా.

వాకిట్లోకే ఎదురెళ్ళింది.

"వెళ్ళారా? ఏమైంది? " అడిగేసింది.

"చెప్తాను. ముందు లోపలికి రానిస్తావా? " విసుక్కునాడు. లోపలికొచ్చి బూట్లు విప్పి సోఫాలో కూర్చున్నాడు. మంచినీళ్ళు తెచ్చిచ్చి పక్కనే కూర్చుంది శాంత. దివ్య కూడా టీవీ ఆపేసి వినడానికి సిద్ధమైపోయింది.

భర్త మొహం చూస్తుంటే గంభీరమైన సమాచారం అందజేయబోతున్నాడని అర్థమైంది శాంతకి. బరువుగా నిట్టూర్చాడు రాజా. "అంత శ్రమపడి వెళ్ళడం దండగే అనిపించింది శాంతా? " అన్నాడు.

శాంతకి మనసు చివుక్కుమంది.

"అసలేమైంది? " అడిగింది.

"వాళ్ళు చాలా గొప్పవాళ్ళు. డబ్బున్న వాళ్ళు. వాళ్ళతో మనం తూగలేం"

"వాళ్ళ ప్రవర్తనలో అహంకారం కనిపించిందా? " అడిగింది.

"ఛ! అలాటిదేం లేదు. ఆవిడ ఎంతో మర్యాదగా ప్రవర్తించారు. ఆయనా, వాళ్ళ అబ్బాయిలూ ఏదో పనిమీద బయటకెళ్ళారుట. వాళ్ళను కలవటం వీలవ్వలేదు" అన్నాడు.

"అదేమిటి మీరొస్తున్నారని తెలిసి కూడా వెళ్ళారా వాళ్ళు? "

"ఏదో ఊహించని పని వచ్చిపడిందిట. వెళ్ళాల్సివచ్చిందని ఆవిడ చాలా బాధపడుతూ చెప్పారు!" అంటూ టీవీ పెట్టాడు.

శాంతకి చాలా చిరాగ్గా అనిపించింది. వెంటనే టీవీ ఆపేసింది. "ఏవిటండీ? అడిగినదానికి మాత్రం సమాధానం చెప్పి ఊరుకుంటే ఏం జరిగిందో నాకెలా తెలుస్తుంది? ఇదేమైనా మీ ఆఫీసు వ్యవహారమా నాకెందుకులే అని ఊరుకోవడానికి! నా కూతురి పెళ్ళి విషయం! అసలేం జరిగింది? వాళ్ళేమన్నారు? మీరేమన్నారు? అన్నీ వివరంగా నాకు చెప్పి అప్పుడు తీరిగ్గా చూడండి టీవీ" అంది విసురుగా.

చిన్నగా నవ్వేశాడు రాజా. "నేను చెప్పాల్సిందీ.. నువ్వు వినాల్సిందీ ఏమీ లేదు. వారింటికి వెళ్ళాను. అది ఇల్లు కాదు. రాజప్రాసాదంలా వుంది. పెద్ద గేటు. ఆ గేటు దగ్గర కాపలాదారు. ఇంటి ముందు విశాలమైన లాన్. పక్కనే చక్కని తోట. ఇంటి ముందు మూడు కార్లు, నౌకర్లు, అంతా లక్ష్మీప్రసన్నం. అడుగడుగునా వారి ఐశ్వర్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

ఇక ఆవిడ గురించి చెప్పాలంటే నాతరం కాదు. ఆ అందం, ఆ హుందాతనం మనం కథల్లో చదువుకునే మహారాణిలా వుంది. ఐనా కాస్త కూడా గర్వం లేదు. ఎంతో మర్యాదగా వుంది. అన్నీ వున్న ఆకు అణిగి మణిగే ఉంటుందనే

## రాయలసీమ అంటే..?

నిన్నటి నిజం

అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాల భౌగోళిక ప్రాంతాన్ని 'రాయలసీమ' అంటున్నాం. పూర్వం బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను 'దత్త మండలం' అనేవారు.

అవి స్వాతంత్ర్యోద్యమ రోజులు. మన దేశం, మన జాతి అంటే ఉత్సాహం పెల్లుబికేది.




తమ ప్రాంతాన్ని దత్త మండలం అనడం ఆ ప్రాంత ప్రజకు ఎంత మాత్రమూ నచ్చలేదు. అనంతపురం జిల్లా నాయకులు కల్లూరు సుబ్బారావు, పప్పూరు రామాచార్యులు, నీలం సంజీవరెడ్డి ప్రభృతులు అప్పుడున్న దత్త మండలం పేరుకు బదులుగా వేరొక పేరు వెదకాలని తర్జనభర్జన పడ్డారు.

వెదకబోయిన తీగ కాలికి అడ్డం తగిలిన చందమైంది. చిలుకూరి నారాయణరావు 1927లో బదిలీపై అనంతపురం వచ్చారు. అలాగే 1928లో నంద్యాలలో జరిగిన 'ఆంధ్ర మహాసభ"ల్లో 'దత్తమండల సమావేశం' ఉన్నందున ఈ విషయం చర్చించడానికి ఓ వేదిక దొరికింది. చిలుకూరివారికి, పప్పూరి రామాచార్యులకూ సాహిత్యరంగం సాన్నిహిత్యమేర్పరచింది. దత్తమండలంలోని నాలుగు జిల్లాలూ కృష్ణదేవ రాయలు ఏలిన ప్రాంతంలోనివి గనుక ఆ ప్రాంతాన్ని రాయలసీమగా పిలవాలని పప్పూరివారికి చిలుకూరివారు వివరించారు. దాంతో పప్పూరివారు సమావేశంలో తీర్మానం ప్రవేశ పెట్టారు. దానిని ఆమోదించారు కూడా. అలా రాయలసీమ అని పేరు వచ్చింది. ఆనాడు రాయలసీమ అంటే బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలు. 1956లో భాషాప్రయుక్త రాష్ట్రాలేర్పడటంతో బళ్లారిజిల్లా కర్నాటకకు పోగా చిత్తూరు రాయలసీమలోకి చేరింది.

మాటకు అక్షరాలా తగినట్లుగా వుంది" చెప్పాడు రాజా.

"ఆవిడ మన అమ్మాయి గురించి ఏం మాట్లాడారు? "

"అమ్మాయి గురించి ఏమీ మాట్లాడలేదు. ఇదివరకే చూశానని అంది. జాతకాల పట్టింపులేమీ లేవుట వారికి"

"మరి మీరేం మాట్లాడారు? "

"ఏం మాట్లాడతాను? "

"ఏడిసినట్లు వుంది. ఇందుకా మిమ్మల్ని పంపించింది? వారి మనసులో ఏముందో అడగొద్దా? అమ్మాయిని చూసుకునేందుకు రమ్మని చెప్పాలి కదా? మీరు సరే, అయోమయం మేళం అనుకున్నా ఆ మధ్యవర్తి ఏం చేస్తున్నాడు? " విసుక్కుంది.

"చూడు! ఆవిడ ఎక్కడో మన అమ్మాయిని చూశారు. కబురు చేశారు. వెళ్ళాను. అంతవరకూ బాగానేవుంది. కానీ వాళ్ళింటికి వెళ్ళి వారి స్థితిగతులు చూశాక నేను పెళ్ళిమాట ఎత్తితే నాఅంత తెలివితక్కువవాడు ఈ భూమ్మీద మరొకడు వుండడు. అద్దె ఇంట్లో ఉంటూ నెలజీతం మీద ఆధారపడి బతుకుతున్న సామాన్యుడిని నేను. అంత గొప్పవారితో తగుదునమ్మా అని వియ్యమందడానికి సాహసిస్తే నిప్పులగుండంలో దూకినట్లే. అందుకే ఈ సంబంధానికి ఓ దణ్ణం. ఆ సత్యంగారితో ఆ మాటే చెప్పేశాను. ఈ విషయానికి ఇంతటితో ఫుల్‌స్టాప్ పెట్టేద్దాం" అన్నాడు.

అంతా విన్న శాంత మొహం వాడిపోయింది. మెల్లగా లేచి లోపలికి వెళ్ళిపోయింది. రాజా కూతురివంక చూశాడు.

హాయిగా నవ్వుతూ టీవీ పెట్టింది దివ్య. ఆ తండ్రీ కూతుళ్ళు ఏమీ జరగనట్లే మామూలుగా సరదాగా కబుర్లాడుకుంటూ భోజనం చేశారు. ఆ తర్వాత అలవాటు ప్రకారం పేకాడుకున్నారు. సాయంత్రం బయటికి వెళ్ళిపోయారు. పేకాటకీ, బయటికి వెళ్ళేందుకూ శాంతనీ రమ్మన్నారు. కానీ రానంది. ముభావంగానే వుంది.

ప్రతీ విషయాన్నీ భూతద్దంలో చూసి దిగులుపడిపోవటం ఆవిడకి అలవాటే. కాబట్టి అటువంటి సమయాల్లో ఆవిడని వదిలేసి వూరుకోవడం తప్ప వేరే దారి లేదు. ఓ రోజో రెండ్రోజులో బాధపడి మళ్ళీ మామూలు స్థితికి వచ్చేస్తుంది.

వాళ్ళిద్దరూ వెళ్ళాక శాంత దిగులుగా కూర్చుంది. భర్తమీద కోపం, విసుగు. ఈనాటి ఈ స్థితికి అతనే కారణం. పిల్ల పెళ్ళీడుకి వచ్చినా ఇంకా తాడూబొంగరం లేనట్లుగా వుంది సంసారమంటే అందుకు కారణం రాజాయే. చిన్నపిల్లవాడిలా ప్రవర్తిస్తాడు. ప్రతీ విషయాన్నీ తేలిగ్గా కొట్టిపారేస్తాడు. అతని కుటుంబంలో అతనే పెద్ద కొడుకు. ఒక చెల్లెలు, ఇద్దరు తమ్ముళ్లు. అప్పట్లో వాళ్ల చదువులకీ పెళ్లికీ అండగా నిలబడ్డాడు. అలా అని తన జీవితంలో ఏలోటూ రానివ్వలేదు. ప్రతీవారం సినిమాకి వెళ్ళాల్సిందే. సినిమా అయ్యాక హోటల్‌కి వెళ్ళాలి. ఏడాదికి ఒకసారి ఏదో ప్రదేశానికి వెళ్ళి ఉల్లాసంగా గడిపిరావాలి. సంఖ్యలో తక్కువే అయినా మంచి బట్టలు కట్టుకోవాలి. దర్జాగా బతకాలి. కష్టాలూ చిరాకులూ దగ్గరికి రానివ్వకూడదు. చీకూచింతా లేనట్లు గడుపుతాడు.

ఈ కారణంగా యాభై ఏళ్ళు దాటినా అతనికి స్వంత ఇల్లుగానీ, బ్యాంక్‌లో ఘనమైన నిల్వగానీ లేదు. కూతురి కోసం చిన్నతనంలోనే ఏదో పాలసీ తీసుకున్నాడు. అందులో కొంత చదువుకోసం ఖర్చైపోయింది. రెండు మూడు లక్షలు మాత్రం వున్నాయి విడిగా.

'అవేం సరిపోతాయి. బంగారం ధరలు చూశారా ఎలా వున్నాయో! మరీ తక్కువగా కాకుండా ఓ మోస్తరుగా పెళ్ళి చేయాలన్నా ఏడెనిమిది లక్షలు ఖర్చవుతాయి. ఎలా?' అని దిగులుపడిపోతూవుంటే నవ్వేస్తాడు రాజా!

'ఏం ఫర్వాలేదు. ఏదైనా లోన్ తీసుకుందాం. అయినా ఎప్పటి విషయమో ఆలోచించి ఇప్పుడు తలనొప్పి తెచ్చుకోడం అనవసరం' అని కొట్టిపారేస్తాడు.

రెండేళ్ళ కింద ముగ్గురూ కలిసి కులూ మనాలీ వెళ్ళొచ్చారు. ఆ టూర్‌కి పాతికవేలపైనే అయింది. నిరుడు రాజస్థాన్ యాత్ర ముప్పైవేలు దాటింది. ఎందుకీ దండగమారి ఖర్చులు అంటుంది శాంత. ఏం కాదు. ఇవీ అవసరాలే. ఒంట్లో శక్తి వున్నప్పుడు ఇలా తిరిగి నాలుగూ చూసేస్తే, శక్తి తగ్గిపోయాక డబ్బు కూడబెట్టొచ్చు అంటాడు.

ఇప్పుడీ సంబంధం విషయంలో రాజా అభిప్రాయం విన్న దగ్గర్నుంచీ శాంతకి చాలా అసహనంగా వుంది. ఆ జల్సా ఖర్చులూ మానేసి అందరిలా తామూ వుంటే చక్కగా స్వంత ఇల్లుండేది. మరీ ఖరీదైన కారు కాకపోయినా హీనపక్షం మారుతీ ఓమినీ వ్యాను అయినా వుండేది. అప్పుడు సంఘంలో తమకూ కొంచెం గౌరవమైన స్థానం వుండేది. తలుచుకున్న కొద్దీ ఏడుపొచ్చేసింది.

తండ్రీ కూతుళ్ళు ఊరంతా చుట్టబెట్టి బయటే భోజనం చేసి శాంత కోసం ఫ్రైడ్ రైస్ పార్సిల్ చేయించుకొని రాత్రి పదింటికి వచ్చారు.

"ఏవిటి అమ్మగారూ అలక తీరిందా!" అన్నాడు రాజా ఎగతాళిగా.

"అమ్మా! ఫ్రైడ్‌రైస్ చల్లారిపోతుంది.

త్వరగా తిను" అంది దివ్య.

"నాకు వద్దే. ఆకలి లేదు" అంది విసుగ్గా శాంత.

దివ్యకి కోపం, నవ్వూ ముంచుకొచ్చేయి. "ఏవిటమ్మా! మరీ చిన్న పిల్లలాగా! రా! అన్నం తిను" అంటూ తల్లిని లాక్కొచ్చి టేబుల్ ముందు కూర్చోబెట్టింది.

శాంతకి రాజీ పడక తప్పలేదు. ఇంకా వద్దంటే ముద్దలు చేసి నోట్లో పెడుతుంది. అంత మొండిది దివ్య.

మెల్లిగా తినటం మొదలుపెట్టింది! "ఏంటమ్మా ఎందుకింత దిగులుపడిపోతున్నావు? ఇప్పుడేమైందనీ? " అంది దివ్య ఆదరంగా.

"చెప్తే మాత్రం నీకు ఓ పట్టాన అర్థం అవుతుందా? మీ ఇద్దరికీ ఏమీ పట్టదు. నేను చెప్పినమాట వినరు, సరికదా ఎగతాళి చేస్తారు. ఈయనకంటే అయిదేళ్ళు చిన్నవాడు బాబయ్య. చక్కగా ఫ్లాట్ కొనుక్కున్నాడు. పిల్ల పెళ్ళికోసం బంగారం కొని పెట్టేసింది మీ పిన్ని. డబ్బు కూడా రెడీ చేస్తున్నాడట. ఈయనా ఉన్నారు ఎందుకూ? కాస్త ముందుచూపు ఉండుంటే మనకీ స్వంత ఇల్లూ, కారూ, బోలెడంత డబ్బూ వుండేవి. వెతుక్కుంటూ వచ్చిన మంచి సంబంధం వద్దు పొమ్మనే స్థితి వచ్చేది కాదు" అంది దీనంగా.

నవ్వేసింది దివ్య.

"ఆదా నీ బాధ. నీకెందుకు? నేనున్నానుగా! నీకు డబ్బే కదా కావల్సింది. నేను వేరే ఉద్యోగం వెతుక్కుంటా. ఇంకా ఎక్కువ జీతం వస్తుంది. నాన్న జీతం ఆయనిష్టం. నా జీతం మొత్తం నీకిచ్చేస్తా! బ్యాంకులో దాచెయ్! కారే కొంటావో.. నగలే కొంటావో నీ ఇష్టం! అప్పుడేది కొనాలన్నా అప్పు తీసుకుని కొనేయొచ్చు. ఒక రెండేళ్ళు గడిచేసరికి నువ్వు కారు కొనే స్థాయికి ఎదిగిపోతాం" అంది.

"అప్పటిదాకా ఈ సంబంధం మన కోసం కాచుక్కూర్చుంటుందా? ఇంత మంచి సంబంధం మళ్ళీ వస్తుందా? " విసుగ్గానే అడిగింది శాంత.

"ఏమో! నువ్వేగా చెప్తావు! మన జీవితంలో జరగాల్సినవన్నీ ఆ పైవాడు ముందే నిర్ణయించేస్తాడని? "

దివ్య మాటలకు నవ్వేసింది శాంత. "మాటల్లో నిన్ను గెలవలేనే తల్లీ. అన్నీ నాన్న పోలికలే" అనేసింది.

రెండ్రోజులు బాధపడి ఆ తర్వాత ఆ విషయం మర్చిపోయి మామూలుగానే ఉంది శాంత. హమ్మయ్య అనుకున్నాడు రాజా. ఆ వేళ ముగ్గురూ సినిమాకెళ్ళారు. సినిమా బావుంది. పిచ్చి ఫైటింగులూ, రక్తపాతాలూ లేవు. సరదాగా, హాయిగా వుంది. ప్రేక్షకులకి ఉన్న తెలివి కూడా వూడిపోకుండా ఉల్లాసం కలిగించేలా ఉంది. అందుకే తేలికపడిన మనసుతో బయటికి వచ్చారు. తిన్నగా హోటల్ కి వెళ్ళి భోజన కార్యక్రమం కూడా పూర్తి చేసుకుని ఇంటికి వచ్చారు. దాదాపు పది గంటలు దాటింది. ఇంట్లో అడుగు పెడుతూ వుండగా ఫోన్ మోగుతోంది. వెంటనే వెళ్ళి ఫోన్ తీశాడు రాజా.

అటువైపు నుంచి ఆడవాళ్ళ గొంతు "హల్లో.. అది రాజాగారి ఇల్లేనా? "

"అవునండీ. నేను రాజాని"

"నమస్కారం! నేను సువర్ణని. బావున్నారా? "

ఎవరో వెంటనే గుర్తురాలేదు రాజాకి. గుర్తు తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తూ ఉండిపోయాడు. ఇతను మాట్లాడకపోయే సరికి ఆవిడకు అనుమానం వచ్చింది.

"నేను శ్రీధర్‌గారి భార్యను. మొన్న ఆదివారం మీరు మా ఇంటికి వచ్చారు" నవ్వుతూనే చెప్పింది.

కంగారుపడిపోయాడు రాజా! "నమ

స్కారం మేడమ్! క్షమించండి. వెంటనే గుర్తు పట్టలేకపోయాను" అన్నాడు.

"ఫర్వాలేదులెండి. అయినా ఇంతకు ముందెప్పుడూ నేను మీకు ఫోన్ చెయ్య లేదు కదా!" అంది.

'ఒక్క క్షణం మా వారు మీతో మాట్లా డతారుట!' అనేసరికి మరీ కంగారు వేసింది రాజాకి.

వెంటనే శ్రీధర్ లైన్లోకి వచ్చాడు. "నమ స్కారమండీ! క్షమించాలి. ఆవేళ మీరు వచ్చినప్పుడు అర్జెంటు పనుండి వెళ్ళిపో యాను" అన్నాడు.

"అయ్యో ఎంతమాట!" అనేశాడు రాజా.

"మీరు బయటికి వెళ్ళారా? చాలా సేపటి నుంచీ మీతో మాట్లాడాలని ప్రయత్ని స్తున్నాం" అన్నాడు శ్రీధర్.

"సినిమాకి వెళ్లామండీ"

"సరే! సినిమా తర్వాత ఏదో హోటల్ కి వెళ్లే ప్రోగ్రాం కూడా వుంటుంది కదా!" అన్నాడాయన.

"అవునండీ. ఇప్పుడే ఇంట్లోకి వస్తున్నాం!" చెప్పాడు రాజా!

"అయ్యో అలాగా! అయితే నేను మళ్ళీ ఫోన్ చేస్తాను!" అన్నాడాయన.

"అయ్యో ఫర్వాలేదండీ"

"మళ్ళీ తెల్లారితే సవాలక్ష పనులూ వ్యవహారాలూ! అందుకే ఇప్పుడైతే తీరిగ్గా మాట్లాడొచ్చని ఫోన్ చేశాను" అన్నాడు.

ఆ తర్వాత మామూలుగా లోకాభిరామా యణం మాట్లాడుకున్నారు ఇద్దరూ.

"ఇంతకీ నేనెందుకు ఫోన్ చేశానంటే మీకు అంగీకారమైతే ఒకసారి మీ ఇంటి కొస్తాం"

హఠాత్తుగా ఆ ప్రస్తావన వచ్చేసరికి ఏం చెప్పాలో అర్థం కాలేదు రాజాకి.

"ఇంట్లో మా ఆవిడతో మాట్లాడి మళ్ళీ మీకు ఫోన్ చేస్తాను" అన్నాడు.

"అవున్లెండి. ఇటువంటి వ్యవహారాలలో వాళ్ళదేగా తుది నిర్ణయం. మా ఇంట్లోనూ అంతే. ఏదో బయటి పనులు నేను చూసు కుంటాను. మిగిలినవన్నీ మా సువర్ణే చూసుకుంటుంది. మీరు వారితో మాట్లాడి మాకు చెప్పండి. వారికి నమస్కారాలు చెప్పండి" అని ఫోన్ పెట్టేశాడు శ్రీధర్.

రాజాకి ఒళ్ళంతా చెమటలు పట్టాయి. సోఫాలో కూలబడిపోయాడు. లోపలికి వెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చింది శాంత.

"ఎవరిదీ ఫోన్? కాఫీనా? హార్లిక్సా? ఏం తాగుతారు?" అంటూ వంటింట్లోకి వెళ్ళబోతూ అతని వాలకం చూసి ఆగి పోయిందామె.

"ఏమిటండీ? ఎవరి ఫోన్?" అంటూ పక్కనే కూర్చుంది.

"శ్రీధర్‌గారు ఫోన్ చేశారు! అదే మొన్న నేను వెళ్లలా బంజారాహిల్స్‌లో వాళ్లిం టికి? ఆయనే ఫోన్ చేశారు" చెప్పాడు.

"వాళ్ళా? ఏమంటారు?"

"మనం రమ్మంటే వచ్చి దివ్యను చూస్తా రుట!" అంటూ తల పట్టుకున్నాడు.

శాంతకీ తల గిర్రున తిరిగింది.

"మనం వద్దనుకుంటున్నామని చెప్పక పోయారా?"

"ఏమో శాంతా! ఆయన అంత మర్యాదగా మాట్లాడుతుంటే నేను కొట్టి నట్లు సమాధానం చెప్పలేకపోయాను"

"మరి చెప్పకపోతే ఎలా? ఇవ్వాళ కాక పోతే రేపైనా మన నిర్ణయం వారికి తెలి యజేయాలి కదా!"

"ఏమో మరి! అంతా అయోమయంగా వుంది నాకు. వాళ్ళు ఫోన్ చేస్తారని కల్లో కూడా అనుకోలేదు కదా! హఠాత్తుగా ఫోనొచ్చేసరికి బుర్ర పనిచెయ్యలేదు"

"ఏమిటిది? ఈ సంబంధం కాదుగానీ మనకు తలనొప్పిగా తయారైంది" అంటూ తల పట్టుకుని కూర్చుంది శాంత.

బట్టలు మార్చుకుని హాల్లోకి వచ్చిన

దివ్య వాళ్ళిద్దర్నీ చూసి కంగారుపడింది. "అమ్మా ఏమైంది? "

"ఏం లేదులే. ఆ బంజారాహిల్స్ సంబంధం వాళ్ళు ఫోన్ చేశారు" అంటూ జరిగినది అంతా చెప్పేసింది.

అంతా విని నవ్వేసింది దివ్య. "ఇంకా నయం. నేనేదో కొంప మునిగిందనుకున్నాను. వాళ్ళ దగ్గర నుండి ఫోనొస్తుందని మీరు అనుకోలేదు. హఠాత్తుగా వాళ్ళు అడిగేసరికి ఏం చెప్పాలో తోచలేదు. ఒక పని చెయ్యండి. రేప్పొద్దున మీరే ఫోన్ చేసి మీ మనసులో వున్నదేమిటో వాళ్ళతో దాచకుండా చెప్పేయండి. సరిపోతుంది" సలహా చెప్పి వంటింట్లోకి వెళ్లింది.

దివ్య, రాజా ప్రతిరోజూ పడుకోబోయే ముందు హార్లిక్స్ తాగుతారు. ఏదైనా పని ఒత్తిడిగా వున్నా, ఆలోచనల్తో సతమతమవుతున్నా రాజా కాఫీ తాగుతాడు. రోజూ అలవాటు లేకపోయినా భర్త మనసు అలజడిగా వుందనిపిస్తే శాంత కూడా అతని పక్కనే కూర్చుంటుంది. అతను నిద్రపోయేదాకా కబుర్లు చెప్తుంది.

తండ్రికోసం కాఫీ, తల్లికీ తనకూ హార్లిక్స్ కలిపి తీసుకొచ్చి వాళ్లిద్దరికీ ఇచ్చి, తనూ తాగుతూ పక్కనే కూర్చుంది. కబుర్లు చెప్పింది. ఆ తర్వాత వాళ్ళిద్దరికీ గుడ్‌నైట్ చెప్పేసి వెళ్ళిపోయింది.

వేరే ఏ విషయంలోనైనా తండ్రి పక్కనే కూర్చుని సలహా చెప్పేది. కానీ ఇప్పుడు తనుండి చెప్పేదేమీ లేదు. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటారు.

కూతురు వెళ్ళిన వంక చూసి నిట్టూర్చాడు రాజా. "ఇంత చిన్న వయసులోనే ఎంత హుందాతనం! దివ్యని కట్టుకునేవాడెవడో చాలా అదృష్టవంతుడు కదూ శాంతా!" అన్నాడు. ఈ మధ్య కూతురి మీద ప్రేమ కలిగినప్పుడు ఆమాటే అంటున్నాడు.

శాంత పేలవంగా నవ్వింది. "ఏమో మరి! దానికెలాంటి వాడు రాసిపెట్టి వున్నాడో. మన చేతుల్లో ఏముంది? అంతా ఆ భగవంతుడి దయ!" అంది.

కాసేపు దీర్ఘంగా ఆలోచించాడు రాజా! "దేవుడు మన మంచికోసం మార్గాన్ని చూపిస్తాడుట. ఆ దోవన నడిచి ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలిట. చిన్నప్పుడు మా నాన్నగారు చెప్పారీ సంగతి. ఇప్పుడీ విషయంలో ఈ సంబంధం వద్దనుకుని మనం పొరబాటు చేస్తున్నామా? " తన మనసులోని మాట బయట పెట్టేశాడు.

శాంతకి ఏం చెప్పాలో అర్థం కాలేదు. "తల్లిదండ్రులుగా మనబిడ్డ సుఖంగా వుండాలనే కోరుకుంటాం. కానీ అలా అని

## పెళ్లాడతారా?



స్వాతంత్ర్య సమర యోధుడు చిత్తరంజన్ దాస్ మరణ వార్త యావద్భారత దేశాన్ని, దుఃఖసాగరంలో ముంచెత్తింది. ఇక ఆయన కుటుంబం సంగతి సరేసరి. శ్రీమతి దాస్‌ను పరామర్శ చేయడానికి గాంధీజీ కలకత్తా వెళ్లారు. ఆమె కూర్చున్న మంచం మీదనే కూర్చుని మాట్లాడుతున్నారు. ఆమెను కమ్మేసిన దుఃఖాంధకారాన్ని ఆయన చిరునవ్వు కిరణాలు బాణాల్లా తాకుతున్నాయి.

మాటల మధ్య బాపూజీ తాపీగా ఓ మాట అడిగారు, 'నన్ను పెళ్లి చేసుకుంటారా? ' అని.

దాంతో శ్రీమతి దాస్‌కు నవ్వాగలేదు. అంత దుఃఖమూ ఎటు మాయమైపోయిందో గాని పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వారామె. ఆమె శోకాన్ని పోగొట్టేందుకు వచ్చిన ఆ ద్వంద్వాతీతుడు, భోళాశంకరుడు కూడా తృప్తిగా నవ్వారు.

మరీ ఆకాశానికి నిచ్చెన వెయ్యలేం కదా! ఈ విషయంలో నిర్ణయం తీసుకోవలసింది మీరే. మీరేం నిర్ణయించినా అదే ఆ దేవుడి నిర్ణయం అనుకుంటాను" అంది.

రాత్రంతా నిద్రపోకుండా ఆ విషయం గురించే ఆలోచించాడు రాజా. పొద్దున తొమ్మిది గంటలకి శ్రీధర్‌గారికి ఫోన్ చేశాడు. పనివాడు తీశాడు. తన పేరు చెప్పాక "ఉండండీ!" అన్నాడు.

మరో అరనిమిషంలో ఆయన వచ్చాడు. "నమస్కారం!" అన్నాడు.

"నమస్కారం! మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని ఫోన్ చేశాను. నేను చెప్పేది విని మీరేమీ అనుకోరు కదా!" వినయంగా అడిగాడు రాజా.

"ఎంతమాట? మీరేం చెప్పదల్చుకు న్నారో ఏమాత్రం సంకోచించకుండా చెప్పండి" అన్నాడు శ్రీధర్.

"మొన్న మీ ఇంటికి వచ్చి మీ వైభవం అంతా చూశాను. మరి మీకు తెలుసో తెలి యదో నేను చాలా సామాన్యుడిని. రెక్కలే ఆధారం. నామీద కొన్ని బాధ్యతలు వుండడం వల్ల ఏమీ వెనకేసుకోలేదు. ఇంకా నాకు స్వంత ఇల్లు కూడా లేదు. మా అమ్మాయిని చదివించానేగానీ దాని పెళ్ళికోసం డబ్బు కూడా పెద్దగా కూడబెట్ట లేదు. ఏవిధంగా ఆలోచించినా మీతో సంబంధం కలుపుకునేందుకు నాకు ధైర్యం చాలడంలేదు. మీతో తూగలేను. నన్ను క్షమించాలి" అన్నాడు.

అంతా విని చిన్నగా నవ్వాడు శ్రీధర్. "ఇలా ఉన్నదున్నట్లుగా చెప్పటం మీ సంస్కారాన్ని తెలియజేస్తుంది. కానీ మాకు ఏ కోరికలూ లేవు. మా అబ్బాయి లకీ, వాళ్ళ పిల్లలకీ కూడా కావలసినవన్నీ నేను అమర్చేశాను. కాబోయే కోడలు ఏదో తీసుకురావాలనే ఆశ గానీ, అవసరం గానీ మాకు లేవు. మంచి కుటుంబం నుంచి వచ్చి మాతో కలిసిపోయే కోడలు కావాలని మా సువర్ణ ఆశ. కాబట్టి ఆర్థికంగా వున్న వ్యత్యాసం కారణంగానే అయితే మీరు నిర్భయంగా వుండొచ్చు. ఆపైన మీ ఇష్టం. మీరు నిదానంగా ఆలోచించుకుని నాకు ఫోన్ చెయ్యండి" అన్నారాయన.

ఏం చెయ్యాలో తోచలేదు రాజాకి. సమస్య యథాతథంగానే వుంది. మళ్ళీ భార్యతో చర్చించాడు. ఏం చెయ్యాలో శాంతకీ అర్థం కాలేదు. పోనీ ఎవరినైనా సలహా అడుగుదామా అనుకున్నారు.

కానీ సలహా కోసం వెళ్తే నలుగురూ నాలుగు విధాలుగా చెప్పారు. అయినా ఇది తన సమస్య. తనే ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. ఆ వేళంతా ఆలో చించి చివరికి ఓ నిర్ణయానికి వచ్చాడు.

'వాళ్ళను రమ్మందాం. వస్తారు. మన ఇంటినీ, మననీ చూస్తే మన స్థితిగతులు ఏమిటో అర్థం అవుతాయి. ఆ తర్వాత ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది' అనుకున్నాడు. ఆ మాటే చెప్తే శాంతకి ఓ పక్క ఆనందం. మరో పక్క భయం.

ఆ విషయమే శ్రీధర్‌కి తెలియజేశాడు. "మీరు ఓసారి మా ఇంటికి రండి. మీకూ ఓ అవగాహన ఏర్పడుతుంది" అన్నాడు.

"అలాగే. అలాగే వస్తాం. మీరు ఏమీ హడావిడి చెయ్యకండి. స్నేహితుల్లాగే ఒక సారి కలుసుకుందాం" అన్నాడు.

ముందు ఆదివారం అనుకున్నారు గానీ రాజాకి వీలవలేదు. అందుకే బుధవారం అనుకున్నారు. శాంత కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతూ హడావిడి పడి పోతోంది గానీ తండ్రీ కూతుళ్ళు నిశ్చింత గానే వున్నారు.

ఆ వేళా బుధవారం! ఇంట్లో పనులు చూసుకొంటూనే పదకొండు దాటిన దగ్గ ర్నించీ కూతురికి ఫోన్ చెయ్యడం మొద లుపెట్టింది శాంత. చివరికి ఒంటి గంటకి

బయలుదేరానని దివ్య చెప్పాక అప్పుడు ఊపిరి పీల్చుకుంది. ఇక భర్త వెంట పడింది. అతనూ బయలుదేరాడు.

రెండు గంటలకి ఇద్దరూ ఇంటికి చేరారు. భోజనం చేసి రాజా మళ్లీ టీవీ ముందు కూర్చున్నాడు. దివ్య ఏం బట్టలు వేసుకోవాలా అనే విషయాన్ని ఆలోచిస్తోంది శాంత. అది కాదు ఇది. ఇది కాదు అది. కాసేపు అమ్మ ఆరాటం చూసి సరదాపడ్డ దివ్య చివరికి, 'ఇదిగో అమ్మ ఇది వేసుకుంటా' అంటూ ఒక డ్రెస్ తీసింది. మరీ ముదురు రంగు అవుతుందేమోనని కాస్త తటపటాయించి, 'సర్లే, అదే వేసుకో' అంది. ఆ తర్వాత తనేం కట్టుకోవాలో ఎంచుకుంది.

ఆ వేళ పనిమనిషిని మూడింటికి వచ్చి అతిథులు వెళ్లేదాకా వుండమని చెప్పింది. ఆ అమ్మాయి సాయంతో పనులన్నీ పూర్తి చేసేసింది. ఫలహారాలు తయారుచేసి చల్లారకుండా హాట్ పేక్‌లలో పెట్టింది. అన్నీ ఒకటికి పదిసార్లు చూసుకుని తృప్తి పడింది. స్నానంచేసి తయారైపోయింది. ఆవిడ వెంటబడి తరుముతుంటే అయిదింటికే తండ్రీకూతురూ తయారయ్యారు.

ఇంటిదారి వివరంగానే చెప్పాడు రాజా. అయినా ఊరుకోకుండా ఫోన్‌లో మాట్లాడుతూనే ఉన్నాడు. వీళ్ల వీధి చివరకు వెళ్లాడు బైక్ మీద. కారు రాగానే వెంటబెట్టుకుని వచ్చాడు.

'రండి! రండి' అన్నాడు వినయంగా, కారు డోర్ తీస్తూ. కార్లోంచి సువర్ణ, శ్రీధర్, శ్రీకాంత్, పూజ, శ్రీరామ్ దిగారు.

శాంత కూడా వాకిట్లోకి వచ్చేసింది. పరిచయాలు అయ్యాయి. "ఇల్లు బావుందండీ. హాయిగా ప్రశాంతంగా వుంది" అన్నాడు శ్రీధర్ ఇంటిని చూస్తూ.

"మా బంధువుల ఇల్లు. వాళ్లు అమెరికాలో వుంటారు" అంటూ ఇంట్లోకి దారి తీశాడు. దివ్య హాల్లో నిలబడి వుంది. మామూలుగా ఉందామని ఎంతగా ప్రయత్నించినా చాతకావడం లేదు. అరిచేతులు చెమటలు పడుతున్నాయి.

'ఏమ్మా బావున్నావా?' అని సువర్ణ పలకరిస్తే చిన్నగా నవ్వేసింది. సమాధానం చెప్పాలంటే నోరు పెగల్లేదు.

లోపలికి వచ్చి కూర్చున్నాక ఇల్లంతా పరికించి చూశారు అతిథులు. "అబ్బ, ఎంత బావుందో మీ ఇల్లు! లేపాక్షి షోరూమ్‌లాగా అణువణువూ అద్భుతంగా వుంది" అన్నాడు శ్రీధర్.

శాంతకి ఇల్లు చక్కగా ఉంచుకోవడం సరదా! బొమ్మలవీ చేస్తుంది. కుట్లూ అల్లికలలో సిద్ధహస్తురాలు. ఇంట్లో వాడే కర్టెన్లూ, కుషన్లూ అన్నీ చాలా కళాత్మకంగా ఉండేలా చూస్తుంది. ఎక్కువ ఖర్చు పెట్టదు. పనికిరాని వస్తువులూ, వాడి పారేసిన వస్తువులతోనే ఏవేవో చేస్తూ వుంటుంది. ఆ ఇంట్లో అడుగు పెట్టిన వారు మంత్ర ముగ్ధులైపోతారు.

అందులోనూ పెళ్లివారు వస్తున్నారు కాబట్టి మరికాస్త శ్రద్ధ తీసుకుంది. అందుకే వచ్చినవాళ్లు ఇల్లంతా కలియజూస్తూ వుండిపోయారు.

వాళ్లకి కూల్‌డ్రింక్‌లు అందించింది శాంత. "మీరు ఊరకే హైరాన పడకండి. మీరూ వచ్చి కూర్చోండి" అంది సువర్ణ.

వాళ్ల ఎదురుగా కూర్చున్నారు శాంత, దివ్య. శ్రీధర్ మంచి మాటకారి. కొడుకుల గురించి క్లుప్తంగా చెప్పాడు.

"మీరు చాలా అదృష్టవంతులు. చదువులు అవుతూనే విదేశాలకు వెళ్లిపోతున్నారు మగపిల్లలు. మీ కొడుకులిద్దరూ మీ దగ్గరే ఉన్నారు" అన్నాడు రాజా!

"అవునండీ. ఆ విషయంలో మేము చాలా అదృష్టవంతులం. అయితే వీళ్లిద్దరూ నాదగ్గరే పనిచేస్తూ వుండడం వల్ల

కొన్ని ఇబ్బందులు కూడా ఉన్నాయి. బయటి వాళ్లయితే మందలించి పనిచే యిస్తారు. అయ్యో.. బాస్ ఏమైనా అను కుంటాడనే భయం వాళ్లకీ వుంటుంది. ఇక్కడలా కాదు కదా! వాళ్ల దయ. నా అదృష్టం" అన్నాడు.

అందరూ నవ్వేశారు. "ఇది చాలా అన్యాయం నాన్నగారూ! మీ మాటలు విని అవి నిజమే అనేసుకుంటారు" అన్నాడు శ్రీకాంత్.

"నేను చెప్పేదాన్లో అబద్ధం ఏముంది చెప్పు. నువ్వు కాస్త నయమే. ఏదైనా పని చెప్తే చేస్తాననో, చెయ్యననో చెప్తావు. నీ

## కొత్తగాలి...

**చందురుడు**
**పైపైకి వస్తూంటే**
**సాయం సంధ్య మోము**
**సిగ్గుతో ఎర్రబడింది**

*– కిలారు వెంకటేష్ చౌదరి,*
*హైదరాబాద్*

తమ్ముడు మరీ దైవాధీనం. చెప్పినంత సేపూ శ్రద్ధగా వింటాడు. ఆ తర్వాత చేస్తాడో చెయ్యడో ఆ భగవంతుడికి ఎరుక. చేస్తాననీ చెప్పడు. చెయ్యననీ చెప్పడు. చిన్నప్పటి నుంచీ ఇంతే" అంటూ చాలా వివరాలు చెప్తుంటే శ్రోతలు హాయిగా నవ్వుకున్నారు. శ్రీరామ్ కూడా నవ్వుతూనే విన్నాడు. దివ్యకి ఎంత ఆపు కున్నా నవ్వు ఆగలేదు అది చూసి.

"ఆంటీ మరీ అన్నీ నా గురించేనా? అన్యాయం! మీరూ దివ్య గురించి ఏమైనా చెప్తే మేమూ నవ్వుకుంటాం!" అన్నాడు శ్రీరామ్, శాంత వంక చూసి.

దివ్య గుండె ఝల్లుమంది. తల వంచు కుంది. శాంత కూడా ఆందోళనగా చూసింది. "ఏం చెప్పమంటారు? నేనేం చెప్పినా ఎగతాళే. తాటాకులు కట్టేస్తుంది. తండ్రీకూతుళ్లు ఏకమై నన్నేడిపిస్తూ వుంటారు.

ఇక దివ్య మాటకొస్తే చిన్నప్పుడు చాలా అల్లరి చేసేది. పెద్దయ్యాక కాస్త తగ్గింది గానీ పూర్తిగా తగ్గలేదు. ఇప్పటికీ ఏదో అల్లరి చేస్తూనే వుంటుంది. బోలెడుమంది ఫ్రెండ్స్. ఆఫీసులో చాలామంచి పేరుంది దివ్యకి. ఇంత అల్లరి పిల్ల అంత మంచి ఉద్యోగం ఎలా చేస్తుందో అని ఆశ్చర్యం వేస్తుంది నాకు" అంటూ మొదలుపెట్టి చాలా కబుర్లు చెప్పింది.

దివ్య మొహం కందిపోయింది. శ్రీరామ్ మాత్రం చాలా ఎంజాయ్ చేస్తున్నాడు ఆ కబుర్లు వింటూ.

'కబుర్లతోనే కడుపు నింపేస్తావా? ' అని భార్యకి కర్తవ్యం గుర్తుచేశాడు రాజా. నాలుక కరుచుకుని లేచింది శాంత. దివ్య కూడా వెంటే వెళ్లింది. ప్లేట్లలో ఫలహా రాలు సర్ది తెచ్చి ఇచ్చారు.

"బజ్జీలు చాలా బావున్నాయ్!" అని మెచ్చుకున్నారు.

"మీకు వంట వచ్చా? " అడిగాడు శ్రీరామ్.

"అమ్మంత బాగా చెయ్యలేనుగానీ చేసే స్తాను" చెప్పింది దివ్య.

'ఎక్కడ పనిచేస్తున్నారు? ' అని మొదలు పెట్టి దివ్య ఉద్యోగం వివరాలు అడిగాడు. పూజ, శ్రీకాంత్ కూడా మాట కలిపారు.

చూస్తుండగానే ఏడు దాటింది. "అమ్మో! చాలా సేపు కూర్చున్నాం. ఇక బయలుదే రతాం" అన్నాడు శ్రీధర్.

"ఏమిటో కొత్తవాళ్లతో గడిపినట్లు లేదు. ఎన్నో ఏళ్లనుండీ పరిచయం ఉన్న వాళ్లతో గడిపినట్లు ఉంది" అన్నాడు రాజా.

"అదంతేనండీ! కొంతమందితో సంభా

షణే సాగదు. కొంతమంది దగ్గర కూర్చుంటే బావిలో ఊటలా ఊరుతుం టాయి కబుర్లు" అన్నాడు శ్రీధర్.

శాంత సువర్ణకు బొట్టుపెట్టి జాకెట్టు బట్ట, కొబ్బరికాయ, తాంబూలం ఇచ్చింది.

'వెళ్తున్నాం' అని లేచారందరూ. శ్రీకాంత్, పూజ కూడా దివ్య వద్దకు వచ్చి 'మిమ్మల్ని కలుసుకోవడం చాలా సంతో షంగా ఉంది. వెళ్తున్నాం' అన్నారు. ఆఖ రుగా శ్రీరామ్ దివ్య దగ్గరగా వచ్చి చెయ్యి జాపాడు, "ఓకే దివ్యా! మళ్లీ కలుసు కుందాం"

ఒక్కక్షణం సంకోచించి చెయ్యి అందిం చింది దివ్య. సున్నితంగా నొక్కి వదిలే శాడు. అందరూ కారెక్కి మరోమారు వె ళ్లొస్తామని చెప్పి వెళ్లిపోయారు.

అతిథులు వెళ్లిపోయారు. ఇంటి వారూ ముగ్గురూ తలో మూలా కూర్చున్నారు. ఎవరికివారే ఆ తన్మయత్వం నుండి బయ టపడలేకపోతున్నారు. ఎంత మంచివాళ్లు! డబ్బున్నా ఏ మాత్రం గర్వం లేదు. ఇటు వంటి వారితో సంబంధం కలుపుకోవా లంటే ఎన్నో జన్మల పుణ్యం చేసుండాలి.

ముగ్గురూ భోజనం చెయ్యలేదు. దివ్య నైటీ వేసుకుని తన గదిలో పడుకుంది. సిడ్నీషెల్డన్ నవల తీసుకుంది. ఆ నవల లంటే దివ్యకి ఆరో ప్రాణం. ఒకసారి నవ లలోకి ప్రవేశిస్తే ఇక బయటి ప్రపంచంతో సంబంధం వుండదు. కానీ ఇవ్వాళ పరి స్థితి అందుకు భిన్నంగా వుంది. మొదటి పేజీలోనే ఆగిపోయింది. విసుగ్గా పుస్తకం పక్కన పడేసి లేచి కూర్చుంది. తన కుడి చేతి వంక చూసుకుంది.

ఏమన్నాడతను? మళ్లీ కలుసుకుందాం! అన్నాడు. ఈ రోజుల్లో అలా అనుకోవడం మామూలే. అలాగే అన్నాడా! లేకపోతే అతని మనసులో వేరే ఆలోచన వుందా? అదే నిజమైతే తనలా అదృష్టవంతురాలు వుండరు. అందం, చదువు, ఐశ్వర్యం, అన్నింటికీ మించిన సంస్కారం ఒకేచోట, ఒకే మనిషిలో వుండటం అపురూపం. అటువంటి అపురూపమైన వ్యక్తితో జీవితం పంచుకోవడం కంటే గొప్పవరం మరొకటి వుంటుందా? కంటిమీద కునుకు రాలేదు.

★ ★ ★

అదే సమయంలో మరో వ్యక్తికూడా నిద్రపోకుండా వున్నాడు. అతని పేరు సత్య. దివ్య ఆఫీసులోనే పనిచేస్తున్నాడు. ఇద్దరి మధ్యా మంచి స్నేహం వుంది. సత్యకి తండ్రిలేడు. బ్యాంక్‌లో పనిచేస్తూ చనిపోవడంవల్ల అక్కడే తల్లి చిన్న ఉద్యోగం చేస్తోంది. ఆస్తిపాస్తులేమీ లేవు, ఈ ఉద్యోగం తప్ప. ఈ మధ్యనే అతని బాధ్యతా, జీతం రెండూ పెరిగాయి. కంపెనీవారు 'పాస్‌పోర్టు సిద్ధంగా ఉంచుకో! వచ్చే ఏడాది అమెరికా వెళ్లాల్సి వుంటుంది' అన్నారు.

అన్నీ సానుకూలంగానే జరుగుతూ వుండేసరికి తల్లి అతనికి పెళ్లి చేస్తానంది. అతని మనసులో వేరే ఆలోచనలున్నాయి. కాబట్టి 'నువ్వేమీ ప్రయత్నాలు చెయ్యకు' అని చెప్పేశాడు. విషయం గ్రహించేసింది అతని తల్లి జయ. "శుభం నాగుండె మీద నుండి బరువు దించావు. నువ్వు చెప్పే శుభవార్త కోసం ఎదురు చూస్తుంటాను"

**కొత్తగాలి...**

**ఎప్పుడో కోల్పోయాం**
**మనం కోహినూరు**
**ఇప్పుడెలా వదులుకుంటాం**
**మన కాశ్మీరు**

– మాధవీ సనారా,
అనకాపల్లి



అంది.

దివ్య దగ్గర ఈ ప్రస్తావన తీసుకురావాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు సత్య. కానీ ధైర్యం చాలడం లేదు. రోజులో పది గంటల సేపు పక్కపక్కనే వుంటారు. కలిసే కాఫీ తాగుతారు. కలిసే భోజనం చేస్తారు. ఇద్దరిమధ్యా మంచి స్నేహం, అవగాహన కూడా వుంది. కానీ ఎందుకో చెప్పలేకపోతున్నాడు. నెల రోజులుగా ఇదుగో, అదుగో అని వాయిదాలు వేసి



వేసి చివరకు తనమీద తనే విసుక్కుని ఒక గడువు పెట్టుకున్నాడు, తన పుట్టిన రోజు నాడు అడిగేయాలని. అందుకు ఒక కారణం వుంది. పుట్టినరోజు చాలా శుభ ప్రదమైనదని అతనికి నమ్మకం. అతడి జీవితంలో ఎన్నో ముఖ్యమైన సంఘట నలు పుట్టినరోజునాడే జరిగాయి. ఇంజనీ రింగ్ కాలేజిలో సీటు రావడం, ఉద్యోగం రావడం, ప్రమోషన్ వంటి మంచి సంఘ టనలన్నీ పుట్టినరోజునాడే జరిగాయి.

అందుకే జీవితంలో అతి ముఖ్యమైన పెళ్లి విషయం ప్రస్తావించడానికీ పుట్టినరో జునే ఎంచుకున్నాడు. కిందటి సారి దివ్య పుట్టినరోజున అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటగానే ఫోన్‌చేసి అభినందనలు అంద జేస్తే ఎంతో సంబర పడిందామె.

“నీ పుట్టినరోజున నేనూ ఇలాగే అర్ధరాత్రే అభినందనలు చెప్తాను” అంది.

“ఏం చెప్పవు! నీకసలు గుర్తే వుండదు” అన్నాడు సత్య.

“ఏంకాదు, చెప్తాను” అంది దివ్య.

“సరే, పందెం. నువ్వు గెలిస్తే మర్నాడు మనిద్దరం భోజనానికి వెళ్దాం. నేను ట్రీట్ ఇస్తాను. నేను గెలిస్తే నువ్వు ఇవ్వాలి” అన్నాడు సత్య.

“అలాగే” అంది దివ్య. మధ్యాహ్నం ఏదో పనుందని వెళ్లిపోయింది. దివ్య ఫోన్ చేస్తుందా అని వెయ్యికళ్లతో వేచి ఉన్నాడు. పన్నెండు దాటగానే మోగింది సెల్. ఆశగా చూశాడు. అది దివ్య ఫోన్ కాదు. అమెరికానుంచి కొలీగ్.

వీళ్ల కంపెనీవాళ్లు ప్రాజెక్ట్ పనిమీద అమెరికాలో వున్నారు. అందరూ పేరు పేరునా వచ్చి పుట్టినరోజు శుభాకాంక్షలు అందజేశారు. ఆ తర్వాత కూడా నాలు గైదు ఫోన్లు వచ్చాయి. నాలుగైదు మెసే జ్‌లు కూడా వచ్చాయి. అవన్నీ అందు కున్నందుకు ఆనందిస్తూ వున్నా అతని మనసులో ఏదో వెలితి.

‘ఆకాశంలో లక్షలాదిగా వున్నాయి నక్ష

త్రాలు. కానీ నాకు కావలసిన చుక్క మాత్రం వెతికినా దొరకడం లేదు' అనే పాత హిందీపాట గుర్తుకు వచ్చింది. పోనీ తనే చేద్దామా అనుకుని కూడా అర్ధరాత్రి వేళ పరాయి ఆడపిల్లకు ఫోన్ చెయ్యడం సభ్యత కాదని ఊరుకున్నాడు.




**రా**త్రంతా ఇంచుమించు జాగారం చేసిన రాజా, శాంత, దివ్య ఏ తెల్లవారు జామునో నిద్రలోకి జారుకున్నారు!

ఫోన్ నిర్విరామంగా మోగడంతో మెలకువ వచ్చింది శాంతకి. బద్ధకంగా లేచి ఫోన్ తీసేలోగా ఆగిపోయింది. ఎవరబ్బా ఇంత రాత్రివేళ అనుకుంటూ వాచీవంక చూసి ఉలిక్కిపడింది. తొమ్మిది కావస్తోంది! ఇదేవిటి అందరం ఇంత పొద్దెక్కేదాకా ఎలా పడుకున్నాం? పాలవాడు రాలేదా? పనిమనిషి ఏమైంది?

వెళ్లి తలుపు తీసింది. పాలు, పేపరు అక్కడే పడివున్నాయి. లోపలికి వచ్చి డికాషన్ చేసి, పాలు పొయ్యి మీద పెట్టి వచ్చి భర్తను లేపింది. పక్కగదిలోకి వెళ్లి కూతుర్నీ లేపింది. టైం చూసుకుని తెల్లబోయాడు రాజా. "ఇపుడు వెళ్ళినా ఆలస్యంగానే వెళ్ళినట్లు అవుతుంది. పోన్లే ఇవాళ్టికి సెలవు పెట్టేస్తాను" అన్నాడు.

ఆశ్చర్యపోయింది శాంత. హరిమీద గిరి పడ్డా ఒకపట్టాన సెలవు పెట్టడు రాజా. అక్కడ ,దివ్య పరిస్థితీ అలాగే ఉంది. ఇప్పుడు బయలుదేరినా ట్రాఫిక్‌లో పడి ఈదుకుంటూ వెళ్ళేసరికి మధ్యాహ్నం భోజనాలవేళ అవుతుంది.

ఫోన్‌చేసి ఇవాళ్టికి రానని చెప్తే సరిపోతుంది. అంతగా కాదూ కూడదూ అంటే మధ్యాహ్నం నించీ వెళ్ళచ్చు అనుకుని సత్యకి ఫోన్ చేసింది.

ఉత్సాహంగా పలికాడు సత్య. "చెప్పు దివ్యా!" అన్నాడు.

"సత్యా నేనివ్వాళ రాలేను" చెప్పింది.

"ఏం? ఎందుకని? ఆరోగ్యం బాగా లేదా? "

"కాదు. ఆలస్యంగా లేచాను."

"నిన్న ఏదో పనుందని హడావిడిగా వెళ్ళిపోయావు. రాత్రి ఎక్కడికైనా వెళ్ళారా? " మళ్ళీ అడిగాడు.

"లేదు. మా ఇంటికే అతిథులు వచ్చారు" చెప్పింది. "సత్యా! ఏదైనా పనుంటే ఫోన్ చెయ్యి. అంతగా అవసరమైతే సాయంత్రం వస్తాను. లేదంటే ఏకంగా రేపు. సరేనా? " అంది.

"సర్లే. అంతేనా? ఇంకేమైనా చెప్పాలా? " ఆశగా అడిగాడు సత్య.

"ఇంకేంలేదు సత్యా!"

"ఇంకేం లేదంటావా? ఎందుకైనా మంచిది.. ఒకసారి గుర్తుతెచ్చుకో" అన్నాడు ఆటపట్టిస్తూ.

ఒక్కక్షణం ఏమిటా అనుకుంది. మరుక్షణం గుర్తొచ్చింది.

"సత్యా! సారీ! వెరీ సారీ! మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" దివ్యకి చాలా మొహమాటంగా అనిపించింది.

నవ్వేశాడు సత్య, "ఏం ఫర్వాలేదులే! పందెం గెలిచినందుకు నాకెంతో సంతోషంగా ఉంది!" అన్నాడు.

"అవును. ఒప్పుకొంటున్నాను. నీకు మంచి హోటల్లో భోజనం పెట్టిస్తాను.

సరేనా!" అంది దివ్య.

"ఎప్పుడో పెట్టిస్తాను అని వాయిదా వేస్తేకాదు. వెంటనే ఇవ్వాలి. సరేనా!" అన్నాడు.

"ఎప్పుడో ఎందుకు? అయితే ఇవాళ! కాకపోతే రేపు. సరేనా? " మాటిచ్చింది. ఆఫీసు విషయాలు మాట్లాడుకుని ఫోన్ పెట్టేసింది దివ్య.

సత్యకి చాలా తృప్తిగా అనిపించింది. ఇవ్వాళ మధ్యాహ్నం దివ్య ఆఫీసుకి వస్తే, వర్క్ అయ్యాక హోటల్‌కి వెళ్లినప్పుడు మనసులోనిమాట చెప్పాలి అనుకున్నాడు.

దివ్య హాల్లోకి వచ్చి కూర్చొని పేపరు తిరగేస్తోంది. శాంత కాఫీ తెచ్చి ఇచ్చి తనూ కూర్చుంది. "ఏవండీ! వాళ్ళకు మనం ఫోన్ చెయ్యాలా? " అడిగింది.

"మనం చెయ్యాలా? అలా చేస్తే బావుం డదేమో!" అన్నాడు రాజా.

"మరి వాళ్ళు చేస్తారా? ఎంతైనా మగ పెళ్ళివారుకదా! వాళ్ళంతట వాళ్ళు చెయ్య రేమో? ఆడపిల్లవాళ్ళం మనమే మాట్లా డటం మర్యాదగా ఉంటుంది" శాంతకీ ఏం చెయ్యాలో తోచటం లేదు.

ఇద్దరూ కాసేపు ఆలోచించారు. ఎవ రైనా పెద్దవాళ్ళని అడుగుదామా అనుకు న్నారు. అలా అడగాలంటే జరిగిన విషయం అంతా చెప్పాలి. ఈ పెళ్ళి కుదు రుతుందో లేదో. ముందర్నించీ అందరికీ టాంటాం చెయ్యడమెందుకూ అని సంకో చంగా ఉంది. మరి అడగకుండా ఎలా?

తర్జనభర్జన పడి చివరికి మధ్యవర్తి సత్యం ద్వారా అడిగిస్తే అన్నివిధాలా బావుంటుందనుకున్నారు.

"అప్పుడు ఆయనతో ఈ సంబంధం గురించి మాట్లాడొద్దన్నాను. మళ్ళీ ఇప్పుడు ఆయన్ని కదిలిస్తే కోపం వస్తుందేమో" అన్నాడు రాజా సందేహంగా.

"ఏంరాదు. మధ్యవర్తి ఆయనేగా! ఇదీ విషయమని చెప్తే సరిపోతుంది" అంది శాంత.

వీళ్ళిలా చర్చించుకుంటూండగానే ఫోన్ మోగింది. రాజా తీశాడు. అటువైపు శ్రీధర్. "గుడ్‌మార్నింగ్. బయటికెళ్ళారా? ఇందాక ఫోన్ చేశాను" అన్నాడు.

తడబడిపోయాడు రాజా.

"అబ్బే లేదండీ. లేవడమే ఆలస్యంగా లేచాం. ఇందాక ఫోన్ తీసేలోగా ఆగిపో యింది" చెప్పాడు.

"నిన్న మీ ఇంటినుంచి వచ్చాక అందరం మాట్లాడుకున్నాం. మాకు మీతో సంబంధం కలుపుకోవాలని ఉంది. మీకు అంగీకారమైతే ఇక ముందుకి సాగుదాం" అన్నాడు.

రాజాకి గుండె గొంతులోకి వచ్చేసింది. ఏం చెప్పాలో తోచలేదు. ఒక్క నిమిషం పాటు మౌనంగానే ఉండిపోయాడు.

"ఏం మాట్లాడరేం? " అడిగాడాయన.

"ఏం మాట్లాడమంటారు? నాకు నమ్మ శక్యం కావటం లేదు. మీరు ఆగర్భ శ్రీమంతులు. నేను సామాన్యుడిని. ఇదంతా సాధ్యమేనంటారా? మీతో నేను తూగగలనా? " దీనంగా అడిగాడు.

"చూడండి రాజాగారూ! అమ్మాయీ అబ్బాయీ ఇష్టపడితే ఇవన్నీ అంత ముఖ్య మైన విషయాలు కానేకావు. మీరు ఏదేదో ఊహించుకుని కంగారు పడకండి. అయినా ఆడపిల్లను మనకంటే కలిగిన వారింట్లో ఇవ్వాలని, కోడల్ని మనకంటే తక్కువస్థితిలో ఉన్నవారిని తెచ్చుకోవాలనీ పెద్దవాళ్ళు చెప్పారు కదా! కాబట్టి అవన్నీ పక్కన పెట్టండి. మీకు వేరే ఏమైనా అభ్యంతరాలు ఉంటే మాత్రం మిమ్మల్ని ఇబ్బంది పెట్టను" అన్నాడు ఆప్యాయంగా.

"ఎంత మాటా? ఇది మా అదృష్టం!" అన్నాడు రాజా.

"ఏం కాదు. ఆ భగవంతుడి నిర్ణయం.

అయితే ఈ సంబంధం ఖాయం. మంచి రోజు చూసుకుని మిగతా విషయాలు మాట్లాడుకుందాం!" అన్నాడు శ్రీధర్.

ఫోన్ పెట్టేసి 'శాంతా' అంటూ చెయ్యి జాపాడు రాజా. వచ్చి భర్తను చుట్టుకుపోయింది శాంత.

"దివ్య పుట్టింది మొదలు ఎప్పుడే సందర్భంలో దేవుణ్ని ప్రార్థించినా దాని భవిష్యత్తు బావుండాలనే కోరుకునేదానివి కదూ! నీ ప్రార్థన ఆ దేవుడు విన్నాడు. దివ్యకు బంగారంలాటి సంబంధం కుదిర్చాడు" చెప్తూ వుంటే అతని కంఠం పూడుకుపోయింది.

శాంతకి ఏడుపు ఆగలేదు. వాళ్ళిద్దర్నీ ఆ స్థితిలో చూసి దివ్య కూడా తండ్రి దగ్గరకు వెళ్ళింది. రెండో చేత్తో కూతుర్ని దగ్గరకు తీసుకుని తలమీద ముద్దు పెట్టుకున్నాడు.

"నాకివ్వాళ ఎంతో ఆనందంగా ఉందమ్మా!" అన్నాడు చెయ్యి చాచి. కూతురి తల నిమిరింది శాంత.

జీవితంలో చాలా అరుదుగా లభించే అటువంటి అపురూపమైన ఆనందాన్ని ఆస్వాదిస్తూ తమను తామే మరిచిపోయారు ముగ్గురూ.

కాసేపటికి సర్దుకున్నాడు రాజా. మెల్లిగా బుర్ర పనిచెయ్యటం మొదలుపెట్టింది. సమస్య భూతంలా భయపెడుతుంది. పెళ్ళంటే మాటలా? అందులోనూ వారి స్థాయికి తగినట్లు చెయ్యాలి. అప్పుచెయ్యాలి. అవసరం అయితే తమ్ముళ్ళిద్దరినీ సాయం అడగాలి.

ఆమధ్య ఎవరో మస్కట్‌లో 'మంచి జాబ్ ఉంది. నువ్వు ప్రయత్నించు' అంటే అంతగా పట్టించుకోలేదు. ఇప్పుడు అటువంటి అవకాశమేదైనా ఉందేమో వెతికి పట్టుకోవాలి. అప్పుచేసి శుభకార్యం అయిందనిపించి ఆ తర్వాత అక్కడికి వెళ్ళి డబ్బు కూడబెట్టి అప్పుతీర్చాలి. ఎన్నో ఆలోచనలు, ఆవేదనలు. సతమతమైపోయాడు.

శాంత కూడా అయోమయావస్థలోనే ఉంది. "వంట చెయ్యాలనిపించడం లేదు. హోటల్‌నుంచి తెప్పించుకుందాం" అంది.

దివ్య మాత్రం గాల్లో తేలిపోతోంది. నల్లపేంటుమీద తెల్లటి టీషర్టు వేసుకొని అపరమన్మథుడిలా ఉన్న ఆ అందగాడు ఇక తనవాడు. తనకే స్వంతం. అంతవరకూ ఎవరెవరో పెళ్ళి ప్రస్తావన తెచ్చినా ఆటపట్టించి ఎగతాళిగా తీసిపారేసింది. కానీ ఇప్పుడు ఆ ఉద్వేగానికి తట్టుకోలేక సుడిగాలిలో ఎండుటాకులా సతమతమైపోతోంది. తల్లి బలవంతంమీద నాలుగు మెతుకులు తిని, మళ్ళీ పడుకుంది.

సాయంత్రం నాలుగింటికి సత్య ఫోన్ చేశాడు. "ఏం దివ్యా.. వస్తున్నావా? " అన్నాడు.

"ఇంకా.. ఇప్పుడేం వస్తాను? రేపు వస్తాలే? " అంది.

అతనికి చాలా నిరాశగా అనిపించింది. "మరి మన పార్టీ విషయం ఏం ఆలోచించావు? " అన్నాడు.

"ఇవ్వాళ నీ పుట్టినరోజు కదా! సాయంత్రం నీకేం ప్రోగ్రాం లేదా!" అంది.

"ఏమీలేదు. నువ్వు ఖాళీగా ఉంటే ఇవ్వాళే వెళ్దాం" అన్నాడు.

దివ్యకీ విసుగ్గా ఉంది. కాసేపు బయటికి వెళ్ళాలనిపించింది. "సరే!" అంది.

ఎక్కడ కలవాలో మాట్లాడుకొని నిర్ణయించుకొన్నారు. ఏడింటికి అక్కడికి చేరుకోవాలనుకున్నారు.

"మనవాళ్ళని కూడా తీసుకొస్తావా? " అంది దివ్య.

"వద్దులే, పందెం మనిద్దరి మధ్యనే కదా. కావాలంటే ఈ ఆదివారం అందరికీ నేను పార్టీ ఇస్తాను" అన్నాడు సత్య.

అనుకున్న ప్రకారం ఆరింటికి ఇంట్లోంచి బయలుదేరింది. కాస్త దూరం వెళ్ళేసరికి

సెల్‌ఫోను మోగింది. బండి నడుపుతూ సెల్‌లో మాట్లాడదు దివ్య. అదో నియమం పాటిస్తుంది. హోటల్‌కి వెళ్ళాక బండి పార్క్‌చేసి అప్పుడు సెల్‌ఫోన్ తీసింది. మూడు మిస్‌డ్ కాల్స్ ఉన్నాయి. ఎవరిదో కొత్త నెంబరు.

ఎవరో అప్పిస్తామనో, ఉద్యోగం ఇస్తామనో ఫోన్ చేసివుంటారనుకుంటూ ఫోన్ చేసింది ఆ నెంబర్‌కి. వెంటనే సమాధానం వచ్చింది మగకంఠం.

"హాయ్ దివ్యా! ఎలా ఉన్నావు? ఇంత సేపు ఫోన్ తియ్యలేదేం?" చనువుగా ప్రశ్నించాడు.

"మీరు? " అనుమానంగా అడిగింది.

"నేను దివ్యా, రామ్‌ని"

"రామ్? ఏ రామ్? "

"శ్రీరామచంద్రా! అప్పుడే మర్చిపోయావా? శ్రీరామ్‌ని.. నిన్న చూసి ఇవాల్టికే మర్చిపోతే మరి జీవితం అంతా ముందే ఉందిగా? ఎలా? " చిలిపితనం ధ్వనించింది ఆ గొంతులో.

దివ్య ఒళ్ళు చల్లబడిపోయింది. అడుగు ముందుకి పడలేదు.

"దివ్యా! హలో"

"సారీ! మొదటిసారి మీ దగ్గర్నించి ఫోన్ రావటం కదా! గుర్తుపట్టలేదు" వణికే కంఠంతో చెప్పింది.

"ఫర్వాలేదులే. నీ నెంబర్ మీ నాన్నగారిని అడిగి తీసుకున్నాను. బైదిబై అభినందనలు. నీకు పెళ్ళి కుదిరిందట" మళ్ళీ అదే చిలిపితనం.

ఏం చెప్పాలో అర్థంకాలేదు దివ్యకి. సిగ్గుగా నవ్వేసింది.

"నువ్విప్పుడేం చేస్తున్నావ్? " అడిగాడు.

"ఇప్పుడే బయటికి వచ్చాను. మా కొలీగ్ పుట్టినరోజు పార్టీ!"

"అలాగా? సర్లే, నువ్వు తీరిగ్గా ఉంటే కలిసి కాఫీ తాగుదామనుకున్నాను. మరోసారి వెళ్దాంలే. ఉంటాను మరి. బై" అనేసి

## చతురతోనే రచనా వ్యాసంగం



**పొత్తూరి విజయలక్ష్మి**

చతుర పత్రికతోనే నా రచనా వ్యాసంగం ప్రారంభమయింది. 1982, అక్టోబర్ నెలలో మొదటి నవల 'ప్రేమలేఖ' రాశాను. 'ఏనాడు ఏ జంటకో' చతురలో ఐదో నవల. నూటాయాభై కథలు, చాలా నవలలు రాశాను. ఇటీవల ఓ వార పత్రిక నిర్వహించిన ఏడువారాల సీరియల్ పోటీలో నేను రాసిన ఒక నవలకు మూడో బహుమతి వచ్చింది. మరో దిన పత్రికలో 'కొంచెం ఇష్టం-కొంచెం కష్టం' అనే కాలమ్ రాస్తున్నాను. ఇంతవరకూ నాలుగు కథా సంపుటాలు వెలువడ్డాయి. హాస్యం అంటే చాలా ఇష్టం. నా రచనలను ఆదరిస్తున్న పాఠకులకు, ప్రచురిస్తున్న పత్రికలకు నా కృతజ్ఞతలు.

చిరునామా: పొత్తూరి విజయలక్ష్మి
ఫ్లాట్ నెం. 201,
వికాశిని అపార్ట్‌మెంట్స్,
2-2-1121/3 & 3A, న్యూ నల్లకుంట,
హైదరాబాద్-500044,

ఫోన్ పెట్టేశాడు.

అతనేమైనా అనుకున్నాడేమో అనుకుంది.

"హలో! దివ్యా!"

సత్య పలకరించేసరికి ఉలికిపడింది.

"హలో సత్యా! చాలా సేపైందా వచ్చి? "

"లేదులే! ఇప్పుడే. రా వెళ్దాం!"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. బల్లముందు కూర్చున్నారు. మంచినీళ్ళు, మెనూకార్డు తెచ్చి బల్లమీద పెట్టాడు బేరర్.

"చెప్పు, ఏం తీసుకుందాం!" అంది దివ్య.

"భలేదానివే. నేను నువ్వు పిలువగా వచ్చిన అతిథిని. ఏం తీసుకోవాలో నువ్వే చెప్పు!" అన్నాడు.

మెనూకార్డ్ చూసి ఏం కావాలో దివ్యే నిర్ణయించి అతనికి చెప్పేసింది.

దివ్య వంకే పరిశీలనగా చూస్తున్న సత్యకి ఆమెలో ఏదో మార్పు స్పష్టంగా తెలిసిపోతుంది. మనిషి ఇక్కడ, మనసెక్కడో అన్నట్లుగా ఉంది. దాచుకున్నా దాగని సంతోషం మొహంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. అసలే అందమైన దివ్య మరింత అందంగా ఉంది.

"ఏమిటి దివ్యా! నీలో ఏదో మార్పు కనిపిస్తోంది!" ఆమెనే అడిగేశాడు.

"మార్పా? ఏమీలేదే!" తడబడింది.

"ఏదో దాస్తున్నావు? ఏదో ఉంది. ఏమిటది? నాతో చెప్పకూడదా? ఇష్టం లేకపోతే చెప్పొద్దులే" అన్నాడు.

కాసేపు తటపటాయించింది. సత్య పరాయివాడు కాదు. మంచి మిత్రుడు అతని దగ్గర దాపరికం ఎందుకు?

"సత్యా! ఓ శుభవార్త! నాకు పెళ్ళి కుదిరింది!"

సత్యకి కళ్ళు గిర్రున తిరిగాయి. నమ్మలేనట్లుగా ఉండిపోయాడు.

"ఏమిటిది? మొన్ననేగా ఇంకో ఏడాది దాకా పెళ్ళిమాట తలపెట్టనన్నావు. ఇంతలో ఇంత హఠాత్తుగా? " అడిగాడు.

"అవును సత్యా. అంతా హఠాత్తుగానే జరిగిపోయింది" అంటూ జరిగినది అంతా పూసగుచ్చినట్లు చెప్పింది. వింటూ ఉండిపోయాడు సత్య.

"చాలా సంతోషం దివ్య. కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు మనస్ఫూర్తిగా.

ఇద్దరూ అన్యమనస్కంగానే ఉండటం వల్ల మొక్కుబడిగానే తినడం ముగించేశారు. "బిల్ నేనిస్తాను" అన్నాడు సత్య.

"అదేమిటి నీ పుట్టినరోజు పార్టీ నేనిస్తానన్నానుగా!" అంది దివ్య.

"అది మరోసారి. నీ పెళ్ళి నిశ్చయమైన శుభసందర్భంలో ఈ పార్టీ నేనిస్తాను" అన్నాడు సత్య.

"సరే!" అంటూ నవ్వేసింది.

ఇద్దరూ బయటికి వచ్చారు. ఏక్టివా మీద వెళ్ళిపోతున్న దివ్యను చూసి బరువుగా నిట్టూర్చాడు సత్య. ఎందుకో దిగులుగా అనిపించింది. అప్పటి వరకూ అణచి ఉంచిన ఆవేదన కన్నీటి రూపంలో బయటపడింది. ఇంటికి వెళ్లాలనిపించలేదు. బైక్‌మీద గమ్యం లేకుండా ఓ గంటసేపు తిరిగి, ఓ సినిమా హాల్లో దూరి, ఆ చెత్త సినిమా శ్రద్ధగా చూసి, అప్పుడు ఇంటికి వెళ్లాడు.

దివ్య ఇంటికి వెళ్లాక శ్రీరామ్‌నే తల్చుకుంది. అతను మొదటిసారి ఫోన్‌చేస్తే తను ముక్తసరిగా మాట్లాడేసింది. ఏమైనా అనుకున్నాడేమో అని కాస్త తటపటాయించి ఫోన్ చేసింది.

"హలో దివ్యా!" అంటూ వెంటనే సమాధానం చెప్పాడు శ్రీరామ్.

"సారీ! ఇందాక మీరు కాఫీకి రమ్మంటే కాదన్నాను"

"ఏం ఫర్వాలేదు! నేను బయట ఉన్నాను. ఇంటికి వెళ్ళాక ఫోన్ చేస్తాను. నువ్వు త్వరగా పడుకోవుగా!" అన్నాడు.

నిజానికి దివ్య త్వరగానే నిద్రపోతుంది. కానీ ఆ మాట చెప్పాలనిపించలేదు.

"లేదు. ఆలస్యంగానే పడుకుంటాను"

"అయితే, సరే! ఆలస్యం అయినా ఫోన్ చేస్తాను" అన్నాడు.

★ ★ ★

పదిగంటలు దాటింది. సామాన్యంగా ఆవేళకు మంచి నిద్రలో ఉండాల్సిన దివ్య ఆవలింతలు ఆపుకుంటూ కూర్చుంది. 'ఇంకా పడుకోలేదేం అమ్మలూ' అని రెండు సార్లు అడిగింది శాంత.

ఏం చెప్పాలో తెలీక తన గదికి వెళ్లి లైట్ తీసేసి, సెల్‌ఫోన్ దగ్గరే పెట్టుకుని పడుకుంది.

పదిన్నరకి మోగింది. వెంటనే అందు కుంది దివ్య.

"సారీ దివ్యా, చాలా ఆలస్యమైపో యింది. పోనీ రేపు మాట్లాడుకుందామా!"

"వద్దు. ఏం ఆలస్యం కాలేదు"

చిన్నగా నవ్వాడు శ్రీరామ్. "చెప్పు, ఏమిటి విశేషాలు? "

"ఏం చెప్పను? "

"ఏదో ఒకటి. నీ ఇష్టాలూ అయిష్టాలూ చెప్పు. మీ కుటుంబం గురించి చెప్పు" అలా మొదలైన సంభాషణ అలా సాగిపో యింది. దాదాపు గంటసేపు మాట్లాడుకు న్నారు. ఏవేవో కబుర్లు.

'సరే మళ్లీ రేపు మాట్లాడుకుందాం' అని గుడ్‌నైట్ చెప్పుకున్నారు.

మర్నాడు పొద్దున్నే మళ్ళీ ఫోన్- "సాయంత్రం కలుసుకుందామా? " అన్నాడు.

"ఆఫీస్‌లో చాలా పనుంది. వీలుంటే నేనే ఫోన్ చేస్తాను" అంది దివ్య.

నిజానికి ఆఫీస్‌లో అంత కొంపలంటుకు పోయే పనేమీ లేదు. కానీ అమ్మని అడ క్కుండా, ఆవిడ అనుమతి తీసుకోకుండా అతన్తో బయట తిరగడం అంత మంచిది కాదేమో అనిపించింది. అమ్మ ఏమీ ఆంక్షలు పెట్టదు. అదో అలవాటు అంతే. పన్నెండేళ్ల వయసులోనే తల్లి దివ్యకి మంచీచెడూ విడమరచి చెప్పింది. ఎలా నడుచుకుంటే మంచిదో చెప్పింది. ఎంత బాగా చెప్పిందంటే ఈనాటి వరకూ అందుకు భిన్నంగా ప్రవర్తించలేదు దివ్య.

వంట చేస్తున్న తల్లి దగ్గరకు వెళ్లి సాయంచేస్తూ ఈ విషయం ప్రస్తావిం చింది. శాంత కూతురివంక గర్వంగా చూసుకుంది.

"ఇవ్వాళ మేము వారింటికి వెళ్తున్నాం. అన్ని విషయాలూ వివరంగా మాట్లాడాలి కదా! నిశ్చయం అయినట్లేగానీ శంఖంలో పోస్తేగానీ తీర్థం కాదు. ఒకసారి నిశ్చయ మైతే ఇక నువ్వు అతనితో బయటికి వెళ్లినా ఫర్వాలేదు. పదింటికి వెళ్తాం. రాగానే నీకు ఫోన్ చేస్తాను" అంది శాంత.

పదింటికి బైక్‌మీదనే బయలుదేరారు భార్యాభర్తలు.

"రాజాగారు గొప్పవారితో వియ్యమంద బోతున్నారు. ఇకవారు సతీసమేతంగా బైక్‌మీద తిరిగితే బావుండదు. కారు కొనా ల్సిందే" అంది బయలుదేరగానే. శాంతకి కార్లో తిరగాలని చాలా కోరిక. ఎప్పుడూ పోరుతూనే ఉంటుంది. రాజానే వాయిదా వేస్తున్నాడు. 'సెకండ్‌హేండ్ కారైనా కొన కూడదా' అని ఈవిడ అంటే, 'ఎందుకు కాస్తాగితే కొత్తకారే కొందాం' అని అతనం టాడు.

ఇప్పుడు కారు ప్రసక్తి వచ్చేసరికి "అసలే గాభరాగా ఉంది. నువ్వింకా కంగారు పెట్టకు. గొప్పవారితో సంబంధం. కారునే కొంటానో, ఉన్న మోటార్‌సైకిల్‌నే అమ్మే స్తానో ఆ దేవుడికెరుక" అన్నాడు.

నవ్వేసింది శాంత.

దార్లో దిగి మిఠాయిలూ, పళ్ళూ కొను క్కుని గమ్యం చేరారు. ఇల్లు చూసి నోరా వలించింది శాంత.

"ఇదా వీళ్ళ ఇల్లు!" అంది భయంగా.

"ఏం ఫర్వాలేదులే! మొదటిసారి వచ్చిన ప్పుడు నాకూ ఇలాగే కళ్ళు తిరిగాయి" ధైర్యం చెప్పాడు రాజా.

గేటు దగ్గర కాపలాదారు వీళ్లని చూడ

గానే సలాంకొట్టి గేటు తెరిచాడు. నేరుగా లోపలికి వెళ్ళి ఒకపక్కన ఆపాడు. ఇంకా ఆశ్చర్యంగా చుట్టూ చూస్తూంది శాంత.

"పద వెళ్దాం" భర్త మాటలతో ఉలికిపడి లోపలికెళ్లింది. సింహద్వారం దగ్గరే ఎదురొచ్చాడు పనివాడు. హాల్లోకి వెళ్లగానే ఆదరంగా ఆహ్వానం పలికాడు శ్రీధర్.

"రండి. కూర్చోండి!" అన్నాడు.

లోపల్నించి వచ్చిన సువర్ణ, "బాగా ఎండగా ఉందికదా! కాస్త మొహం కడుక్కుంటారా" అడిగింది.

సరేనంది శాంత. పనమ్మాయి బాత్ రూమ్ చూపించింది. అద్భుతంగా టీవీ ప్రకటనల్లో చూపించే బాత్‌రూమ్‌లా

## కొత్తగాలి...



**తను కన్నవాళ్లని చూస్తే**
**మోము మతాబా వెలుగు**
**తనని కన్నవాళ్లని చూస్తే**
**ఆరిపోయిన చిచ్చుబుడ్డి**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

ఉంది. అద్దంలో తన మొహం చూసుకుని ఉలిక్కిపడింది శాంత. జుట్టంతా రేగిపోయి మొహం జిడ్డు కారుతోంది. వెంటనే సబ్బుతో మొహం కడుక్కుని తన బేగ్‌లోంచి దువ్వెనా వగైరా సామగ్రి తీసి మళ్లీ జడవేసుకుని పౌడర్ రాసుకుని, సెంటు జల్లుకుని బయటికి వచ్చింది.

చల్లని పానీయాలూ, కమ్మటి ఫలహారాలూ అందించారు. కాసేపు మామూలు విషయాలు మాట్లాడుకున్న తర్వాత అసలు విషయంలోకి దిగారు.

"మీకు నా స్థితిగతులు తెలుసు. మీరేం కావాలనుకుంటున్నారు? నేనేమివ్వాలి? ఓ మాట అనుకుంటే!" అన్నాడు రాజా చేతులు జోడించి.

"ఛ. అలాంటివేమీ వద్దండీ. మీరివ్వాలనుకున్నదేదో మీ అమ్మాయికివ్వండి చాలు. నాకూ నా కొడుక్కీ ఏమీ వద్దు. ఆవిడకేమైనా కావాలేమో కనుక్కోండి" అన్నాడు శ్రీధర్.

"నాకా? నాకేం వద్దు!" అనేసింది సువర్ణ.

"మరి పెళ్ళిని మీ అంతస్తుకి తగినట్లు చెయ్యాలి కదా!" దీనంగానే అడిగాడు.

"చూడండీ. ఇద్దరబ్బాయిల పెళ్ళిళ్ళూ కలిపే చెయ్యాలనుకుంటున్నాం. మా పెద్ద కోడలి అక్క పెళ్లయ్యాక అప్పుడు మన వంతు వస్తుంది. నాకెలాగో ఆడపిల్లలు లేరు. అవన్నీ నేను చూసుకుంటాను. మీరు ఊరికే ఆదుర్దా పడొద్దు. మీ శక్తికి మించి ఏమీ చెయ్యొద్దు" అన్నాడు శ్రీధర్. అమాంతం ఆయన కాళ్ళమీద పడాలనిపించింది వాళ్ళిద్దరికీ.

"మరి ఈలోగా నిశ్చితార్థం చేసేస్తే బావుంటుంది కదా!" అంది శాంత.

"అవును. ఈకాలం పిల్లలు సినిమాలూ షికార్లూ అంటూ తిరుగుతూనే వుంటారు. మనం వద్దన్నా వినరు. కాబట్టి మనకు ఆప్తులైన వాళ్లను నలుగుర్నీ పిలిచి నిశ్చితార్థం చేసేసుకుంటే ఇక మీకూ నిశ్చింత, మాకూ నిశ్చింత" అంది సువర్ణ.

"అవును. మంచిరోజు చూసుకుని ఆ వేడుక చేసేద్దాం!" అన్నాడు శ్రీధర్. మరి కాసేపు కూర్చుని లేచారు.

"అయ్యో.. భోజనంచేసి వెళ్ళండి" అంది సువర్ణ.

"లేదండీ వంటచేసే వచ్చాను. మరోసారి వస్తాం" అంది శాంత.

బొట్టుపెట్టి, పళ్లూ తాంబూలం ఇచ్చింది సువర్ణ. భార్యాభర్తలిద్దరూ గాల్లో తేలిపోతూ ఇంటికి చేరారు. ఆనందం ఎక్కువై

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర



ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది

అది పుట్టిన రోజయినా..
నూతన సంవత్సర సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

డీడీ లేదా ఎంఓ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.

వివరాలకు : ఈనాడు టోల్ ఫ్రీ నెం : 18004258888 లేదా
vipula.chatura@gmail.comకు మెయిల్ కూడా చేయొచ్చు

ఆకలే లేదు ఇద్దరికీ. ఏదో కాస్త నంజి వది లేశారు.

"ఇక అందరికీ ఫోన్లుచేసి చెప్పాలి కదా!" అన్నాడు రాజా. 'ముందునించి ఎందుకు? స్థిరపడ్డాక చెప్పొచ్చు' అని ఎవరికీ చెప్ప లేదు. రాజా తల్లిదండ్రులు చనిపోయారు. ఒక తమ్ముడు దుబాయ్‌లో ఉన్నాడు. మరో తమ్ముడు ఒరిస్సాలో ఉన్నాడు. చెల్లెలు అమెరికాలో ఉంది. శాంత తండ్రి బాగా పెద్దవాడు. శాంత గాకుండా మరో ముగ్గురు పిల్లలు ఆయనకి. ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్ళు. శాంత అక్క హైదరాబా ద్‌లోనే ఉంటుంది. తమ్ముడు కొత్తగూ డెంలో ఉద్యోగం. ఇంకో చెల్లెలు బెంగు ళూర్లో ఉంటుంది. కొడుకు దగ్గర ఉంటాడు శాంత తండ్రి.

ముందుగా కూతురికి ఫోన్‌చేసి చెప్పాక వరసన అందరికీ ఫోన్లు చేశారు దంపతు లిద్దరూ. అందరూ సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు. తమ్ముళ్ళకి ఈ విషయం చెప్పి, "అవసరమైతే మీ సహాయం తీసు కుంటాను. మళ్ళీ నిదానంగా తీరుస్తాను" అన్నాడు రాజా.

"ఎంత మాట అన్నయ్యా? దివ్య పెళ్ళి మాకు మాత్రం బాధ్యత కాదా! మాకు చేత నైన సాయం ఆనందంగా చేస్తాం" అన్నారు. చెల్లెలూ అదే అంది. అక్కడ ఆవిడా ఉద్యోగం చేస్తోంది. కాబట్టి నిర్భ యంగా హామీ ఇచ్చేసింది. ఇటు శాంత వైపు బంధువులూ చాలా సంతోషించారు. దివ్యకోసం ఏ రాజకుమారుడో వెదు క్కుంటూ వస్తాడని అనుకుంటూనే ఉన్నాం. మేము అనుకున్నట్లే జరిగిందని అన్నారు.

అక్కడ సువర్ణ కూడా అదే పనిమీద ఉంది. దగ్గరి బంధువులకూ, స్నేహితు లకూ ఫోన్లుచేసి చెప్తోంది. 'వాళ్లది చాలా సామాన్యమైన కుటుంబం, ఆస్తులేం లేవు గానీ చాలా మర్యాదస్తులు. ఇక అమ్మా యంటారా చక్కని చుక్క' అని సరదాగా చెప్పుకుంది.

సువర్ణకి కాబోయే పెద్దకోడలు పూజ తల్లి రమ. వాళ్ళు బాగా ఉన్నవాళ్లే. ఈ విషయం విని సంతోషించింది. 'పూజ చెప్పింది. అమ్మాయి చాలా బావుంటుం దిట కదా! మరి మాకెప్పుడు చూపి స్తారు? ' అని అడిగింది. ఆవిడేకాదు ఇంకా చాలామంది, 'మరి కాబోయే కోడల్ని మాకెప్పుడు చూపిస్తావే సువర్ణా?' అన్నారు. సువర్ణ మేనత్త, పినతల్లి తది తరులంతా వున్నారు ఆ అడిగిన వారిలో.

అందర్నీ నిశ్చితార్థంలో చూడమని చెప్పొచ్చు. కానీ అంతవరకూ ఆగాలనిపిం చలేదు. ఎంత త్వరగా దివ్యని అందరికీ చూపిద్దామా అని ఆత్రంగా వుంది. అందుకే ఓ రోజు సాయంత్రం నలుగుర్నీ పిలిచి చిన్న టీపార్టీ ఇద్దామని నిర్ణయిం చింది. ఆ విషయమే శాంతకీ చెప్పింది. "మావాళ్ళంతా దివ్యని చూడాలని సరదా పడుతున్నారు. మీరు మీ అమ్మాయిని తీసుకురావాలి" అంది.

"అలాగే తప్పకుండా వస్తాం!" అంది శాంత. ఆదివారం దివ్యకి సెలవు కాబట్టి ఆరోజు పెట్టుకుందామనుకున్నారు.

"మీకు కారు పంపిస్తా" అంది సువర్ణ.

ఆదివారం సాయంత్రం హోండా సిటీ కార్లో చెక్కు చెదరకుండా వాళ్ళింటికి వెళ్లారు తల్లీకూతుళ్ళు. ఇంటివంక చూసిన దివ్య గుండె ఝల్లుమంది. "అమ్మా" అంటూ తల్లి చెయ్యి పట్టుకుంది.

"చూశావా అమ్మలూ! ఈ ఇల్లు, ఈ వై భోగం అంతా నీకే" అంటుంటే ఆవిడ గొంతు పూడుకుపోయింది.

కారాగిన శబ్దంతో బయటికొచ్చింది సువర్ణ. కార్లోంచి దిగిన దివ్యను కళ్ళారా చూసింది. ఆకుపచ్చరంగు మీద బంగారు

రంగు కుట్టుపూల చీరె, అదే రంగు జాకెట్టు, మెడలో తగుమాత్రం నగలు, పొడవైన జడ. కళ్ళు తిప్పుకోలేకపోయింది.

"రామ్మా రా! రండి వదినగారూ" ఆదరంగా లోపలికి తీసుకువెళ్ళింది. హాల్లో కూర్చొని కబుర్లు చెప్పుకొంటున్న ఆడవాళ్ళందరి చూపూ ఇటు మళ్ళింది.

"ఇదిగో నాక్కాబోయే కోడలు దివ్య. దివ్యా వాళ్ళ అమ్మ శాంతగారు" పరిచయం చేసింది. అందరూ దివ్య వంక కుతూహలంగా చూశారు. "ఇటు రామ్మా" పిలిచింది సువర్ణ మేనత్త. దగ్గరకు వచ్చిన దివ్యని పక్కన కూర్చోబెట్టుకుని మెటికలు విరిచింది.

"సువర్ణా! ఏరికోరి బంగారంలాటి కోడల్ని తెచ్చుకుంటున్నావే!" అంది. పిన తల్లి కూడా ముచ్చటపడింది.

"ఇంత చక్కనిపిల్ల దీపంలా ఇంట్లో తిరుగుతుంటే చాలు" అంది మనస్ఫూర్తిగా.

"చిన్నతనంలో సువర్ణ ఇలాగే వుండేది కదూ? " అంది ఇంకో పెద్దావిడ.

"మొత్తానికి నువ్వు కోరుకున్నట్లూ నీకు తగ్గ కోడలే దొరికింది. మీరిద్దరూ పక్కపక్కనుంటే కళ్ళు తిప్పుకోలేం" అన్నారంతా.

పక్కనే కూర్చొన్న పూజకి మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది. వాళ్ళ దృష్టి తనవైపు మళ్ళించాలని లేచి అటూ ఇటూ తిరిగి కాస్త హడావిడి చేసింది.

అయినా కొత్త కోడలిని చూస్తూ ఆ అమ్మాయినెవరూ పట్టించుకోలేదు. దాంతో ఆమెతల్లి రమ మొహం చిన్నబోయింది.

వచ్చినవారంతా కాసేపు కూర్చుని మరోసారి అభినందించి వెళ్ళిపోయారు. 'పదండి మా ఇల్లు చూపిస్తాను' అని తీసికెళ్ళి ఇల్లంతా చూపించింది సువర్ణ. శాంతకి కళ్లు బైర్లు కమ్మాయి. ఇల్లు చూశాక ఇక వెళ్తామని అంది శాంత.

ఉండండి అని దివ్యకి, శాంతకీ బొట్టు పెట్టి, చీరెలు పెట్టింది.

"అయ్యో ఇవన్నీ ఎందుకండీ!" అంటూ మొహమాట పడిపోయింది శాంత.

"దివ్య మొదటిసారి వచ్చింది మా ఇంటికి. పెద్దవారు మీకివ్వకుండా తనకి ఒక్కదానికే ఎలా ఇస్తాను? " అంది సువర్ణ ఆప్యాయంగా. ఇంకా వాళ్ళ తోటలో కాసిన కూరలూ, పళ్ళూ, స్వీట్లూ అన్నీ ఇచ్చి పంపించింది.

పూజ, రమ మాత్రం ఇంకా ఉన్నారు. "ఎలా ఉంది వదినగారూ నా చిన్నకోడలు? " అడిగింది సువర్ణ.

"అమ్మాయికేం! చాలా బావుంది. కానీ వాళ్ళు మరీ మామూలు వాళ్ళలాగా ఉన్నారు. ఆవిడని చూశారా ఎలా ఉందో! మీరు తొందరపడ్డారేమో అనిపిస్తోంది వదినగారూ" అంది రమ.

సువర్ణకి మనసు చివుక్కుమంది.

"వాళ్ళు మామూలువాళ్ళైనా మాకభ్యంతరం లేదు. మంచీమర్యాదా తెలిసిన వాళ్ళు. అటువంటి ఇంట్లోంచీ వచ్చిన పిల్ల మనతో ఇట్టే కలిసిపోతుంది" అంది.

"సామాన్యమైన ఇంట్లోంచీ వచ్చినంత మాత్రాన అణకువగా ఉండాలని రూలేమీ లేదు. ఆ మాటకొస్తే మామూలు వాళ్ళకే కాస్త ఐశ్వర్యం వస్తే కళ్ళు నెత్తికి ఎక్కుతాయి. అన్నీ ఉన్నవాళ్ళే అణిగిమణిగి

**కొత్తగాలి...**

**వరండాలో**
**సెల్‌ఫోన్లో మాట్లాడుతూ ఆయన**
**చేతిలో పుస్తకంతో ఆవిడ**
**పెళ్లయి పాతికేళ్లయింది మరి!**

– ఊర్మిళాజ్యోతి,
మహబూబ్‌నగర్



ఉంటారు" అంది.

"చూద్దాంలెండి. ఇప్పటినుంచీ అవన్నీ ఆలోచించడం ఎందుకు?" అనేసింది సువర్ణ నవ్వుతూనే.

ఆ రాత్రి భర్తకి జరిగినదంతా చెప్పింది. అన్నీ విని నవ్వేశాడాయన.

"అంటే నీకు పౌరుషం పొడుచుకువస్తుంది గానీ ఇలాటి ఆలోచనలు మీ ఆడవాళ్లకి బాగానే వస్తాయి. నువ్వు పదిసార్లు దివ్య చక్కదనాన్ని పొగిడేసరికి ఆవిడకు మనసు కష్టం వేసిందేమో? సువర్ణా.. ఏది ఏమైనా నీకు గడ్డురోజులు ముందున్నాయి. రాబోయే కోడళ్ళతో ఎలా సమర్ధించుకుంటావో" అన్నాడు.

నిశ్చితార్థానికి ముహూర్తం నిర్ణయించారు. "దగ్గరవాళ్ళనే పిలుద్దాం. పెళ్ళికి ఎలాగా అందర్నీ పిలుస్తాం కదా!" అన్నాడు శ్రీధర్.

వాళ్ళవైపు ఓ యాభైమంది, వీళ్ళవైపు ఓ యాభైమందీ అవుతారనుకున్నారు.

మంచి హోటల్‌లో చిన్న హాల్ బుక్ చేశాడు రాజా. అల్లుడికి ఉంగరం, బట్టలు తీసుకోమని వాళ్ళకే పది హేనువేలు ఇచ్చాడు. మిగిలిన నలుగురి కోసం మంచి బట్టలు కొన్నారు. వచ్చిన ఆడవారి కోసం బట్టలు కొన్నారు. భోజన పదార్థాలు జాగ్రత్తగా ఎంపిక చేసి ఘనంగా ఉండేలా చూశాడు.



'దివ్యకి జాకెట్ కుట్టించాలి కదా? ఓ ఆది జాకెట్టు పంపించ'మని కబురు చేసింది సువర్ణ. ఇచ్చి పంపించింది శాంత. ఫంక్షన్ ముందురోజే రాజా తమ్ముడు వచ్చేశాడు. శాంత తండ్రీ తమ్ముడూ మరదలూ, అక్కా-బావ కూడా వచ్చేశారు. మరోసారి వివరాలన్నీ తెలుసుకుని ఆనందించారు. తమ్ముడు అన్నగారి చేతుల్లో పదివేలు పెట్టబోతే రాజా వారించాడు.

"ఇప్పుడొద్దులేరా! పెళ్ళికి తీసుకుంటాలే" అన్నాడు.

నిశ్చితార్థం పొద్దున పదిన్నరకి. ఎనిమిదింటికి మగవాళ్ళంతా వెళ్ళారు ఏర్పాట్లు చూసుకోవడానికి. తొమ్మిదిన్నరకి పెళ్లి కూతుర్ని తీసుకుని ఆడవాళ్ళంతా వెళ్ళారు. పదింటికి మగపెళ్ళివారు అట్టహాసంగా పది పదిహేను కార్లలో వచ్చారు. మర్యాదగా ఆహ్వానించారు అమ్మాయి వైపువారు.

రాగానే బాదం మిల్క్, అది వద్దన్నవారికి కాఫీ అందించారు. శ్రీరామ్ తెల్లటి పైజామా కుర్తా వేసుకుని చూడముచ్చటగా ఉన్నాడు. 'అబ్బ ఎంత బావున్నాడో పెళ్ళికొడుకు. దివ్య ఎంతో అదృష్టవంతురాలు' అనుకున్నారు దివ్యవైపువారు. అటువైపు ఆడవాళ్ళంతా ఖరీదైన చీరెలు, నగలూ ధరించి మహారాణుల్లాగా ఉన్నారు.

కార్యక్రమం మొదలైంది. దివ్యని తీసు

కొచ్చి కూర్చోబెట్టారు. లేత గులాబీ రంగు పట్టుచీరెలో అప్సరసలా ఉంది దివ్య. "విఘ్నేశ్వర పూజ చేయించి, అమ్మాయికి బొట్టు పెట్టి, కొత్త చీరె ఇవ్వండమ్మా" అన్నాడు పురోహితుడు.

చీరె, దానిమీద రెండు మూడు నగలు పెట్టి పూలు, పసుపు, కుంకుమలూ పెట్టి బొట్టుపెట్టి చేతికందించింది సువర్ణ. పదిలంగా అందుకుంది దివ్య.

"లోపలికి వెళ్ళి చీర కట్టుకుని రామ్మా" అన్నాడు పురోహితుడు.

దివ్యని లోపలికి తీసుకెళ్ళారు. శ్రీరామ్‌ని పీటలమీద కూర్చోబెట్టి పూజ కొనసాగించారు.

దివ్యతో బాటుగా ఇద్దరు స్నేహితురాళ్ళు, దివ్య పిన్ని లోపలికి వెళ్ళారు. అంతే. ధనవంతులు కదా.. ఏం పెట్టారోనని కుతూహలంగా చూశారు. వాళ్ళ కళ్ళు చెదిరిపోయాయి. పదిహేనువేల ఖరీదు చేసే చీరె. కెంపులూ, పచ్చలూ, ముత్యాలూ కలిపి చేసిన నెక్లెస్, చెవుల ఆభరణాలు, ఉంగరం, గాజులు, నడుముకు సన్నని గొలుసులాటి వడ్డాణం. మరో రెండు జతల గాజులు.

ఏమిటిది? ప్రదానానికే ఇన్ని నగలా? ఇక పెళ్ళికెన్ని పెడతారో! అప్పటిదాకా ఉన్న కుతూహలం అసూయగా మారింది వాళ్లకు. అయినా దాన్ని ప్రదర్శించక దివ్యని అలంకరించడంలో మునిగిపోయారు.

పెళ్ళికూతురు ముస్తాబై హాల్లోకి రాగానే అందరూ అటే చూశారు. శ్రీరామ్ కళ్ళు మెరిసాయి. సువర్ణ మొహం దివిటీలా వెలిగిపోయింది. పెళ్ళికొడుకు లోపలికి వెళ్ళి రెండు నిమిషాల్లో మామగారు పెట్టిన కొత్త బట్టలు వేసుకుని వచ్చేశాడు.

ఇద్దరినీ పక్కపక్కన కూర్చోబెట్టి పూజ చేయించారు. ఇరువైపులా శ్రీధర్ దంపతులూ, రాజా దంపతులూ కూర్చున్నారు. ఖంగున మోగే కంఠంతో మంత్రాలు చదివి ఫలానా వారి అమ్మాయిని, ఫలానివారి అబ్బాయికిచ్చి వివాహం జరపడానికి నిశ్చయించుకుని సభా సమక్షంలో ముక్కోటి దేవతల సాక్షిగా నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుంటున్నారని ప్రకటించాడు. ఇరువైపులా తాంబూలాలు మార్చుకున్నారు.

ఆ తరువాత కాబోయే వధూవరులు ఉంగరాలు ఒకరికొకరు తొడిగారు. దండలు మార్చుకున్నారు. ఇరువైపుల స్నేహితులూ వాళ్ళ చుట్టూ చేరి అల్లరి మొదలుపెట్టారు.

పెద్దవాళ్ళు ఇదంతా వేడుకగా చూస్తున్నారు. హోటల్‌వాళ్ళు సందర్భోచితంగా పెళ్ళి పాటలు మంద్రస్థాయిలో వినిపిస్తున్నారు స్పీకరు ద్వారా.

"మా రోజుల్లో ఇవన్నీ లేవు. ఇరువైపుల పెద్దవాళ్ళూ లాంఛనంగా తాంబూలాలు పుచ్చుకొనేవారు. అమ్మాయీ అబ్బాయీ పెళ్ళిచూపుల తరువాత మళ్ళీ పెళ్ళిలోనే కలుసుకోవడం. ఇప్పుడు ఉంగరాలు, దండలు మార్చుకుంటున్నారు. అందుకే సగం వివాహం అయిపోయినట్లే.." అంది ఒక పెద్దావిడ.

అక్కడ పురోహితుడు కూడా శ్రీరామ్‌తో ఆమాటే చెప్తున్నాడు. "చూడు నాయనా మంత్రబద్ధంగా ఇంకా ఈమె నీకు భార్యకాకపోయినా, మాటపూర్వకంగా నీ భార్య అయినట్లే. వాగ్దత్త. ఇద్దరూ కలకాలం హాయిగా వుండండి" అంటూ అక్షింతలు జల్లి, ఆశీర్వదించి, నిశ్చితార్థం కార్యక్రమాన్ని ముగించాడు.

ఇక ఆ తర్వాత ఫొటోల కార్యక్రమం ప్రారంభమైంది. ఆహూతులంతా మరోసారి కాఫీలూ, కూల్‌డ్రింక్‌లూ తాగుతూ కబుర్లలో పడ్డారు. 'దివ్య అదృష్టవంతురాలు. శ్రీమంతుల ఇంట కాలుపెట్టబో

తోంది. వాళ్లే కోరి చేసుకుంటున్నారుట.'

'అవుననుకోండి. కానీ ఇద్దరిమధ్యా తేడా కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. చివరిదాకా వారితో సమంగా చెయ్యాలంటే కష్టమే.'

'అందుకిష్టపడే చేసుకుంటున్నారుట. అయినా వాళ్ళూ అంత తక్కువ వాళ్ళేంకాదుగా.. దివ్య నెలకి ముప్పైవేలు సంపాదిస్తోంది. చక్కనిపిల్ల. బుద్ధిమంతురాలు. ఇంకేం కావాలి?'

'మొత్తానికి రాజా అదృష్టవంతుడు. ఒక్కగానొక్క కూతుర్ని మంచి ఇంట్లో ఇస్తున్నాడు..' అనుకుంటున్నారు ఆడపెళ్ళివారు.

అటువైపు మగపెళ్ళివారి వైపువాళ్ళూ ఈ విషయాలే మాట్లాడుకుంటున్నారు. '

'సువర్ణ బాగానే పెట్టేసింది బంగారం. అయినా వడ్డాణం కూడా ఇప్పుడే పెట్టేసిందేం?'

'కాదు. పెళ్ళికోసం వేరేగా పట్టీ వడ్డాణం, వంకీ అన్నీ చేయిస్తుందిట.'

'అవున్లే పెద్దకోడలికి అన్నీ పుట్టింటివారు పెట్టారు కాబట్టి కొన్ని పెట్టింది. ఇప్పుడు రెండువైపులా తనే చూసుకోవాలిగా మరి!'

'ఎంతైనా వాళ్ళముందు తేలిపోతున్నారు. శ్రీకాంత్ నిశ్చితార్థం ఎంత ఘనంగా జరిగిందో గుర్తుందిగా!'

'ఆ పోనిద్దూ! వీళ్ళకేం తక్కువ? ఎంత పెట్టినా తరగదు. ఈ పెట్టుపోతలకేంగానీ పిల్ల చూశావా ఎంత చక్కగా వుందో? ఈ మధ్య ఇంత చక్కని పెళ్ళికూతుర్ని చూడనేలేదు. పిల్లాతల్లీ ఒకే రకంగా వుంటున్నారు పెళ్ళిళ్ళల్లో. ఈడూ జోడూ చూడ ముచ్చటగా వున్నారు అది చాలదా!' అనుకుంటున్నారు.

మరికాసేపటికి భోజనాలు మొదలయ్యాయి. పదార్థాలన్నీ రుచికరంగా ఉన్నాయి.

ఆడ పెళ్ళివారు ఆడవారికి బొట్టుపెట్టి జాకెట్టు బట్టా పండూ తాంబూలం ఇచ్చారు. మగపెళ్ళివారు వెండి కుంకుమ భరిణెలూ, పండూ తాంబూలం ఇచ్చారు.

చాలా బ్రహ్మాండంగా జరిగింది అనుకున్నారు రాజా వైపు వచ్చినవాళ్ళు. క్లుప్తంగా అయినా బాగానే జరిగింది అనుకున్నారు శ్రీధర్ వైపువారు.

అనుకున్నదానికన్నా భారీగానే ఖర్చయినా తృప్తిగా వుంది రాజాకి. ఆ రాత్రి తమ్ముడి దగ్గర కూర్చుని ఆ విషయమే మాట్లాడాడు. "ఏమోరా.. ఎలా బయటపడతానో?" అన్నాడు దిగులుగా.

"ఏం దిగులు పడకు అన్నయ్యా! మేమిద్దరం లేమా?" అని ధైర్యం చెప్పాడు తమ్ముడు శేఖర్. అతనే కాదు దుబాయ్‌లో వున్న తమ్ముడు వేణు, అమెరికాలో వున్న చెల్లెలు సుధ కూడా ధైర్యం చెప్పారు.




**ని**శ్చితార్థం అయ్యాక ఇరుకుటుంబాల మధ్యా మరింత చనువు ఏర్పడింది. రెండు రోజులకోసారి కాబోయే వియ్యంకులూ, వియ్యపురాళ్ళూ మాట్లాడుకుంటూనే వున్నారు. శ్రీరామ్, దివ్య ప్రతిరోజూ కనీసం గంటసేపు కబుర్లు చెప్పుకుంటున్నారు. శ్రీరామ్ చూపించే ప్రేమానురాగాలతో తలమునకలైపోతోంది దివ్య. భవిష్యత్తు గురించి ఎన్నో కబుర్లు చెప్తాడు. అతన్తో మాట్లాడుతూ తనని తానే మర్చి

పోతోంది. తన అంత అదృష్టవంతురాలు ఇంకెవరూ వుండరు అనుకుంటోంది.

నిశ్చితార్థమైన నెలరోజులకి శ్రీధర్ వాళ్ళ పెళ్ళిరోజు. ప్రతి ఏడాదీ ఆ రోజున ఇంట్లో సత్యనారాయణవ్రతం చేసుకుంటారు. రాజావాళ్ళని రమ్మని ప్రత్యేకంగా చెప్పారు.

వెయ్యి రూపాయలు ఖరీదుచేసే వెంకటగిరి చీరె ఆవిడ కోసం, ఆయనకి జరీ పంచెల చాపు తీసుకెళ్ళారు రాజా శాంత. అక్కడికి వెళ్ళాక ఆ హడావిడీ ఆర్భాటం చూసి నోటమాటరాలేదు వాళ్ళకి. వ్రతమే కదా అని సన్నఅంచు చీరె కట్టుకుని సాదాగా తయారై వెళ్ళింది శాంత. అక్కడ అందరిలో చాలా నాసిగా కనిపించింది. వచ్చినవాళ్ళలో కొత్తవాళ్ళు 'ఎవరూ? ఎవరీవిడ? ' అని అడిగారు. 'శ్రీరామ్‌కి కాబోయే అత్తగారు' చెప్పారెవరో.

'అబ్బ ఏవిటీ మరీ అలావుందేం? ' అని చెవులు కొరుక్కున్నారు. సువర్ణ చాలా ఆదరంగానే పలకరించింది అంత హడావిడిలోనూ. రమ మాత్రం ఓ నవ్వు నవ్వేసి వూరుకుంది. శాంతకి ఊపిరి ఆడనట్లుగా వుంది. ఎలాగో కళ్ళు మూసుకుని కాలక్షేపం చేసేసి భోజనాలు అవగానే ఇంటికొచ్చి పడిపోయింది.

"ఏవిటో మరీ వాళ్ళమధ్య పనిమనిషిలా వున్నాను" బాధపడింది శాంత. తేలిగ్గా కొట్టిపారేశాడు రాజా.

సువర్ణ కూడా అదే అనుకుంది. 'మరీ అలా రాకపోతే కాస్త మంచి చీరె కట్టుకు రావచ్చు కదా! నలుగురిలోనూ చిన్నతనంగా అనిపించింది' అనుకుంది.

ఆ తర్వాత కూడా రెండు మూడు పార్టీలూ ఫంక్షన్లూ అయ్యాయి. అప్పుడూ అదే పరిస్థితి. క్రమంగా వాళ్ళింటికి వెళ్ళాలంటే ఏదో జంకుగా వుంది శాంతకి. కానీ వెళ్ళక తప్పదు. అటు సువర్ణ పరిస్థితీ అలాగే వుంది. అయినా ఈ పెళ్ళయిపోతే దివ్య తమ ఇంటికే వచ్చేస్తుంది. అంత దాకా ఎలాగో సర్దుకుపోతే సరిపోతుందని అనుకొంది.

ఆవేళ శ్రీకాంత్ పుట్టినరోజు. హోటల్లో పార్టీ. ఎక్కువ మంది రారు. దగ్గరవాళ్ళు ఓ పదిహేను మంది అంతే. శ్రీధర్ దగ్గ రినుంచీ ఆహ్వానం అందుకున్న రాజా తల పట్టుకుని కూర్చున్నాడు. మళ్ళీ ఫంక్షను. మళ్ళీ ఏదైనా బహుమతి తీసుకువెళ్ళాలి. తను చచ్చీచెడి తన తాహతుకి మించిన బహుమతే తీసుకువెళ్ళినా అక్కడికి వెళ్ళాక ఇతరులిచ్చే బహుమతుల ముందు తేలిగ్గానే వుంటోంది. ఇక శాంత సంగతి చెప్పనక్కర్లేదు. గుండె దడ వచ్చేస్తోంది. ఏం కట్టుకోవాలీ. వాళ్ళతో ఎలా వ్యవహరించాలి? దివ్య ముందర ఇవన్నీ చర్చించుకుంటే బాధపడుతుందని అదో భయం.

దివ్యకు మాత్రం సువర్ణ బోలెడు బట్టలూ, బహుమతులూ కొంటూనే వుంది. రోజు విడిచి రోజు ఎవరి చేతనో ఇచ్చి పంపుతూనే వుంది.

"ఎందుకండీ ఆ ఉద్యోగం? ఎండలో తిరిగి పిల్ల అలసిపోతోంది. మానేసి ఇంట్లో కూర్చోమందాం" అంది సువర్ణ భర్తతో, నిశ్చితార్థమైన మర్నాడు.

శ్రీధర్ మందలించాడు. "తప్పుకదూ. వున్నపాటున ఉద్యోగం మానమంటే ఆ అమ్మాయి చిన్నబుచ్చుకుంటుంది. పెళ్ళయ్యేదాకా చెయ్యనీ. ఆ తర్వాతంటావా శ్రీరామ్, ఆ అమ్మాయి కలిసి నిర్ణయించుకుంటారు" అన్నాడు.

"అయితే ఓ కారు పంపండి. మనక్కాబోయే కోడలు స్కూటరు మీద తిరగడం ఏమిటి? " అంది.

దానికీ కాదన్నాడాయన. "అలా మనకి మనమే నిర్ణయాలు తీసేసుకొని ఏదో ఉపకారం చెయ్యబోతే వాళ్ళను చిన్నబుచ్చినట్లవుతుంది. వాళ్ళదారిన వాళ్ళని వుండనీ.

మనింటికొచ్చాక నీ ఇష్టం" అన్నాడు.

రాజా, శ్రీకాంత్‌కి పుట్టినరోజు కానుక ఏమివ్వాలోనని చాలా తీవ్రంగా ఆలోచించి, రెండువేల అయిదువందలు పెట్టి వాచీ కొన్నాడు. పార్టీకి మిగిలినవాళ్ళంతా పుష్ప గుచ్ఛాలు ఇచ్చారు. ఇతను బహుమతి ఇస్తే "ఎందుకు అంకుల్ ఇవన్నీ? నేనేం చిన్నపిల్లాడినా? " అన్నాడు శ్రీకాంత్. అందరూ నవ్వేశారు. ఆనందంగా నవ్వారో, హేళనగా నవ్వారో అర్థంకాలేదు రాజా శాంతలకి.

అప్పుడు వ్రతానికి వెళ్ళినప్పుడు అందరూ ఎంతో విలువైన బహుమతులిస్తే వాళ్ళముందు వీళ్ళు తక్కువగా అనిపించారు. ఇప్పుడు బహుమతి ఇచ్చినా తేడాగానే వుంది. వేడుకకి వచ్చిన ఆనందం కంటే ఆందోళన ఎక్కువయింది. ఇంటికి వచ్చాక కూడా ఆ విషయమే చర్చించుకున్నారు. వాళ్ళను చూడబోతే నిత్యకళ్యాణం పచ్చతోరణంలా వున్నారు. వాళ్ళ ఇంట్లో వేడుకంటేనే మన గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయనుకొన్నారు. ఏం భయంలేదులే. పెళ్ళయ్యాక మనమ్మాయి అక్కడికి వెళ్ళిపోతుంది. అప్పుడు ఏ సమస్యా వుండదు. మనం ఎలా నడుచుకోవాలో తనే చెప్తుందనుకొన్నారు.

★ ★ ★

ఆవేళ మధ్యాహ్నం. సువర్ణకి ఒక ఫోన్ వచ్చింది. హలో అనగానే "సువర్ణా నేను వాణిని గుర్తుపట్టావా? " ప్రశ్నించింది.

గభాల్న గుర్తురాలేదు. గుర్తొచ్చాక సంభ్రమాశ్చర్యాలకు గురయింది. "వాణీ నువ్వా? ఎన్నాళ్ళకి? ఎప్పుడొచ్చావు? గల్ఫ్ నించా? " అడిగింది.

బోలెడన్ని వివరాలు చెప్పింది వాణి. వాళ్ళెప్పుడో ముప్ఫైఏళ్ళ క్రితం గల్ఫ్ వెళ్ళిపోయారు. అక్కడ మొదట్లో వాణి భర్త భాస్కర్ ఉద్యోగం చేసినా తర్వాత స్వంతంగా వ్యాపారం ప్రారంభించాడు.

## నాకంటే గొప్పవి

ప్రతిరోజూ ప్రార్థనానంతరం లేదా పడుకోబోయే ముందు బాపూజీతో ఎవరైనా కాస్సేపు మాట్లాడేందుకు అవకాశం దొరికేది. అలాంటి సమయాల్లో కొందరు బాపూజీతో, 'దేశ వ్యాప్తంగా బీడీ, సిగరెట్ల



వ్యాప్తి నానాటికీ పెరిగిపోతున్నది కదా? దానిని నిరసిస్తూ మీరెందుకు ప్రకటన చేయరు? ' అని నిష్ఠూరంగా అడిగారు.

బాపూజీ ఏం చెబుతారోనని ఆత్రుతగా చెవులు రిక్కించారు. 'నా మాటకు, నా మహాత్మతనానికి విలువ పోతుందప్పుడు. ఎందుకంటే బీడీ, సిగరెట్లు నాకంటే గొప్పవి. నేనలా ప్రకటించినా వాటిని మానడం అంత తేలిక కాదు' అన్నారు బాపూజీ.

కోట్లు గడించాడు. వాళ్ళకో అమ్మాయి, ఒక అబ్బాయి. పిల్లలు పెళ్ళీడుకి వచ్చారు. వాళ్ళకీ మనదేశం మీద గాలి మళ్ళింది. అక్కడంతా అమ్మేసుకుని ఇక్కడికి వచ్చేశారు. ఇక్కడ కూడా ఎవరితోనో వాటాదారుగా జేరాడుట ఆయన. జూబ్లీహిల్స్‌లో ఇల్లు కొనుక్కున్నారుట. ఎంతోసేపు మాట్లాడి ఎన్నో వివరాలు చెప్పింది.

"సువర్ణా నిన్నిలా నేరుగా అడుగుతున్నందుకు వేరేగా అనుకోకు. మా అమ్మాయికి పెళ్ళి చేయాలనుకుంటున్నాం. మీ అబ్బాయి వయసూ వివరాలూ చెప్తావా? మీకు అభ్యంతరం లేకపోతే ముందుకి సాగుదాం" అంది వాణి.

"సారీ వాణీ! మా పిల్లలిద్దరికీ పెళ్ళి కుది

రింది" చెప్పింది సువర్ణ.

"అలాగా చాలా సంతోషం సువర్ణా"

"వాణీ మరి మా ఇంటికెప్పుడు వస్తావు? " అడిగింది.

"ఇంకా ఇంట్లోకి వెళ్ళలేదు. ఇంటిపనులూ జరుగుతున్నాయి. అక్కడి నించీ సామాన్లూ రాలేదు. మరో వారం రోజులు నేను ఖాళీగానే వుంటాను. నువ్వెప్పుడు రమ్మంటే అప్పుడే వస్తాను" అంది వాణి.

"అయితే రేపు మధ్యాహ్నం భోజనానికి రండి. మీవారూ, పిల్లలూ అందరూ రావాలి. మీవారి నెంబరిస్తే ఈయనచేత ఫోన్ చేయిస్తాను" అంది సువర్ణ.

"ఆయనకి ప్రత్యేకంగా చెప్పాలా? నువ్వు చెప్తే చాలదా! అందరం వస్తాం!" అంది వాణి.

ఆ విషయం భర్తకి చెప్పి, "కాస్త త్వరగా రండి" అంది సువర్ణ.

"అలాగే వస్తాను" అన్నాడు శ్రీధర్.

మర్నాడు మధ్యాహ్నం రాబోయే అతిథులకోసం విందు ఏర్పాట్లన్నీ దగ్గరుండి చూసుకుంది సువర్ణ. శ్రీధర్ కూడా త్వరగానే వచ్చేశాడు.

ఒంటి గంటకి వచ్చారు భాస్కర్, వాణి, వాళ్ళమ్మాయి స్మిత. ఆదరంగా ఎదురు వెళ్ళి ఆహ్వానించారు సువర్ణ శ్రీధర్.

## కొత్తగాలి...

**మద్యం కైపు**
**పెరుగుతోంది**
**మాంద్యం ఊపు**
**తరుగుతోంది**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
యర్రగుంట్ల, కడప జిల్లా

పరిచయాలయ్యాయి. ఇద్దరూ సమాన హోదాలో వున్నవారు. కాబట్టి ఇద్దరు మగ వాళ్ళూ ఇట్టే కలిసిపోయి మాటల్లో మునిగిపోయారు. మాటలని బట్టి చూస్తే భాస్కర్ వీళ్ళకంటే ఓ మెట్టు పైనే వున్నాడు. అయినా ఏమాత్రం గర్వం లేకుండా ఇక్కడ వ్యాపార సరళి ఎలా వుందోనని అడిగి తెలుసుకున్నాడు. తనకు తెలిసిన వివరాలన్నీ చెప్పాడు శ్రీధర్.

వాణీ, సువర్ణా సరేసరి. పాత స్నేహితులు. ఎన్నోరోజుల తరువాత కలుసుకున్నారు. కబుర్లకేం తక్కువ. స్మితకి త్వరగానే విసుగేసింది. మెల్లిగా టీవీ ముందుకి జారిపోయింది.

"ఏమిటో సువర్ణా! అమ్మాయి పెళ్ళి విషయంలోనే దిగులు. గారాబంగా పెరిగిన పిల్ల. మంచి ఇంట్లో పడెయ్యాలని నా ఆశ. ప్చ్! ఏమిటో కాస్తలో తప్పిపోయింది. లేకపోతే నీ కొడుక్కే ఇచ్చి చేసి నిశ్చింతగా వుండేదాన్ని!" అంది వాణి మాటల్లో.

అంతలోనే సర్దుకొని, "నువ్విక్కడ ఎంత కాలంగా వున్నావు? నీకు చాలామందితో పరిచయాలున్నాయి. స్మిత కోసం మంచి అబ్బాయిని వెతికే బాధ్యత నీదే" అంది.

"అలాగే! నాకు మాత్రం ఆ బాధ్యత లేదా? " అంది సువర్ణ. మూడింటిదాకా ఉండి వెళ్ళారు. వాణి సువర్ణకోసం ఒక గొలుసు బహుమతిగా తెచ్చింది. ఇక పళ్ళు మిఠాయిలూ సరేసరి. వాళ్ళు మొదటిసారి వచ్చారని వాళ్ళకి మంచి బట్టలు పెట్టింది సువర్ణ. వాళ్ళు వెళ్ళాక కూడా వాళ్ళగురించే మాట్లాడుకున్నారు. 'ఎంత మంచితనం, ఎంత మర్యాద! స్మితకూడా చాలా చక్కగా వుంది. బంగారు తల్లిలా' అనుకున్నారు.

మర్నాడే వాణి ఫోన్ చేసింది. "మా ఇంటి దగ్గరికి వెళ్తున్నాను! నువ్వూ రారాదూ. ఇల్లు చూసినట్లుంటుంది" అంది. సువర్ణ వెంటనే వెళ్లిపోయింది.

ప్రస్తుతం వాణీవాళ్లు ఒక గెస్ట్‌హౌస్‌లో వుంటున్నారు. కాఫీ తాగాక బయలుదే రారు. జూబ్లీహిల్స్‌లో వుంది ఇల్లు. అంత కుమందు ఎవరో సగందాకా కట్టించి అమ్మే స్తుంటే వీళ్ళు కొనుక్కున్నారు. పని పూర్తి చేయిస్తున్నారు.

చాలా పెద్ద ఇల్లు. పూర్తయితే ఇంకెంత అద్భుతంగా ఉంటుందో అనిపించేలా వుంది. అక్కడికి దగ్గరలోనే మరో ఇల్లు కూడా కొందామనే ఆలోచన ఉందట. మరొకటి ఎందుకూ అంటే ఇది కొడుక్కి ఇచ్చి, అది కూతురికి ఇస్తారుట. "మాకు మాత్రం ఏ పదిమంది వున్నారు? వాళ్ళి ద్దరే కదా! ఇద్దరికీ సమానంగా ఇవ్వాలని ఆయనకి సరదా!" చెప్పింది వాణి.

వారం రోజులు తిరిగొచ్చాయి. ఇంచు మించు రోజూ కలుసుకుంటూనే వున్నారు వాణీ, సువర్ణా. క్రమంగా సువర్ణ మన సులో ఏదో బాధ, అసంతృప్తి, అసహనం. 'ఊరికే తొందరపడి శ్రీరామ్‌కి ఆ సంబంధం స్థిరం చేసేశానా? మరికొద్ది కాలం ఆగివుంటే ఎంత బావుండేది?'

దివ్యకూ స్మితకూ అందంలో ఏమాత్రం తేడా లేదు. మళ్ళీ చెప్పాలంటే స్మితే బావుంటుంది. ఇక హోదా విషయంలో ఇద్దరికీ హస్తిమశకాంతరం. మొదట్లో ఏ మూలో వున్న భావన క్రమంగా పెరిగి మనసంతా ఆవరించేసరికి సువర్ణ ప్రవర్తన లోనూ తేడా కన్పించింది. దివ్య ఫోన్ చేస్తే ముందులాగా ఆప్యాయంగా మాట్లాడ లేకపోతోంది. శ్రీరామ్‌ని చూసినప్పుడల్లా పశ్చాత్తాపం. 'నాకేం తక్కువని అంత తొందరపడ్డాను?' అని పైకి చెప్పలేక, మన సులో దాచుకోలేక సతమతమవుతోంది.

దివ్య, శ్రీరామ్ మాత్రం మానసికంగా మరింత దగ్గరయ్యారు. ఆస్తి అందం సరే. అన్నింటినీ మించి అతని సంస్కారం చూసి ముగ్ధురాలైపోతుంది దివ్య. నిశ్చి తార్థమైన తర్వాత ఒకరోజు ఫోన్‌చేసి 'లాంగ్ డ్రైవ్‌కి వెళ్దామా?' అని అడిగాడు.

తడబడింది దివ్య. అమ్మా వాళ్ళని అడిగి చెప్తానంది. అందేగానీ అడగడానికి మొహమాటం వేసింది. 'మీ వాళ్ళని అడి గావా?' అని అతను రెట్టించలేదు. ఆ తర్వాత ఒకరోజు తనంతట తనే చెప్పే సింది. 'నేనడిగితే వాళ్ళు వద్దనరు. కానీ నాకే మొహమాటంగా వుంది. ఏం చెయ్యను?' అంటే, నవ్వేశాడు. 'వద్దులే. నీ బాధ నేను అర్థం చేసుకోగలను' అన్నాడు.

ఎన్నోసార్లు కలిసి కాఫీ తాగారు. రెండు సార్లు సినిమాలకి వెళ్లారు. అతని ప్రవర్తన ఎంతో మర్యాదగా వుంటుంది. అతి చనువు తీసుకోడు. ఇక ఫోన్‌లో మాట్లాడు కుంటే సమయమే తెలియదు. ఎంత స్నేహంగా కబుర్లు చెప్తాడు. భవిష్యత్తు గురించి మాట్లాడడు. ఎన్నో తెలియని విషయాలు చెప్తాడు. వాళ్ళిద్దరి మధ్యా మంచి స్నేహం నెలకొంది.

'పెళ్ళి స్థిరపడగానే వెంటనే పెళ్ళయిపో కుండా ఈ మాత్రం వ్యవధి ఉండడం కూడా మంచిదే అయింది. ఇప్పుడు మా ఇద్దరి మధ్యా ఎంతో ఆప్యాయత ఏర్ప డింది. భార్యాభర్తలం కాకముందే మంచి స్నేహితులం అయిపోయాం. ఆదర్శ దాంపత్యానికి స్నేహమే గట్టి పునాది' అను కుని తృప్తిపడుతుంది దివ్య. ఆమెతో ఏకీ భవిస్తాడు శ్రీరామ్.

ఇద్దరూ వేయి కళ్ళతో రాబోయే శుభ దినం కోసం ఎదురుచూస్తున్నారు.

ఓ నెలరోజులు గడిచాయి. అదివరకు రెండు మూడు రోజులకు ఒకసారి సువర్ణ శాంతకి ఫోన్ చేసేది. వాణి వచ్చాక అసలు తీరిక వుండడంలేదు. ఒకటి రెండు సార్లు శాంత ఫోన్ చేసింది. ఆవిడ ఇంట్లో లేదు. రాగానే చెప్తాం అన్నారు. చెప్పారు కూడా. ఆవిడ విని ఊరుకుంది. ఎందుకో

ఈ మధ్య శాంత పేరుచెప్తేనే చిరాకొస్తోంది సువర్ణకి. దివ్యపట్ల కూడా ఏదో విముఖత ఏర్పడింది. అదివరకటిలా బహుమతులు పంపటం కూడా తగ్గిపోయింది. కాస్త ముభావంగానే వుంటోంది.

దివ్యకి ఆఫీసులో పని ఒత్తిడి ఎక్కువగా వుండడంతో ఈ విషయం పట్టించుకోలేదు. శాంత కూడా సుఖంగానే ఉంది. మళ్లీ ఏ వేడుకలూ రాలేదు. పెళ్ళయ్యేదాకా ఇలా గడిచిపోతే బావుండుననే అనుకుంది.

ఆవేళ వాణినీ, మరికొందరు స్నేహితురాళ్ళనూ భోజనానికి పిలిచింది సువర్ణ.

"మేము వచ్చి ఇన్నాళ్లైనా నీ కాబోయే కోడళ్ళని పరిచయం చెయ్యనేలేదు. నేను దిష్టి పెడతానని భయమా" దెబ్బలాట వేసుకుంది వాణి.

"అదేం లేదు. ఏదో హడావిడితో సరిపోయింది. ఇవాళ రమ్మంటానులే" అంది సువర్ణ.

పూజకీ, దివ్యకీ ఫోన్ చేసి చెప్పింది.

ఇద్దరూ వచ్చారు. పిలిచినవాళ్ళంతా కూడా వచ్చారు. వాణి, స్మితలకి పరిచయం చేసింది సువర్ణ. వాణి ఇద్దరికీ చిన్న బహుమతులు ఇచ్చి ఆదరంగా వివరాలు అడిగి తెలుసుకుంది.

స్మిత వాళ్ళ వయసుదే కాబట్టి ఇట్టే కలిసిపోయింది వాళ్లతో.

"ఏదైనా జాబ్ చేస్తారా? " అడిగింది దివ్య.

"లేదండీ, నాన్నదగ్గరే పనిచేస్తాను. తమ్ముడు అమెరికానుంచీ రావడానికి ఇంకా రెండేళ్ళు పడుతుంది కదా" అంది స్మిత.

"అదే మంచిది. నేనూ మా నాన్నగారిదగ్గరే వున్నాను. మనకీ వ్యాపారాలు ఉన్నప్పుడు ఇంకొకరి దగ్గర ఉద్యోగం చెయ్యడం దండగ కదా!" అంది పూజ.

తల వంచుకుంది దివ్య.

"మన పెళ్ళయ్యేదాకా అక్కడే వుండి అనుభవం గడిస్తే ఆ తర్వాత మన కంపెనీలోకే వచ్చేద్దువుగాని. ఇద్దరం ఒకేదగ్గర వుంటే ఆ ఆనందంవేరు" శ్రీరామ్ మాటలు గుర్తొస్తున్నాయి. చిన్నగా నవ్వుకుంది దివ్య. భోజనాలు అయ్యాక అందరూ వెళ్ళిపోయారు.

భాస్కర్ ఢిల్లీ వెళ్ళాడు. 'ఇప్పుడేం వెళ్తావు? ఈ పూటకి వుండిపో. రేపు పొద్దున వెళ్లచ్చులే' అని వాణీవాళ్ళని ఆపేసింది సువర్ణ.

వాణీ సువర్ణ బయట కూర్చున్నారు.

"వాణీ నా కోడళ్ళెలా వున్నారు? " అడిగింది సువర్ణ.

నిట్టూర్చింది వాణి.

"నీ కోడళ్ళకేం బావున్నారు!" అనేసింది నిరాసక్తంగా.

"ఏమిటలా నీరసంగా చెప్తాన్నావు? "

"ఏం లేదులే!"

"ఏమిటా నాన్చుడు? నీకు నేను పరాయిదాన్నా? మనసులో మాట స్పష్టంగా చెప్పు" నిలదీసింది సువర్ణ.

"అంటే నీకు కోపం వస్తుందిగానీ సువర్ణా నీకు హడావిడి ఎక్కువ ఆలోచన తక్కువ" అనేసింది వాణి.

గతుక్కుమంది సువర్ణ.

"అదేవిటే అలా అంటావు? "

"మరింకే అనమంటావ్? నీ పిల్లల పెళ్ళి విషయంలో అంత తెలివితక్కువగా నిర్ణయం తీసుకున్నావ్" అంది వాణి విసురుగా.

"పెద్దవాడెలాగా వాడి ఇష్టప్రకారమే ఎంచుకున్నాడు. చిన్నవాడికి చక్కటి పిల్లను ఎంచాను. దివ్య చూశావా ఎంత చక్కగా వుందో!" సమర్థించుకుంది. తన మనసులో అదే భావం వున్నా బయటపెట్టుకోవడం ఏమాత్రం ఇష్టంలేదు సువర్ణకి.

"చక్కదనం విషయంలో ఏ సందేహమూ లేదు. నిజమే! కానీ ఆస్తీ, అంతస్తు కూడా వుండొద్దా? "

"వాళ్ళకి ఆస్తి వుంటే ఏం? లేకపోతే ఏం? అయినా కూతుర్ని మనకంటే ఎక్కువ వున్న ఇంట్లో ఇవ్వమనీ, కోడల్ని తక్కువ ఇంట్లోనించీ తెచ్చుకోమనీ శాస్త్రమే చెప్తోంది కదా!" సమర్థించుకుంది సువర్ణ.

"నిజమే. నీకంటే ఒక్క మెట్టు తక్కువ వున్న కోడలైతే నీ ఆలోచనకి శభాష్ అనుకోవచ్చు. ఇప్పుడీ పిల్ల తండ్రికి స్వంత ఇల్లు లేదు. వెనక ఆస్తీ లేదు. మరి ఏం చూసి చేసుకుంటున్నావు? "

"మా కెందుకూ డబ్బు మాకున్నది చాలదా? "

"ఏమిటే నీ తెలివితక్కువతనం? నీకు ఒక్కరే కొడుకైతే ఎటువంటి సంబంధం చేసినా తంటాలేదు. కానీ నీకిద్దరు కొడుకులు. పెద్దకోడలు కలవారింటి అమ్మాయి. రెండోది అతిమామూలు వారింటి పిల్ల. రేపు పెళ్ళయిన తర్వాత ఈ తేడా నీకు అడుగడుగునా తలనెప్పిగా మారుతుంది. ఇద్దరినీ ఒకేరకంగా చూసినా బావుండదు. వేరేవేరేగా చూసినా బావుండదు. వంతులూ, పోటీలూ వస్తాయి. అదీగాక లేనింటి పిల్ల కదా అణిగి మణిగి వుంటుందనీ నమ్మకంలేదు. తోటికోడల్ని చూసి అసూయపడితే ఇక ఇల్లు నరకమే. అలాకాకుండా, మా అమ్మానాన్నా అక్కడ అతి మామూలుగా వున్నారు. ఇక్కడ బోలెడంత వుంది కదా, వాళ్ళను ఆదుకుందామని ఆ అమ్మాయి అనుకుందనుకో.. ఇక నీ పని శ్రీమద్రమారమణ గోవిందా!" అంది వాణి.

సువర్ణ మొహం నల్లబడింది. "నేనంత దూరం ఆలోచించలేదు వాణీ!" అంది దీనంగా.

జాలిగా చూసింది సువర్ణ.

అంతా విని నిట్టూర్చింది. "అంటే ఇంత గొప్ప సంబంధాన్ని నీకై నువ్వే అడిగి కుదుర్చావన్నమాట. ఇక జీవితాంతం నోరెత్తే అవకాశం కూడా లేదు. ఏమైనా అంటే మీరే వెంటబడి చేసుకున్నారు, మేమేం రాలేదు మీ దగ్గరికి అనేస్తారు" అంది వాణి.

"అదో గొడవ వుందా! నేనంత దూరం ఆలోచించలేదు" అంది దీనంగా.

"అందుకే ఇటువంటి విషయాల్లో నిలుపూ నిదానం వుండాలంటారు. ఈ విషయం నీ ఆప్తులతో చర్చించాలనే ఆలోచనైనా రాలేదా నీకు? " అడిగింది వాణి.

"నాకంత ఆప్తులెవరూ లేరు. బంధువులను వెంటేసుకుని పెళ్ళిచూపులకి పోదా

## దేవుని వైద్యం



గాంధీజీ సేవాకార్యక్రమాల గురించి సేవాగ్రామ్ పట్వారీ పట్టించుకునేవాడు కాదు. ఓసారి అతడికి టైఫాయిడ్ వచ్చింది. ఏవేవో మందులు తిన్నా జ్వరం తగ్గలేదు. పిలువకపోయినా వెళ్లి చికిత్స చేయడం గాంధీజీ ఆశ్రమవాసుల అలవాటు. డాక్టర్లు వెళ్లి పట్వారీకి మందులు, ఇంజక్షన్లు ఇచ్చి వైద్యం చేశారు. రోగి కాస్త కలిగినవాడే కావటంవల్ల వైద్యానికి అయిన ఖర్చును రాసిచ్చారు. అదేమంత పెద్దమొత్తం కాదు.

పట్వారీ బిల్లు చూసి, 'మీరేం చేశారు? దేవుడు నాకు నయం చేశాడంతే!' అన్నాడు.

డాక్టర్లు గాంధీజీకి అంతా వివరించారు. అప్పుడు బాపూజీ నవ్వుతూ, 'అలాగా? దేవుడు రోగం నయం చేసింది సరేగాని, మీరు కూడా కొంత చేశారని నమ్మకం కలిగితేనే అతడు బిల్లు ఇచ్చేది. అంటే మీరు ఆ నమ్మకం కలిగించలేదన్నమాట' అన్నారు.

మంటే దానికి ఆయన ఒప్పుకోరు. అందుకే మేముమటుకే వెళ్ళాం!" చెప్పింది.

"వెంట ఇంకెవరైనా వుంటే మీరంతా అమ్మాయిని చూసి ఊరుకున్నా ఆ వెంట వచ్చినవాళ్ళు వాళ్ళ తీరుతెన్నూ గమనించే వారు. ఈ సాధక బాధకాలన్నీ చర్చించే వారు. మీకూ ముందూ వెనకా ఆలోచిం చేందుకు వీలుగా వుండేది! నేనే వుండుంటే నీవెంట వచ్చివుండేదాన్ని" అంది.

"సరేలే! ఏదో సామెత చెప్పినట్లు నువ్వే వుండుంటే అసలీ వెతకటాలూ పెళ్ళిచూపులూ ఎందుకూ? లక్షణంగా నీ కూతురే నా కోడలయ్యేది కదా? " అంది సువర్ణ దీనంగా.

"సర్లే అయిపోయిన పెళ్ళికి బాజాలెందుకు? అయినా నువ్వు నా స్నేహితురాలివి. కాబట్టి నేనేదో పిచ్చిగా ఆలోచిస్తున్నాను గానీ నేను అనుకున్నట్లుగా జరగాలని లేదు. ఆ అమ్మాయి చక్కగా మీతో కలిసిపోయి, ఈ సంబంధం కుదిర్చినందుకు నీ పట్ల కృతజ్ఞతతో వుందనుకో. ఇక ఏ సమస్యలూ వుండవు. హాయిగా మనవలతో కాలక్షేపం చేస్తావు. నీ మనసు మంచిది. నీకంతా మంచే జరుగుగుంది" అంది వాణి.

పేలవంగా నవ్వింది సువర్ణ. ఇక ఆ తర్వాత ఇద్దరి మధ్యా ఏం మాటలు జరగలేదు. ఇక పడుకుందామని లేచారు.

అప్పటికే నిద్రలోవున్న శ్రీధర్‌కి భార్య రాకతో మెలకువ వచ్చింది.

"ఏమిటే? ఇంతసేపూ ఫ్రెండ్‌తో కబుర్లే!" అన్నాడు.

ఏమీ సమాధానం చెప్పలేదు సువర్ణ. మామూలుగా మాటకు మాట సమాధానం చెప్పే భార్య ముభావంగా వుండేసరికి లేచి కూర్చుని ఆవిడవంక చూశాడు.

"అలా వున్నావేం? " అడిగాడు. సమాధానం లేదు.

"ఏమైంది సువర్ణా? " రెట్టించాడు.

పక్కకి తిరిగి పడుకుందావిడ. 'సర్లే మనసు బాగాలేదోమో' అనుకుని ఊరుకున్నాడు.

మనిషిమనసు చాలా చిత్రమైనది. ఏదైనా మనసులోకి రాకుండా వుండాలే గానీ వచ్చిందంటే ఆలోచనలన్నీ దాని చుట్టూనే తిరుగుతూంటాయి. ఇప్పుడు సువర్ణ పరిస్థితీ అలాగే వుంది. ఒక బీజం పడింది. ఇక అది మొలకెత్తి దినదినప్రవర్ధమానంగా పెరిగిపోతోంది. అదివరకు దివ్యలో కనిపించిన మంచి గుణాలన్నీ ఇప్పుడు వ్యతిరేకంగా అనిపిస్తున్నాయి. అన్నీ నెగెటివ్ ఆలోచనలే. రేపు పెళ్ళయ్యాక శ్రీరామ్‌కి ఏ ముద్దూముచ్చటా జరగదు. పిల్లలు పుడితే వాళ్ళకీ లోటుగానే వుంటుంది.

పెద్దవాడి జీవితం ముందు రెండోవాడి జీవితం తీసికట్టుగానే వుంటుంది. ఎప్పుడైతే మనసులో అటువంటి ఆలోచనలు వచ్చాయో, మనసులో దాచుకోలేక మధనపడింది సువర్ణ. దగ్గరవాళ్ళతో చెప్పుకుంది.

'నీకంత గునుపుగా వుంటే ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఈ రోజుల్లో పీటల మీద పెళ్ళిళ్ళే తప్పిపోతున్నాయి. వాళ్ళకి ఏదోవిధంగా చెప్పి ఇది వద్దనేసెయ్. ఆ తర్వాతంటావా నీకు తగిన సంబంధం చెయ్యవచ్చు' అని చెప్పారు వాళ్లు.

మొదటిసారి విన్నప్పుడు తెల్లబోయింది సువర్ణ. అది చాలా తప్పుగా అసంభవంగా అనిపించింది.

కానీ నిదానంగా ఆలోచిస్తే అలా జరిగితే బాగుంటుందేమో అనుకుంది. నిజమే. ఇంతకాలం అయ్యో తొందరపడ్డాను అనే బాధపడ్డానుగానీ కాలాతీతం కాలేదని తెలుసుకోలేకపోయాను. ఈ రోజుల్లో ఇవన్నీ సహజమే. ఆమధ్య మధు

సూదర్రావుగారి అబ్బాయి నిశ్చితార్థం అయ్యాక సంవత్సరం తర్వాత పెళ్లి ముహూర్తాలు పెట్టుకున్న తర్వాత ఆ అమ్మాయే వద్దు పొమ్మంది.

మధుసూధర్రావుగారు మరో సంబంధం చూసి ఆ ముహూర్తానికే పెళ్ళి చేశారు. సూర్యంగారి అమ్మాయి పెళ్లయిన నెలరో జులకే భర్తతో దెబ్బలాడి విడాకులు తీసుకుని మళ్ళీ పెళ్ళి చేసుకుంది. ఇలాటి సంఘటనలు చాలా జరిగాయి. నేనూ ఏదో ఉపాయం ఆలోచించి ఇందులోంచీ బయటపడితే తర్వాత చక్కగా స్మితనే తన కోడల్ని చేసుకోవచ్చు.

ఈ వ్యవహారం అంతా కష్టం, క్లిష్టమూ కూడా. చాలా జాగర్తగా వ్యవహరించాలి. తనకైతాను బయటపడకుండా అటునించీ నరుక్కు రావాలి. చాలా దీర్ఘంగా ఆలోచించింది. ఆవిడకి స్నేహితులు చాలా మందే వున్నారు. అందులో ఈవిడవల్ల లాభం పొందినవాళ్లు ఎప్పుడూ విశ్వాసంగా ఉండే వాళ్లు ఉన్నారు. వాళ్లల్లో విమల అనే ఒకావిడ వుంది. ఆవిడ చీరలు తెప్పించి వాయిదాల పద్ధతిన అమ్ముతుంది. మొదట్లో విమలకి పెట్టుబడికి సహాయం చేసింది సువర్ణ. అంతేకాదు చాలా మందిని పరిచయం చేసి విమల వ్యాపారం వృద్ధిచెందేలా చేసింది. ఆవిడకి సువర్ణంటే చాలా కృతజ్ఞత ఉంది.

విమలను పిలిపించి తన మనసులోని మాట చెప్పింది సువర్ణ. విమల సువర్ణను సమర్థించింది. 'మీ ఆవేదన సబబుగానే వుంది. నాకైతే ఇందులో మీ స్వార్థంకంటే వాళ్ల గురించే ఆలోచిస్తున్నారని అనిపిస్తోంది. పెళ్లంటే ఒక రోజులో పోయేది కాదు కదా! జీవితాంతం వుండేది. మరి అది సజావుగా సాగాలంటే ఎన్నో ఆలోచించాలి. నేను వారితో పరిచయం చేసుకుని మెల్లిగా కథ నడుపుతాను. మీరు నిశ్చింతగా వుండండి'. అని హామీ ఇచ్చింది. అంతేకాదు ఏం చెయ్యాలో సూచనలు కూడా ఇచ్చింది.

మర్నాడు సువర్ణ శాంతకు ఫోన్ చేసింది. "మా ఫ్రెండ్ చీరెలు అమ్ముతుంది. మీ ఇంటికి పంపిస్తాను చూసి మీకు నచ్చితే తీసుకోండి" అంది.

శాంతకి అలా ఇంటి దగ్గర చీరెలు కొనడం అలవాటే లేదు. ప్లెయిన్ చీరెలు కొని దానిమీద తనే వర్క్ చేస్తుంది. పెయింటింగ్ చేసుకుంటుంది. బార్డర్లు కొని కుట్టేస్తుంది. లేదా మంచి షాప్‌కి వెళ్లి కొనుక్కుంటుంది. అయినా వియ్యపురాలు చెప్పింది కాబట్టి కాదనలేకపోయింది. ఈ మధ్య ఆవిడ బిజీగా వుండి ఫోనులే

> **కొత్తగాలి...**
>
> **ఆ పిల్లాడికి**
> **ఒళ్లంతా వాతలు**
> **ఇంగ్లీషు కాన్వెంటులో**
> **తెలుగులో ఏడ్చాడు మరి!**
>
> – వాడపర్తి వెంకటరమణ,
> విశాఖపట్నం

చెయ్యడం లేదు. 'చాలా రోజుల తర్వాత చేసింది. వద్దంటే ఏమైనా అనుకుంటుందేమో? ' అని, 'సరే, పంపించండి అంది.

విమల ఒక అసిస్టెంట్‌ని వెంటపెట్టుకుని వచ్చింది.

శాంత విమలని చూసి ఆశ్చర్యపోయింది. తను కొనకపోయినా ఈ చీరెలమ్మేవాళ్లను ఒకటి రెండుసార్లు చూసింది. మామూలుగా వుంటారు. రెండు మూడు సంచుల్లో చీరెలు తీసుకొస్తారు. ఈవిడ చాలా దర్జాగా వుంది. ఖరీదైన చీరె కట్టుకుంది. చేతులకి ఏడెనిమిది బంగారం

గాజులు, మెళ్లో గొలుసులు. మంచి హెయిర్ స్టయిల్. కార్లో వచ్చింది. వెంట ఓ పనమ్మాయి.

"రాజారాంగారిల్లు ఇదేనా! అడిగింది" హుందాగా.

"అవునండీ రండి" అంది శాంత.

"నన్ను సువర్ణగారు పంపించారు" అంది సోఫాలో కూర్చుని.

"అవును వదినగారు చెప్పారు" అంది శాంత.

"అబ్బ చాలా వేడిగా వుంది. ఏసీ ఆన్ చేస్తారా? " అంది విమల.

గతుక్కుమంది శాంత "ఏసీ లేదు" అంటూ కూలర్ స్పీడు పెంచింది.

"సారీ! సువర్ణమేడమ్‌కి కాబోయే వియ్యాలవారింట్లో ఏసీ వుండదని నేను అనుకోలేదు" అంది విమల.

శాంత మనసు చివుక్కుమంది. అంతలోనే సర్దుకుని నవ్వేసింది. కాఫీ, టీ తీసుకుంటారా? అంది మర్యాదగా.

"వద్దండీ. చల్లగా కూల్ డ్రింక్ ఇవ్వండి" అంది విమల.

వెళ్లి ఫ్రిజ్ తీసింది శాంత. హమ్మయ్య అదృష్టం బావుంది. కోక్ బాటిల్ వుంది. తీసి గ్లాసుల్లో పోసి వాళ్లిద్దరికీ ఇచ్చింది. తాగాక "లీలా సూట్ కేసులు తీసుకురా" అంది హుందాగా విమల. ఆ అమ్మాయి పరిగెట్టుకువెళ్లి రెండు సూట్‌కేసులు తెచ్చింది. చాప వుంటే ఇవ్వండమ్మా అంది. చాప తెచ్చి ఇచ్చింది శాంత. చాప వేసి దానిమీద ఓ తెల్లటి దుప్పటి పరిచింది లీల. విమల సూట్‌కేస్ తీసింది. 'ఇదుగోనండీ. వారు సింపుల్ చీరెలే ఇష్టపడతారని చెప్పారే అందుకే తక్కువలో తెచ్చాను. అంటూ ఒక్కొక్కటీ చూపిస్తోంది. ఆరు వేలు, ఏడు ఎనిమిది వేలు అలా వున్నాయి. ధరలు విని శాంతకి



నోరెండిపోతోంది. ఇంతింత ధరలా? అసలే ఈ మధ్య ఖర్చులు ఎక్కువైపోయి కాస్త ఇబ్బందిగానే వుంటోంది. ఇప్పుడింత ధర పెట్టి చీరె కొనాలంటే గుండెల్లో రాయి పడ్డట్లుగా వుంది.

"ఇంతింత భారీ చీరెలు నేను కట్టనండీ" అంది మెల్లిగా.

"ఇవా? ఇవేం భారీ చీరెలూ! మీ కోసం అన్నీ సింపుల్‌వే తెచ్చాను. చూడండి. జరీ లెక్కువ లేవు. లైట్ వెయిట్. సువర్ణా మేడమ్ ఇవే కట్టుకుంటారు. మరి వారి వియ్యపురాలు మీరు కట్టకపోతే ఎట్లా? ఎక్కువొద్దులెండి, రెండో మూడో తీసుకోండి" అంది విమల నవ్వేస్తూ.

శాంతకి ఏడుపొక్కటే తక్కువ. ఇలాటి క్లిష్టపరిస్థితి ముందెప్పుడూ ఎదురవలేదు. మనసు దిటవు చేసుకుని 'ఈ రంగు నా దగ్గరుంది. ఇది నాకు బాగుండదని వంకలు పెట్టి చిట్టచివరికి ఒక చీరె తీసుకుంది. అదే ఆరు వేలు.

విమల చిన్నబుచ్చుకుంది. "సువర్ణా మేడమ్ వెళ్లమంటే వాళ్ల బంధువులు కదా చాలా చీరెలు తీసుకుంటారని ఇటొచ్చాను. వేరేచోట వేరేవాళ్లు రమ్మన్నారు. వాళ్లెప్పుడూ ఆరేడు చీరెలకన్నా తక్కువ తీసుకోరు. ఇలా అని ముందే తెలిస్తే అటే వెళ్లేదాన్ని" అంది కాస్త నిష్టూరంగా.

నేనెక్కువ పట్టుచీరెలు కట్టను. అదీగాక మా ఇంట్లో సెలక్షన్ అంతా మావారు, మా అమ్మాయీ చూసుకుంటారు అని ఏదో కథలు అల్లి చెప్పేసింది శాంత.



'సర్లెండి, ఈసారి మీ అమ్మాయి వున్నప్పుడు వస్తాను. సగం డబ్బు ఇప్పుడివ్వండి. సగం మళ్లీ మారు వచ్చినప్పుడు ఇవ్వచ్చు' అంది విమల.

హమ్మయ్య అనుకుని డబ్బిచ్చి పంపించింది శాంత. విమల దర్జాగా వెళ్లిపోయింది. గ్లాసెడు మంచినీళ్లు తాగి చతికిలపడింది శాంత. ఎదురుగా ఆ చీరె. ఇలా బలవంతాన ఖర్చులు చెయ్యడం ఏమాత్రం అలవాటు లేదేమో దిగులుగా వుంది శాంతకి.

సాయంత్రం రాజా వచ్చేసరికి ఇంకా అలాగే వుంది. టిఫిన్ ఏదీ చెయ్యలేదు.

దిగాలుపడి కూర్చున్న భార్యను చూసి రాజా కంగారుపడ్డాడు.

"ఏమిటి ఏమైంది? " అన్నాడు. అంతా చెప్పింది. విని నవ్వేశాడు

రాజా. "ఇంతేనా ఇంకేమిటో అనుకున్నా. పోనీలే చీరె కొనుకున్నావు. ఈమాత్రం దానికి ఏ గుర్రప్పందేలలోనో డబ్బులు పోయినట్లు బాధపడిపోతున్నావు. వియ్యాలవారింటికి వెళ్ళాలంటే మంచి చీరెలు లేవనుకునేదానివిగా. మంచి చీరొకటి కొనుక్కున్నావ్.."అన్నాడు. దివ్య వచ్చాక కూతురితో ఇదంతా చెప్పాడు. దివ్య కూడా నవ్వేసింది.

"పోన్లేమ్మా నీకై నువ్వు ఎలాగో కొనుక్కోవు. ఆవిడ పంపించారు కాబట్టి కొనుక్కున్నావు. వచ్చేనెల్లో నీ బర్త్‌డే వుందిగా. నీకు నేను ప్రెజెంట్ చేస్తా ఈచీరె" అంది.

"ఇంకా నయం. పుట్టినరోజుకి ఎందుకింత మంచి చీరె? దాచి వుంచుతా. రేపు నీ పెళ్ళికి పనికొస్తుంది" అంది శాంత.

"మీఅమ్మకి మూడ్ పాడైపోయింది పద హోటల్‌కి వెళ్దాం" అన్నాడు రాజా. ముగ్గురూ హోటల్‌కి వెళ్ళారు.

శాంత ఇంకా దిగులుగానే వుంది.

"దివ్యా! ఓ పనిచేద్దాం. ఏదైనా ఛానెల్‌కి ఫోన్‌చేసి పిలుద్దాం. వాళ్ళకిదంతా చెప్దాం. చీరె కొనుక్కుని మనశ్శాంతికి దూరమైన మహిళ. కనీవినీ ఎరుగని వింత అని ఓ ఐటమ్ టెలికాస్ట్ చేస్తారు" ఆటపట్టించారు తండ్రీ కూతుళ్ళు.

## కొత్తగాలి...

**వాడికి**
**ప్రాణం పోసిన అమ్మ**
**శేషం**
**ప్రేమించిన అమ్మాయి**
**విశేషం**

**– పట్ల యాదగిరి,** *గుండాల, నల్గొండ జిల్లా*

'ఇదంతా తేలిగ్గా తేలిపోతే ఫర్వాలేదు. లేకపోతే మనకు మనశ్శాంతి వుండదు' అనుకుంది శాంత.

ఆవిడ భయమే నిజమైంది. ఆ విమలో పాఖ్యానం అంత తేలిగ్గా వదల్లేదు. మర్నాడే సువర్ణ ఫోన్ చేసింది. "విమలొచ్చిందా!" అని వివరాలడిగింది. "అదేవిటి ఒకటే తీసుకున్నారా? " అని ఆశ్చర్యపోయింది.

"ఆ రంగులు నాకంతగా నచ్చలేదు" తప్పించుకోవాలని చూసింది శాంత.

"అలాగ. అయితే నే చెప్తానుండండి విమలకి, మంచి చీరెలు తీసుకెళ్ళమని" అని హామీ ఇచ్చింది సువర్ణ. శాంత గుండెల్లో రాయి పడింది. భర్త దగ్గర చెప్తే అతను తేలిగ్గా తీసిపారేశాడు.

"వియ్యాలవారిని గౌరవిస్తాం. వారంటే భయపడతాం. కానీ వారికి చీరెలమ్మే వాళ్ళని కూడా గౌరవించాలంటే కష్టమే మరి. ఈసారి ఆ చీరెల మేడమ్‌గారు రాగానే వాకిట్లోంచే ఏదో చెప్పి సాగనంపెయ్" అన్నాడు.

వారం తిరగలేదు విమల మళ్ళీ వచ్చింది. రాగానే కూల్‌డ్రింక్ ఇచ్చి ఇవ్వాల్సిన బాకీ మూడు వేలూ ఇచ్చేసింది శాంత. ఆవిడ సూట్‌కేస్ తియ్యబోతుంటే వారించింది. "ఇప్పుడేం వద్దు" అంది.

"మీ అమ్మాయికోసం సువర్ణ మేడమ్ కొన్ని చీరెలు సెలక్ట్ చేశారు. నేనిటు వస్తున్నానని తెలిసి నన్నిచ్చి రమ్మన్నారు" అంటూ నాలుగు చీరెలు తీసి ఇచ్చింది. "సరే" అంటూ అందుకుని పక్కనపెట్టింది శాంత.

కాసేపిద్దరూ కబుర్లు చెప్పుకున్నారు.

"ఇక నేను వెళ్తా" అంది విమల.

"మంచిది, వెళ్ళిరండి" అంది శాంత.

"మరి సగం పేమెంట్ ఇవ్వరా? " అంది విమల. శాంత తెల్లబోయింది.

"డబ్బులేమిటి? " అంది.

"అదే ఈ చీరెలు ఇరవై నాలుగు వేలు. సగం ఇస్తారా? "

"నేనివ్వాలా? " ఆశ్చర్యపోయింది శాంత.

"మరింకెవరిస్తారు? " విమల కూడా ఆశ్చర్యపోయింది.

"అంటే వదినగారు సెలక్ట్ చేశారన్నారు కదా ఆవిడ ఇచ్చారేమో అనుకున్నా" నీళ్ళు నమిలింది శాంత.

"మరి నాతో మేడమ్ ఏం చెప్పలేదండీ. ఇవి మా కాబోయే కోడలికివ్వు. ఏవైనా ఫంక్షన్స్‌లో దర్జాగా కట్టుకుంటుందని అన్నారు. అమ్మాయింకా మీ ఇంట్లోనే వుంది కదా మీరిస్తారని ఆవిడనుకున్నా రేమో. ఓ పనిచెయ్యండి. మేడమ్‌కి ఫోన్ చేసి కనుక్కోండి" సలహా ఇచ్చింది విమల.

అలా అడగడానికి చాలా మొహమాటం వేసింది శాంతకి.

"వద్దులెండి అలా అడిగితే బావుండదు. తర్వాత మీరే కనుక్కోండి. నన్నివ్వమంటే నేనే ఇస్తాను"అంది.

"అయ్యబాబోయ్. మేడమ్‌తో డబ్బు విషయం మాట్లాడ్డమా? ఇంకేమైనా వుందా! ఆవిడదంతా కచ్చిత వ్యవహారం. ఇన్నేళ్ళ పరిచయంలో ఏనాడూ ఇలాటి అవసరం రాలేదు. అయినా కాబోయే వియ్యపురాలు కాబట్టి మీరు అడిగితే ఫర్వా లేదు. వాళ్లాటి చిన్నవాళ్ళు డబ్బు గురించి అడిగితే లేకిగా వుంటుంది" అంది విమల భయంగా.

మళ్ళీ అంతలో "సర్లెండి, అడిగేద్దాం. నేను ఫోన్ చేస్తా. మీరు మాట్లాడండి. విషయం తేలిపోతుంది కదా!" అంది.

"వద్దులెండి. మీరేమి అనుకోకుండా వుంటే రేపు రండి. డబ్బిచ్చేస్తాను" అనే సింది శాంత.

"భలేవారే! ఇదంతా డబ్బుకోసం అనుకు న్నారా కొంపదీసి. రేపెందుకు? నిదా నంగా వారం రోజులాగాకే వస్తాను. మీ దగ్గరెక్కడికి పోతుంది? కాకపోతే చీరెలి వ్వగానే సగం పేమెంట్ తీసుకోడం నాకు అలవాటు. అందుకే అడిగేశాను" అంది విమల.

విమల వెళ్ళిపోయాక శాంతకి కళ్ళనీళ్ళు తిరిగాయి. ఏవిటీ పరీక్ష నాకు అనుకుంది దిగులుగా. యథాప్రకారం రాజా, దివ్య వచ్చారు ఇంచుమించుగా ఒకే టైమ్‌కి. జరి గినదంతా చెప్పింది శాంత దిగులుగా.

కిందటిసారిలాగా ఆటపట్టించలేదు రాజా! "ఇదేమిటిది? ఇలా బలవంతాన కూడా కొనిపిస్తారా? " అన్నాడు అయోమ యంగా.

"పాతికవేల చీరెలా అమ్మా! వద్దని చెప్ప కపోయావా!" అంది దివ్య.

"ఎలా చెప్తాను. నీ కాబోయే అత్తగారు పంపించారంటే గిఫ్ట్‌గా పంపించారను కున్నా! బావున్నాయని మెచ్చుకున్నా! తీరా డబ్బులిమ్మనగానే వద్దు పొమ్మని ఎలా చెప్తాను" అంది దీనంగా.

రాజా నిట్టూర్చాడు. "నిజమేలే. సరేకానీ ఆవిడంత సరదాగా పంపిస్తే కాదన్నా బావుండదు. రేపు బ్యాంక్‌నించి తీసుకొస్తా ఇచ్చెయ్" అన్నాడు.

"నేనిస్తాలెండి నాన్నా!" అంది దివ్య వెంటనే.

"మనిద్దరిలో ఎవరిస్తే ఏంరా తల్లీ! నేని స్తాలే" అన్నేశాడు.

అన్నాడేగానీ అతనికీ అలజడిగానే వుంది. అనుకోకుండా వచ్చిపడ్డ ఖర్చు కదా మరి! గతంలో చీరె కొనుక్కొని మనసు పాడు చేసుకున్న శాంతకి ఉల్లాసం కలిగిం చడానికి హోటల్ ప్రోగ్రాం పెట్టిన తండ్రీ కూతురూ ఆవేళ అలాటి ప్రోగ్రాం ఏమీ పెట్టలేదు, సరికదా ఇంట్లో కూడా సరిగ్గా తినలేకపోయారు.

రాత్రి కూడా శాంత బాధగానే వుంటే

ఓదార్చాడు రాజా. "ఇవన్నీ చిన్న విషయాలు. నువ్వూరికే మనసు పాడుచేసుకోకు" అన్నాడు. కానీ జీవితంలో మొదటిసారి తనే బాధపడ్డాడు. అందరిలాగే తనూ ప్రవర్తిస్తూ డబ్బు కూడబెట్టి వుంటే బాగుండేదేమో అనుకున్నాడు. విహారయాత్రలకీ సినిమాలకూ హోటళ్ళకీ ఖర్చు పెట్టకుండా వుంటే బాగుండేదా అని ఆలోచనలో పడ్డాడు.

మర్నాడు దివ్య డబ్బు డ్రాచేసి తెచ్చి తల్లికి ఇచ్చింది. శాంత విమలకు ఫోన్‌చేసింది. ఆవిడొచ్చి డబ్బు పట్టుకెళ్ళింది. వెళ్తూ మరో బాంబులాంటి సమాచారం అందించి మరీ వెళ్ళింది.

## కొత్తగాలి... 

ఆడ ఆడ కలిస్తే వాగుడు
మగ మగ కలిస్తే తాగుడు
ఆడ మగ కలిస్తే చెడుగుడు

– వి.వి.ఎస్. మూర్తి,
చొదిమెళ్ల

సువర్ణగారికి ఇలా చీరెలిచ్చే వాళ్ళేగాక నగలిచ్చేవాళ్ళు తెలుసుట. 'వచ్చేవారం అతన్నీ మా వియ్యాలవారింటికి తీసికెళ్లి పరిచయం చెయ్యి విమలా' అందిట ఆవిడ. 'ఇప్పటినించే కొనడం ప్రారంభిస్తే పెళ్ళినాటికి నగలు అమరుతాయి' అందిట. ఇదంతా చెప్పి "ఎలాగైనా సువర్ణా మేడం ప్లానింగ్ అమోఘం. అన్నీ ఒకేసారి కొనాలంటే మీకు కష్టమవుతుంది కదా! అదుకే ఈ సలహా ఇచ్చారు" అంది.

శాంతి గుండె దారుమంది. ఇదంతా కూతురికి చెప్పి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

దివ్య కూడా కాస్త కంగారు పడింది. కానీ అంతలోనే ధైర్యం తెచ్చుకుంది. 'ఏం ఫర్వాలేదు. శ్రీరాంకి మెల్లిగా ఈ విషయం చెప్తే అతనే ఏదో సలహా చెప్తాడు' అనుకుంది.

అలవాటు ప్రకారం రాత్రి ఫోన్ చేశాడు శ్రీరామ్. కాసేపు కబుర్లు చెప్పుకున్నాక మెల్లిగా ఈ ప్రస్తావన తెచ్చింది దివ్య. అతనికేం అర్థంకాలేదు. 'చీరెలవీ కొంటారా? కొనకపోతే ఏమవుతుంది? కొంటే నష్టం ఏమిటి? ' అని పాపం చాలా ప్రశ్నలేశాడు. 'సర్లే, చూద్దాం' అనేశాడు. 'మిగిలిన కబుర్లు చెప్పు' అని టాపిక్ మార్చేశాడు. పాపం అతని తప్పేంలేదు. ఆ గొడవలన్నీ అతనికి తెలీదు. ఓ గర్ల్‌ఫ్రెండ్ వుంటే కాస్త షాపింగులూ ఖర్చులూ తెలిసేవేమో. అలాటి వ్యవహారాలూ ఏమీలేవు. కలిగిన ఇంట్లో పుట్టిన రాకుమారుడు. తండ్రి వెంట తిరిగి బిజినెస్ వ్యవహారాలూ చూసుకోవటం, ఫ్రెండ్స్‌తో సినిమాలు, షికార్లకీ తిరగటం అంతే అతని లోకం. దివ్య చెప్పిన విషయం అపుడే మర్చిపోయాడు.

రెండ్రోజుల తర్వాత హాల్లో అందరూ కూర్చున్నారు. టీవీ చూస్తున్నారు. అపుడో అడ్వర్‌టైజ్‌మెంట్ వచ్చింది. చీరెలూ నగలూ అన్నీ మా షాపులో దొరుకుతాయని వయ్యారంగా అందరూ పాట పాడుతున్నారు. అపుడు గుర్తొచ్చింది ఆ విషయం.

"అమ్మా! ఏవిటీ నువ్వు దివ్యా వాళ్ళని చీరెలవీ కొనమని ప్రెషర్ పెడుతున్నావట? " అడిగాడు.

"నేనా? " ఆశ్చర్యంగా అడిగిందావిడ.

"అవునట. పాపం! వాళ్ళింట్లో వాళ్ళమ్మా తనూ చాలా టెన్షన్ పడిపోతున్నారట" అన్నాడు.

"ఏమిట్రా నువ్వు చెప్పేది? ఏమిటీ చీరెల గొడవా? " అన్నాడు శ్రీధర్.

"ఏమిటో మరి! అమ్మ ఫ్రెండొకావిడ

దివ్యా వాళ్ళింటికెళ్ళి చీరెలు కొనమని ఫోర్స్ చేస్తోందిట" అంటూ దివ్య చెప్పింది సగం గుర్తుంచుకుని సగం గుర్తు తెచ్చుకోలేక ఏదో చెప్పేశాడు.

"ఏమిటి సువర్ణా! అసలేం జరిగింది? " అన్నాడు శ్రీధర్.

"ఏం లేదు. నేను మామూలుగా చీరెలు తీసుకునే విమలని వాళ్ళింటికి పంపించాను" అంటూ చెప్పేసింది.

"అవునట పాపం! చాలా డబ్బు చీరెలకే అయిపోయిందట. ఆ ఎక్స్‌పెండీచర్ అన్‌ఎక్స్‌పెక్టెడ్‌గా వచ్చేసరికి దివ్య కాస్త కంగారుపడుతోంది" అన్నాడు శ్రీరామ్.

శ్రీధర్‌కి ముచ్చటేసింది కొడుకుని చూసి. నవ్వుకున్నాడు.

కొడుకు తన రూమ్‌లోకి వెళ్ళిపోయాక అప్పుడు సువర్ణతో ఈ విషయం మాట్లాడాడు. "చూడు, వూరికే కంగారుగా ఇలాంటి పన్లు చెయ్యకు. కాస్త నిదానించి ప్రయత్నించాలి కదా? వాళ్ళ అవస్థ ఏమిటో అర్థం చేసుకోవద్దా? " అన్నాడు.

ఆవిడకి కోపం వచ్చేసింది. అప్పటికపుడే లేచి తన గదిలోకి వచ్చి దివ్యకి ఫోన్‌చేసి కాస్త కఠినంగా మాట్లాడింది. "చూడు దివ్యా నువ్వేదైనా మాట్లాడాలంటే నేరుగా నాతోనే మాట్లాడచ్చు కదా! శ్రీరామ్‌కి చెప్పడం ఎందుకు? నువ్వు వాడికి చెప్పడం, వాడు అందరి ముందరా ఈ టాపిక్ తేవడం, అది విని ఈయన నన్ను విసుక్కోడం ఏవిటిదంతా? ఇలా చీరెలూ సింగినాదంలాటి పిచ్చి విషయాలన్నీ చీప్‌గా మగవాళ్ళతో మాట్లాడ్డం మాకలవాటు లేదు" అంది.

దివ్యకి ఏడుపొచ్చినంత పనైంది. "లేదాంటీ.." అంటూ శాంతంగా పరిస్థితి అంతా చెప్పింది.

"మరి ఆమాటే నాతో చెప్పాలి. అంతేగానీ వాడితో చెప్తే వాడేం చేస్తాడు? ఇప్పటినించే నామీద నేరాలు చెప్పడం మొదలుపెడితే ఎట్లా? " అనేసి కాస్త కఠినంగానే మాట్లాడి ఫోన్ పెట్టేసింది.

దివ్య మనసు పాడైపోయింది. అలాగే కూర్చుంది. కళ్ళనీళ్ళు తిరిగాయి. అంతలోనే ఫోన్. శ్రీరామ్ దగ్గర్నించి. "దివ్యా! ఏమిటలా వుంది నీ వాయిస్? " అన్నాడు.

తన మనసులోని బాధంతా అతన్తో చెప్పెయ్యాలనిపించింది. మళ్ళీ అంతలోనే తెలివితెచ్చుకుంది. "ఏంలేదు శ్రీరామ్. తలనొప్పిగా వుంది" అనేసింది.

"అలాగా! ఫీవరేం లేదు కదా! మరి మందేమైనా వేసుకున్నావా? " అన్నాడతను. ఊరికే కాస్త తలనొప్పి అనేసింది. అతను మామూలుగానే మాట్లాడాడు.

"నువ్వెందుకు డల్‌గా వున్నావ్. సర్లే రెస్ట్ తీసుకో" అనేసి ఫోన్ పెట్టేశాడు. తర్వాత నిద్రపట్టలేదు దివ్యకి. లేచి హాల్లో కొచ్చింది. రాజా హాల్లోనే వున్నాడు. ఆశ్చర్యపోయింది.

"నాన్నా పడుకోలేదా మీరు!"

"లేదురా! నిద్రపట్టలేదు. నువ్వూ పడుకోలేదా? " అన్నాడు.

ఆ సమయంలో తండ్రిని చూసిన దివ్యకి ప్రాణం లేచివచ్చింది. మనసుకి ఏమాత్రం కష్టం కలిగినా, ఏ సమస్య వచ్చినా తండ్రికి చెప్పుకుంటుంది. అమ్మకు చెప్తే ఆవిడింకా బెదిరిపోయి బెంబేలెత్తి మొక్కులవీ మొక్కేసి కంగారుపడుతుంది. తండ్రలా కాదు ధైర్యం చెప్తాడు. అందుకే రాజా దగ్గరికి వచ్చి కూర్చుంది. జరిగిందంతా చెప్పింది. అంతా విన్నాడు రాజా.

"నేను తప్పు చేశానా నాన్నా? " అంది దీనంగా.

"లేదురా! నీకు సమస్య వచ్చింది శ్రీరామ్‌కి చెప్పావు. ఆవిడ మందలించడం అంటావా.. ఆవిడ మనసుకి కష్టం కలిగిం

దేమో, నిన్ను కోప్పడ్డారు. అమ్మ కోప్పడదా నిన్ను! అలాగే అనుకో. ఇకముందు ఇంకాస్త మెలకువగా వుండు" అన్నాడు.

దివ్య మనసు తేలికపడింది. ఇద్దరూ కాసేపు కబుర్లు చెప్పుకున్నారు. ఇంక పడుకుందాం అని లేచారు.

"రేపో ఎల్లుండో ఓసారి ఫోన్‌చేసి ఆవిడకి సారీ చెప్పు. మర్యాదగా వుంటుంది" అన్నాడు.

ఆ అవసరం రాకుండా మర్నాడు పొద్దున శాంతకి సువర్ణ ఫోన్‌చేసింది.

"నిన్న నేనూరికే ఆవేశపడ్డాను. తర్వాత శాంతంగా ఆలోచిస్తే నాదే తప్పేమో అనిపించింది. మీరేం అనుకోకండి. మీకు తెలుసుగా చిన్నతనంనించీ నా జీవితం ఒక పద్ధతిగా నడిచింది. మా పుట్టింటివారూ చాలా శ్రీమంతులు. పెళ్ళయ్యాక చెప్పేదేముంది? పట్టిందల్లా బంగారమయింది మీ అన్నగారికి. ఈ డబ్బు సమస్యలూ వెతుక్కుని ఖర్చుపెట్టడమూ నాకు తెలియదు. కంటికి నచ్చిన వస్తువు వెంటనే కొనేసుకోవడమే అలవాటైపోయింది. ఇదంతా గొప్పకోసం చెప్పడం లేదు. మీకు తెలియాలని చెప్తున్నాను. మీ పద్ధతుల ప్రకారం మీరు నడుచుకోండి. విమలకీ చెప్తాను. ఇకముందు ఇలాంటి సమస్య రాకుండా చూసుకుందాం" అంది మర్యాదగా.

"ఏమైందండీ? " అంది అయోమయంగా శాంత.

"అయ్యో మీకు తెలీదా" అంటూ అంతా చెప్పింది. శాంత పాపం చాలా కంగారుపడిపోయింది.

"అయ్యో అదేంమాట వదినగారూ! దివ్యకే చిన్నతనం కదా! ఏదో తెలియక చెప్పేసిందట. మీరే దాన్ని క్షమించాలి"

"భలేవారే! మన్లోమనకు క్షమించడాలూ అవీ ఎందుకండీ! అయినా దివ్య నాకు పరాయిదా? " అంది సువర్ణ.

తర్వాత అతి మామూలుగా "మీ వివరాలేమిటి వదినగారూ! మీ చిన్నతనం ఎలా గడిచిందీ!" అడిగిందామె.

"మధ్య తరగతి కుటుంబమే వదినగారూ. దేనికీ లోటూ లేదు. అలా అని ఐశ్వర్యమూ లేదు. చూసి ఖర్చుపెట్టుకునే స్థితే మాది. నా పెళ్ళయ్యాక కూడా బాధ్యతలూ. మావారిదీ అదోరకం స్వభావం. లేకపోతే మాతోటి వాళ్ళంతా స్వంత ఇళ్ళు కట్టుకున్నారు. మా మరుదులూ ఆడపడుచూ మాకన్నా బాగానే వున్నారు. చెప్పానుగా ఈయనకే ఎలాంటి ముందుచూపు లేదు" అంటూ అన్నీ చెప్పుకొచ్చింది శాంత.

ఇద్దరూ చాలాసేపు కబుర్లు చెప్పుకున్నారు. చాలారోజుల తర్వాత సువర్ణ ఫోన్ చెయ్యడం ఆదరంగా మాట్లాడ్డంతో శాంత చాలా సంతోషించింది. వెంటనే భర్తకి ఫోన్‌చేసి ఇదంతా చెప్పింది. కూతురితోనూ మాట్లాడింది. కాస్త మందలించింది. 'అత్తారింటికి వెళ్ళే ఆడపిల్లవి కాస్త జాగర్తగా వుండాలి' అని చెప్పింది.

ముందురోజున్న దిగులంతా తీరిపోయింది. హాయిగా వున్నారు ముగ్గురూ.

"నిజమే, పాపం! మధ్యతరగతి జీవితం గురించి ఆవిడకేం తెలుస్తుంది. మనం చిన్నప్పుడే ఓ కథ చదువుకోలేదా! ఆగర్భ శ్రీమంతుడి కొడుకుని పేదరికం మీద వ్యాసం రాయమంటే రాముడు చాలా పేదవాడు. అతని పనివాడూ పేదవాడే. వంటవాడూ పేదవాడే. చివరికి రాముడి కారు నడిపే డ్రైవరు కూడా పేదవాడే అని రాశాడుట" అన్నాడు రాజా.

వాళ్ళు ఆనందించినంత సేపు పట్టలేదు. మర్నాడే మరో ఉపద్రవం మళ్ళీ ఫోన్ చేసింది సువర్ణ. "మేమంతా చీటీలేసుకుంటున్నాం. ఇరవైమంది లాట్రీ తీసి పేరు వచ్చినవాళ్ళు ఆడబ్బు తీసుకుంటారు.

మరుసటి నెల్లో వాళ్ళింట్లో భోజనాలు పెడ తారు. మీరు చేరతారా సరదాగా. మీకూ స్వంత ఖర్చుకి వుంటుంది. మాటిమాటికీ మా అన్నగార్ని అడగాల్సిన అవసరం వుండదు. ఈ నెలనించే ప్రారంభం" అంది.

ఆ చీటీల వ్యవహారం శాంతకి నచ్చదు. అసలు ఆర్థికశాఖ పూర్తిగా రాజానే చూసు కుంటాడు. కాబట్టి అవన్నీ పట్టించుకోదు శాంత. అయినా ఆవిడ అడిగింది కాబట్టి "ఎంత కడతారు నెలకి? " అడిగింది.

"ఇరవై వేలు!" చెప్పింది సువర్ణ.

"ఇరవై వేలా? " గుండాగినంత పనైంది శాంతకి.

"అవును వదినగారూ.. ఆమాత్రం లేక పోతే ఎలా? నాలుగు లక్షల్లో ఓ పదివేలు పార్టీకే అవుతుంది. మిగిలినదాంతో మంచి నగలు కొనుక్కుంటాం" తేలిగ్గా చెప్పింది సువర్ణ.

ఏ అయిదొందలో వెయ్యో అయితే ఆలో చిద్దాం అనుకున్నా శాంత "అమ్మో! అంత డబ్బే! ఇరవైవేలంటే మా ఇంటి నెల ఖర్చు వదినగారూ! నాకంత శక్తిలేదు. అంత్య నిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం మేలు కదా!" చెప్పేసింది.

సువర్ణ ఆశ్చర్యపోయింది. "ఇరవై వేలతో నెలగడుస్తుందా! మాకు పనివాళ్ళ జీతాల క్కూడా సరిపోదు" అంది.

"సర్లేండి, మీరు జాయిన్ కావద్దు. వూరికే గెస్ట్‌గా రండి రేపు. రమా వాళ్ళింట్లో మొదటి పార్టీ రేపే. పదకొండిం టికి కారు పంపిస్తా, రండి. వీలుంటే దివ్యనీ రమ్మనండి. వద్దులెండి, తనకి కంపెనీ వుండదు. మీరొక్కరే రండి. మావాళ్ళందర్నీ పరిచయం చేస్తాను" అనేసి పెట్టేసింది.

మళ్ళీ తలపట్టుకుని కూర్చుంది శాంత. సేమ్ స్టోరీ. సాయంత్రం వాళ్ళిద్దరూ రాగానే అంతా చెప్పింది. ఈసారి రాజా విసుక్కున్నాడు. "ప్రతి చిన్న విషయానికి బెదిరిపోతే ఎట్లా? ఆవిడ పిలిచారు, వెళ్ళు" అన్నాడు.

"అవునమ్మా మరీ ఇల్లు కదలవు. కాస్త నలుగుర్లోకీ వెళ్తే నీకూ బావుంటుంది" అంది దివ్య.

భార్యని కసిరేశాడుగానీ రాజా మనసు లోనూ అలజడి మొదలయింది. కాబోయే వియ్యాలవారితో ఎలా నెగ్గుకురావాలీ. కళ్ళముందు బ్యాంక్ బాలెన్స్ కనబడు తుంది. ఎంగేజ్‌మెంట్‌కీ ఆ తర్వాత అయిన ఖర్చులన్నీ నెమరువేసుకుంటే కళ్ళు తిరిగాయి. ఇంకా ఆవగింజలో అరభాగం కాలేదు. ఖర్చులన్నీ ముందేవున్నాయి.

> ## కొత్తగాలి...
>
> **జలయజ్ఞ పురుషుడు**
> **వేనవేల కోట్లు**
> **యజ్ఞఫలాన్ని పొంది**
> **స్వర్గద్వారం వద్ద**
> **వేచి ఉన్నాడు**
>
> – ఎ. సూర్యప్రకాశ్, నిజామాబాద్

ఇప్పుడే ఇలా గుడ్లు తేలేస్తే ఎట్లా? లాభం లేదు. ఏదైనా వేరే మార్గం చూడాలి.

రాజా మనసులో ఓ ఆలోచన రూపుది ద్దుకుంది. రాజాకి ఒక మంచి ఫ్రెండ్ వున్నాడు. రామకృష్ణ మస్కట్‌లో పనిచే స్తున్నాడు. చిన్న ఉద్యోగంలోనే జేరినా తర్వాత బాగా పైకొచ్చాడు. యజమాని దగ్గర మంచి పేరూ సంపాదించుకు న్నాడు. "నువ్వూ వచ్చెయ్ రాజా! ఇక్కడ మంచి జాబ్ ఇప్పిస్తా. లక్షణంగా లక్షలు సంపాదించుకోవచ్చు" అంటూంటాడు.

దివ్య చదువూ ఉద్యోగం గుర్తుకొచ్చి

వున్న ఒక్క బిడ్డనీ హాస్టల్లో వుంచి అక్కడికి వెళ్ళి సంపాదించాల్సినంత అవసరం అనిపించలేదు. ఇప్పుడు దివ్య పెళ్ళి కుదిరింది. వెళ్ళినా ఫర్వాలేదు. నాలుగు డబ్బులు సంపాదించుకోవచ్చు. ఆ ఆలోచన రాగానే వెంటనే లేచి కంప్యూటర్ ఆన్ చేసి, రామకృష్ణకి మెయిల్ ఇచ్చాడు.

తెల్లారేసరికి అతను ఫోన్ చేశాడు. రాజా ఆలోచన విని చాలా సంతోషించాడు. "పోన్లే ఇన్నాల్టికి మంచి నిర్ణయం తీసుకున్నావు. మళ్ళీ పెళ్ళయ్యే దాకా ఆగడం ఎందుకు? వెంటనే నీ రెజ్యూమ్ నాకు పంపించు. ఇదేం మల్టీనేషనల్ కంపెనీ కాదు కదా! మంచి కంపెనీ, పే స్కేల్స్ బావుంటాయి. లిమిటెడ్ స్టాఫ్. నేను మా బాస్‌కి చెప్తాను. నా మాట ఆయన కాదనడు. ఊరికే ఫార్మల్‌గా టెలీఫోన్‌లో ఇంటర్వ్యూ తీసుకుంటారు" అన్నాడు.

వెంటనే రెజ్యూమ్ తయారుచేసి పంపించేశాడు రాజా. వారం రోజులు గడిచాయి. టెలిఫోన్ ఇంటర్వ్యూ తీసుకున్నాడు. వెంటనే 'సరే, ఉద్యోగం ఇస్తాం' అన్నారు. వివరాలు మెయిల్ పంపించారు. మంచి జీతం. ఇతర సదుపాయాలు కూడా బావున్నాయి. ఆరు నెలల దాకా బేచులర్ ఎకామిడేషన్ ఇస్తామని, తర్వాత ఫ్యామిలీని తీసుకొచ్చుకోవచ్చనీ చెప్పారు. అదీ బాగానే వుందనిపించింది రాజాకి. దివ్య పెళ్లయ్యేసరికి ఎలాగూ ఆరేడు నెలలవుతుంది.

తను వెంటనే వెళ్ళి జాబ్‌లో జాయిన్ అయితే డబ్బు బాగా కూడబెట్టొచ్చు. పెళ్ళి చేసి దివ్యని అటు పంపించి, శాంతని తీసుకు వెళ్ళొచ్చు. ఒక నిర్ణయానికి వచ్చాక భార్యా పిల్లలకి చెప్పాడు. దివ్యకి సంతోషం, విచారం ఏకకాలంలో కలిగాయి. ఈ విషయంలో అడుగడుగునా తండ్రికి సలహాలిస్తూనే వచ్చింది. కానీ చివరికి అంతా అనుకున్నట్లు జరిగేసరికి మనసు చివుక్కుమంది.

"నన్నొంటరిగా వదిలేసి నువ్వూ అమ్మా వెళ్ళిపోతారా నాన్నా?" అంది.

"పిచ్చిపిల్లా ఒంటరిగా వదలడం ఏమిటమ్మా! నీపెళ్ళి చేశాకే వెళ్తాం. ఒకసారి పెళ్ళై కాపురానికి వెళ్ళాక నువ్వే మర్చిపోతావు మమ్మల్ని. రెండు రోజులు రావే తల్లీ అంటే, అమ్మా మా ఆయనకి ఇబ్బంది అవుతుందంటావ్!" అన్నాడు రాజా.

శాంత బిక్కమొహం వేసింది. పెళ్ళయ్యాక పట్టుమని పదిరోజులు కూడా భర్తని వదిలి ఉండలేదు. అప్పటికీ వూరుకున్నా ఆ రాత్రి భర్తను కావలించుకుని ఏడ్చేసింది. ఓదార్చాడు రాజా. "మన భవిష్యత్తుకోసం ఈ మాత్రం కష్టపడాలి మరి. ఆర్నెల్లేగా.. ఎంత ఇట్టే గడిచిపోతాయి. రోజూ ఫోన్ చేస్తూనేవుంటాను. వెబ్‌కామ్‌లో మాట్లాడుకుంటూనేవుందాం. నువ్వు కాలక్షేపంకోసం ఏదైనా ఎంబ్రాయిడరీ మొదలుపెట్టు" అన్నాడు.

దివ్య ఈ వార్త శ్రీరామ్‌తో చెప్పింది. చాలా సంతోషించాడతను. 'దివ్యా! మీ నాన్నగారు చాలా డైనమిక్. నిజానికి అలా వేరేవేరే దేశాలకు వెళ్ళి జాబ్ చెయ్యాలని కోరిక నాకు. ఈ బిజినెస్‌లో సెటిలైపోయాను. రేపు నేను కంగ్రాట్స్ చెప్తా అంకుల్‌కి" అన్నాడు.

రాజా మర్నాడు ఆఫీస్‌కి వెళ్ళినప్పుడు చాలా మొహమాటపడుతూ ఈ విషయం బాస్‌కి చెప్పాడు. ఆయన షాక్ తిన్నాడు.

"అదేవిటి రాజా! ఇంత సడన్‌గా ఏవిటిది?" అన్నాడు బాస్. "పోనీ.. నేనే శాలరీ పెంచుతాను" అన్నాడు బాస్.

"కాదుసార్, పిల్ల పెళ్ళి కుదిరింది. అటు వైపువాళ్ళు శ్రీమంతులు. నేను ఆర్థికంగా ఎదగాలి" అంటూ అంతా చెప్పుకొచ్చాడు.

అతను పనిచేసేది ప్రైవేట్ కంపెనీలో.

బాస్ స్వంతంగా స్థాపించి వృద్ధిలోకి తెచ్చాడు. ఆ కంపెనీ మొదలుపెట్టిన నాటి నుంచీ అక్కడే వున్నాడు రాజా. బాస్‌కి అతనంటే చాలా ఇష్టం. రాజా ఉద్యోగం వదిలేస్తాడని కలలోకూడా ఊహించలేదు అతను. ఇంకెవరినీ తయారు చెయ్యలేదు. హఠాత్తుగా రాజా వెళ్ళడం అతను జీర్ణించుకోలేకపోయాడు. పోనీ మరో ఏడాది వుండి వెళ్ళమన్నాడు. మళ్ళీ తన నిస్సహాయతను తెలియజేశాడు రాజా.

"సరే, మీ ఇష్టం! రెజిగ్నేషన్ ఇచ్చెయ్యండి" అన్నాడు బాస్.

అతని మనసంతా చేదైపోయింది.

రాజాకి కూడా చాలా బాధగానేవుంది. బాస్ ప్రవర్తన అతన్ని మనోవేదనకు గురిచేస్తోంది. అప్పటిదాకా 'రాజా రాజా' అని అప్యాయంగా పిలిచే బాస్, ఒకేసారి 'మీరిలా రండి!', 'అలా దయచెయ్యండి' అంటూంటే చెవుల్లో సీసం పోసినట్లు ఉంది. నమ్మకంగా పనిచేసిన చోటునుంచే వేరోచోటికి మారేటప్పుడు పడే బాధ వర్ణనాతీతం. అనుభవించిన వారికే తెలుస్తుందా నరకయాతన! పగలంతా పంచాగ్ని మధ్యలో వున్నట్లుగా వుంది రాజాకి. రిజిగ్నేషన్ లెటర్ ఇచ్చేశాడు. 'అదేమిటి? ఏమైంది?' అంటూ అడిగే అందరికీ సమాధానాలు చెప్పలేక విసిగిపోయాడు. బరువెక్కిన మనసుతో ఇంటికొచ్చి రామకృష్ణకి ఫోన్ చేశాడు.

అంతా విని నవ్వేశాడు తను. "జీవితంలో ఇవన్నీ సహజమే రాజా! మరి మనిషి మనస్తత్వం అంతేకదా! ఇంతకాలం వున్న ఉద్యోగం వదులుతుంటే మరి బాధ కలగదా! నీ భవిష్యత్తుకోసం మంచి నిర్ణయం తీసుకున్నావు. అసలీపని ఎప్పుడో చెయ్యాల్సింది. పోన్లే ఇప్పటికైనా జరిగింది. ఇక చూసుకో నీ భవిష్యత్తు ఎంత బావుంటుందో! నేనిక్కడికొచ్చి పడే


## జనవరి సంచిక మార్కెట్లో ఉంది..

- కథకుల ఫైల్ లో
  కీ.శే. మల్లాది రామకృష్ణ శాస్త్రి కథ
  **దు-ము-వు-లు**
- నోబెల్ గ్రహీత గాబ్రియెల్ గార్సియా మార్థెజ్ లాటిన్ అమెరికా కథ
  **వెలుగువాగు**
- జ్ఞానపీఠ గ్రహీత కువెంపు కన్నడ కథ
  **ప్రయాణం**
- బెంగాలీ రచయిత శరత్‌చంద్ర
  **లాలూ** వంటి మొత్తం పద్దెనిమిది కథల సమాహారం.. ఇంకా..
- ఇండియన్ ఐడల్ ఎమ్.శ్రీరామచంద్ర, హైదరాబాద్ మేయర్ కార్తీకరెడ్డి పరామర్శ



## అందుకే...



**గాంధీజీ** కదులుతున్న రైలు పెట్టె ద్వారం వద్దన నిలబడినప్పుడు ఆయన చెప్పులలో ఒకటి పడిపోయింది. ఆయన ఆలస్యం చేయకుండా వెంటనే రెండో చెప్పునూ తోసి వేశాడు. అది చూసిన ఓ ప్రయాణికుడు విస్తుపోయి, ఎందుకలా చేశారని అడిగాడు.

దానికి గాంధీజీ, 'ఆ రైలుమార్గంపై ఓ చెప్పు దొరికిన వ్యక్తి, ఈ రెండో చెప్పును కూడా ఉపయోగించుకోవచ్చు కదా?' అన్నారు.

ళ్ళుపైనే అయింది. హైదరాబాద్‌లో డీలక్స్ త్రీబెడ్‌రూమ్ ఫ్లాట్ కొన్నాను. గేటెడ్ కమ్యూనిటీలో ఊరికి కొంచెం దూరంలో డ్యూప్లెక్స్ ఇల్లు కొన్నాను. మా ఆవిడకి బోలెడంత బంగారం కొన్నాను. ఇద్దరూ కొడుకులేగా నాకు. వాళ్ళనీ బాగా చదివించాను. ఇంకో అయిదారేళ్లుండి ఇండియా వచ్చి దర్జాగా బతుకుతాను.

నువ్వూ అలాగే చేద్దువుగాని. అమ్మాయి పెళ్ళి దర్జాగా చేసి, మంచి ఇల్లు కట్టుకుని సెటిల్ అయిపోతావు. చూస్తుండు. ఇక్కడ మావాళ్ళతో చెప్పాను. వాళ్ళంతా నీకోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు. అతనితో కాసేపు మాట్లాడేసరికి రాజాకి దిగులు తీరిపోయి ఉత్సాహం కలిగింది.

ఆ రాత్రి శ్రీధర్ ఫోన్ చేశాడు. "ఏమిటి బావగారూ! మస్కట్ వెళ్తున్నారుట.. కంగ్రాట్స్! రేపు ఆదివారమేగా.. లంచ్‌కి రండి!" ఆహ్వానించాడు.

మర్నాడు వెళ్ళారు ముగ్గురూ. అందరూ అభినందించారు. "అసలు మామయ్యగారు సినిమాల్లోకి వెళ్ళాల్సింది. హీరో అయిపోయేవారు. అప్పుడీ ఉద్యోగాలవీ చేసే అవసరం ఉండేదికాదు" అన్నాడు శ్రీకాంత్.

"అన్నయ్యగారూ అక్కడ బంగారం చాలా బావుంటుంది. మీరెలాగో అక్కడే వుంటారు కాబట్టి పిల్లల పెళ్ళిళ్ళకి నేనక్కడికే వచ్చి షాపింగ్ చేస్తా" అంది సువర్ణ.

సరదాగా కాలక్షేపం చేసేసి ఇంటికొచ్చారు. రాజా చాలా తృప్తిగా సంతోషంగా నిద్రపోయాడు. సువర్ణకి కూడా కాస్త మనశ్శాంతిగానే వుంది. కాస్త వాళ్ళ హోదా పెరిగితే గుడ్డిలో మెల్లలాగా వుంటుంది. అప్పుడీ పెళ్ళి తప్పిపోకపోయినా ఓకే అనుకుంది.

మర్నాడు మామూలుగా ఆఫీసుకి వెళ్ళాడు రాజా. అతని రాజీనామా అంగీకరించారు. కాకపోతే ఒకవారం రోజులు వచ్చి మిగిలిన పనులన్నీ పూర్తిచేసి మరీ వెళ్ళమన్నారు. అతని డబ్బుకూడా నిదానంగా సెటిల్ చేస్తామని, ఓ నెలైనా పడుతుందని అన్నారు. అన్నింటికీ సరేనన్నాడు రాజా.

ఆ మధ్యాహ్నానికల్లా రాజా పరిస్థితి దయనీయంగా తయారైంది. ఒక మనిషి అనుగ్రహమైనా ఆగ్రహమైనా ఎలా ప్రకటిస్తాడో తెలిసిపోయింది. నిన్నమొన్నటిదాకా ఒక గాడ్‌ఫాదర్‌లా వున్న బాస్ విలన్‌గా మారిపోయాడు. నువ్వు చేసినవన్నీ తప్పులే అని ఎత్తిచూపుతున్నాడు. నీవల్ల కంపెనీకి చాలా నష్టం వచ్చిందంటున్నాడు. అర్థాంతరంగా నట్టేట్లో ముంచిపోతున్నావన్నాడు. ఒక మాట కాదు, ఒక గొడవ కాదు. ములుకుల్లాంటి మాటలతో పొడిచేస్తున్నాడు. నవ్వుతూనే నరకం చూపిస్తున్నాడు. కాలరు పుచ్చుకుని నలుగురిలో పెట్టి మాట్లాడితే అదో తీరు. కానీ

ఒంటరిగా పట్టుకుని మెల్లిగా దెప్పుతూ వుంటే తట్టుకోవటం సామాన్యం కాదు. నాలుగు గంటలదాకా అక్కడే గడిపి, 'ఇక నేను వెళ్తా. మళ్ళీ రేపు వచ్చి మిగిలిన పని పూర్తి చేస్తా' అని చెప్పి బయట పడ్డాడు.

బైక్ ఎక్కి కొంతదూరం వెళ్ళేసరికి ఏదో అలజడి. చిరాకు. పక్కనేవున్న హోటల్ ముందు ఆగి లోపలికెళ్ళి కాఫీ ఆర్డర్ ఇచ్చాడు. ఛాతిలో సన్నగా నెప్పి. ఏదో తేడాగా వుందని అర్థమైపోయిందతనికి. వెంటనే దివ్యకి ఫోన్ చేశాడు.

"నాన్నా నేనొస్తున్నాను. మీరక్కడే వుండండి. లేకపోతే ఆ పక్కనే లతా హాస్పిటల్ వుంది కదా! అక్కడికి వెళ్ళి ఒక్కసారి బీపీ చూపించుకోగలిగితే మరీ మంచిది" చెప్పింది.

వెంటనే సత్యతో చెప్పింది, "నేను అర్జెంటుగా వెళ్ళాలి" అని.

"పద, నేనూ వస్తున్నా" అన్నాడతను.

ఓ కొలిగ్‌నడిగి కారు తీసుకున్నాడు. కార్లో బయలుదేరారు.

తెప్పించుకున్న కాఫీ కూడా తాగలేకపోయాడు రాజా. వెంటనే లేచి దివ్య చెప్పిన హాస్పిటల్‌కి వెళ్ళాడు. ఆ విషయమే కూతురికి ఫోన్ చేసి చెప్పాడు.

"అక్కడికే వస్తాను నాన్నా. బయలుదేరాను! దారిలో వున్నా" అంది దివ్య.

అక్కడే వున్నాడు రాజా. బాగానే వున్నాడు. మందులు ఇచ్చారు. ఆ అలజడీ తగ్గింది. కూతుర్ని నవ్వుతూ పలకరించాడు. "అనవసరంగా నిన్ను కంగారు పెట్టేశాను" అన్నాడు.

డాక్టర్‌తో మాట్లాడారు. "ఇ.సి.జి.లో కొద్దిగా తేడా కనిపిస్తోంది. బి.పి. నార్మల్‌గానే వుంది. ప్రస్తుతానికి మందులిచ్చాను. ఏదైనా మంచి హాస్పిటల్లో ఈ టెస్ట్‌లు చేయించండి" అన్నాడు.

"కంగారేం లేదుకదా డాక్టర్!" అంది దివ్య.

"ఏం లేదు. టెస్ట్‌లు చేయిస్తే మంచిది కదా! ఏదైనా ప్రోబ్లమ్ వుంటే ట్రీట్‌మెంట్ తీసుకోవచ్చు" అన్నాడాయన.

అక్కడ ఫీజ్ చెల్లించి బయటపడ్డారు. "నేను బానే వున్నాను. బైక్‌మీద వస్తాను" అన్నాడు రాజా! "వద్దంకుల్. మీరూ, దివ్య కార్లో వెళ్ళండి. నేను బైక్ తీసుకొస్తా" అన్నాడు సత్య. దివ్యకి కారు డ్రైవింగ్ వచ్చు.

తండ్రికి ఒంట్లో బాగాలేదని టెన్షన్ పడింది. పరాయివాళ్ళ కారు కాబట్టి రోడ్డు మీద ఎడమవైపున మెల్లిగా నడుపుతోంది.

"దివ్యా! అమ్మకిదంతా చెప్పొద్దు. వూరికే కంగారు పడుతుంది" అన్నాడు.

"నేనూ ఆ మాటే చెప్పాలనుకున్నాను నాన్నా! ఏం చెప్పొద్దు. మరి అలాగని మీరు అశ్రద్ధ చేయొద్దు. ఆ టెస్ట్‌లు వెంటనే చేయిద్దాం. నేను రేపు సెలవు పెడతా. మీరూ పెట్టండి. ఆఫీసుకి వెళ్ళినట్లే బయలుదేరుదాం" అంది.

కార్లో వచ్చిన వాళ్ళిద్దరినీ చూసి వాకిట్లో ఉన్న శాంత తెల్లబోయింది. 'ఎవరిదీ కారు?' అంటూ లక్ష ప్రశ్నలు వేసింది. సత్య కూడా వచ్చేశాడు. అందరూ కలిసి గాడికట్టినట్లు ఏదో చెప్పేశారు.

"కార్లోంచి దిగుతుంటే ఎంత దర్జాగా ఉంది! నా మాట విని మీరు వెంటనే కారు కొనేయ్యండి" అంది శాంత.

"అలాగే! దానికేం భాగ్యం, కొనేద్దాం" అన్నాడు రాజా.

రాత్రి భోజనాల దగ్గర కూడా కారు ప్రసక్తి తీసుకొచ్చింది శాంత.

"ఇప్పుడెందుకు? మనం వెళ్ళిపోతాం కదా! వచ్చాక కొందాం" అన్నాడు రాజా.

"ఏం వెళ్తే? మనం వెళ్తే దివ్య వాడుకుంటుంది" అంది శాంత.

"దివ్యకి ఈ కారెందుకు? వాళ్ళకు

బోలెడున్నాయి కార్లు" అనేశాడు రాజా.

"నీ కోసం సాంత్రో బుక్ చేశా. అదైతే నీకు ఈజీగా ఉంటుంది డ్రైవింగ్" కిందటి వారం శ్రీరామ్ చెప్పిన విషయం గుర్తొచ్చి నవ్వుకుంది దివ్య.

తల్లి వినకుండా "నాన్నా! మనం రేపో సారి డాక్టర్ దగ్గరికి వెళ్దాం" అంది. అతను, 'చూద్దాంలే' అన్నాడు. దాంతో 'ఇలా అయితే అమ్మకు చెప్పేస్తా' అని బెదిరించింది.

మర్నాడు తండ్రీ కూతురూ వెళ్ళారు టెస్ట్‌ల కోసం. రోజంతా పట్టింది టెస్ట్‌కి. మర్నాడు రిపోర్టులు వచ్చాయి. 'మీరు వెంటనే డాక్టర్‌ని కలవాలి' అన్నారు రిపోర్టులు ఇస్తూ. ఇద్దరూ కంగారు పడ్డారు. దివ్యకీ, రాజాకీ కూడా చాలా ఇంపార్టెంటు పనుంది ఆఫీస్‌లో. అదీగాక డాక్టర్ అపాయింట్‌మెంట్ కూడా తీసుకోవాలి. అందుకే ఇద్దరూ ఎవరి ఆఫీసుకి వాళ్ళు వెళ్ళిపోయారు.

లంచ్ టైమ్‌లో సత్య అడిగాడు రిపోర్టులు వచ్చాయా అని. చెప్పింది దివ్య. దిగులుగా ఉన్న దివ్యకి ధైర్యం చెప్పాడు సత్య. "మా కజిన్‌కి మంచి డాక్టర్ తెలుసు. ఆయన ఫేమస్ కార్డియాలజిస్ట్. ఆయన దగ్గర అపాయింట్‌మెంట్ తీసుకోమంటాను" అనేసి వెంటనే ఆ కజిన్‌కి ఫోన్ చేశాడు. అతను కనుక్కుని చెప్తానన్నాడు. సాయంత్రం నాలుగింటికి ఫోన్ చేసి "రేపు పొద్దున పన్నెండుకి దొరికింది అపాయింట్‌మెంట్" అని చెప్పాడు. రాజాకీ ఆ విషయం చెప్పారు.

దివ్య బాస్‌కి చెప్పి సెలవు పెట్టింది. సత్య కూడా సెలవు కావాలన్నాడు. కాకపోతే పొద్దున్నే ఆఫీసుకొచ్చి, అక్కడినించి హాస్పిటల్‌కి వెళ్ళొచ్చాక మళ్లీ ఆఫీసుకొస్తానని చెప్పాడు.

"దివ్యా! రేపే మీ ఇంటికొచ్చేస్తా! అక్కడినించీ కలిసి వెళ్దాం" అన్నాడు. 'ఎందుకులే సత్యా? హాస్పిటల్‌కి వచ్చెయ్' అన్నా వినలేదతడు.

దివ్య కాస్త దిగులుగానే ఇంటికి చేరింది. కూతురిని చూడగానే "ఏమ్మా అలా ఉన్నావేం? " అంది శాంత.

"ఏంలేదమ్మా, కాస్త తలనెప్పిగా ఉంది" అంది దివ్య.

"ఆ జుట్టుకి నూనె రాసుకోవు. ఎండలో స్కూటర్ మీద తిరుగుడు. తలనెప్పి రాదా మరి" అంటూ లోపలికి వెళ్ళి కాఫీతోపాటు తలనూనె కూడా తీసుకొచ్చి తలకి నూనె పెట్టి మర్దన చేసింది.

అంతలోనే వచ్చాడు రాజా! అతనూ ఏదోలా ఉన్నాడు. "అదేవిటి మీరూ అలాగే ఉన్నారు. మీకూ తలనొప్పా? " అంది శాంత.

"అవును" అన్నాడు రాజా. "బావున్నారు తండ్రీకూతుళ్ళు" అంటూ లోపలికెళ్లి కాఫీ తెచ్చి అతనికి ఇచ్చి, మామూలుగా అలవాటు ప్రకారం లంచ్ బాక్స్ తీసికెళ్ళడానికి అతని బ్యాగ్ తీసింది. ఎదురుగా ఒక పెద్ద కవరు. దానిమీద ఫేమస్ డయాగ్నస్టిక్ సెంటర్ పేరు. కవరుమీద పేషెంట్ పేరు రాజా. శాంత గుండె గుభేలుమంది.

"ఏవండీ! దివ్యా ఏమిటిది? " అరిచేసింది.

ఇద్దరూ ఉలిక్కిపడి చూశారు. క్షణంలో విషయం అర్థమయింది ఇద్దరికీ.

"ఏవండీ! ఏమిటీ టెస్ట్‌లు? ఎందుకు? మీకేమైంది? " వణికిపోతోంది శాంత.

"ఏవిటా కంగారు? " కసిరాడు రాజా.

"ప్రతీదానికీ ఇలా కంగారుపడితే ఎలా శాంతా? డాక్టర్ టెస్ట్‌లు చేయించుకోమన్నాడు, అంతే" మందలించాడు.

"ఎందుకిన్ని టెస్ట్‌లు? " ఇంకా కంగారు పెరిగింది.

"నాన్న మస్కట్ వెళ్ళాలి కదమ్మా! అందుకు ఈ టెస్టులన్నీ చేయించుకోవాల్ట" అంది దివ్య. రాజా మెచ్చుకోలుగా చూశాడు.

"అంతేనా? " అడిగింది శాంత.

"అంతే!" చెప్పాడు రాజా. "రేప్పొద్దున డాక్టర్ దగ్గరికి వెళ్ళాలి. మళ్ళీ అప్పుడు కంగారుపడి మమ్మల్ని కంగారు పెట్టకు" అని ముందే చెప్పేశాడు.

అతనేం కంగారు పడొద్దని చెప్పినా శాంతకి మాత్రం కంగారు తగ్గలేదు. చపాతీలు మాడ్చేసింది. మజ్జిగలో ఉప్పు వెయ్యటం మర్చిపోయింది. హార్లిక్స్‌లో రెండుసార్లు పంచదార వేసేసింది.

ఆ రాత్రి శ్రీరామ్ మామూలుగా ఫోన్ చేశాడు. విషయం చెప్పింది దివ్య. "అలాగా. ఏం ఫర్వాలేదులే. ఈ రోజుల్లో ఇవన్నీ కామన్" అనేశాడు శ్రీరామ్. తర్వాత మామూలుగానే కబుర్లు చెప్పాడు.

మర్నాడు తెల్లారకుండానే లేచి దేవుడి పూజ ముగించేసింది శాంత. పదకొండింటికి సత్య వచ్చాడు. టాక్సీ పిలిపించి హాస్పిటల్‌కి బయలుదేరారు.

"వెళ్ళగానే ఫోన్ చేయ్. రిపోర్టులు చూసి డాక్టరేమన్నారో ఫోన్ చేయ్" చెప్పింది శాంత కూతురితో.

చిరాకూ, జాలీ కలిగాయి రాజాకి. 'ఎంత కంగారు ఈ శాల్తీకి. మందు వేసుకోవాలంటే భయం. ఇంజక్షన్ అంటే ఆమడ దూరం పరుగు. వయసు వస్తుందేగానీ బొత్తిగా పసిపిల్లతత్వం' అనుకున్నాడు.

హాస్పిటల్‌కి వెళ్ళారు. చాలా పెద్ద హాస్పిటల్. అన్ని హంగులతో హడావిడి. పన్నెండు గంటలకే లోపలికి పిలిచారు. డాక్టర్ చాలా స్నేహపూర్వకంగా పలకరించాడు. ఆదరంగా మాట్లాడాడు. రిపోర్టులు చూశాడు.

"మీరు ఏంజియోగ్రామ్ తీయించుకోవాలి. ఆ తర్వాత రిపోర్ట్ బట్టి ట్రీట్‌మెంట్ చేస్తాం" అన్నాడు. ఆ మాట వినే సరికి కంగారు పడ్డారు దివ్య, రాజా.

"ఏంజియోనా? ఎందుకు డాక్టర్? నాకే ప్రాబ్లమ్ లేదు. నేను ఆరోగ్యంగా ఉన్నా" అన్నాడు.

"అవును డాక్టర్. మా నాన్నగారు చాలా హెల్దీపర్సన్. ఆయనకెప్పుడూ తలనెప్పి కూడా రాదు" అంది దివ్య.

ఆ డాక్టరుకి నవ్వూ విసుగూ ముంచుకొచ్చాయి. అందరూ ఇంతే. నీకు ప్రాబ్లమ్ ఉంది నాయనా అనగానే మాకేంలేదని డాక్టర్ని నమ్మించాలని శాయశక్తులా ప్రయత్నం చేస్తారు. అవన్నీ ఆ డాక్టరుగారికి అలవాటే. ఆయన చాలా బిజీగా ఉంటాడు. ఏదో తెలిసిన వాళ్ళంటే సర్దుకుని వీలు కల్పించుకుని అప్పాయింట్‌మెంట్ ఇచ్చాడు. చూశాడు. చెప్పాడు. అంతేగానీ వాళ్ళతో గంటల తరబడి చర్చించే తీరికగానీ ఓపికగానీ లేవాయనకి. అందుకే చిన్నగా నవ్వేసి "మీ రిపోర్ట్స్ చూసి చెప్పాను. కావాలంటే మీరింకెవరినైనా అడగండి- సెకండ్ ఒపీనియన్ తీసుకోడం మంచిదే" అనేసి బెల్ నొక్కి తర్వాతి పేషెంటుని పంపించమన్నాడు.

ఇద్దరూ దిగులుగానే బయటికొచ్చేశారు.

వాళ్ళిద్దర్నీ చూసిన సత్యాకి వాళ్ళ బాధ అర్థమయింది. "పదండి, ముందు కాస్త కాఫీ తాగుదాం" అంటూ కేంటీన్‌కి దారితీశాడు.

పేరుకి హాస్పిటల్ కేంటినేగానీ హైక్లాస్ రెస్టారెంటుని తలపిస్తోంది. ఖాళీగా ఉన్న టేబిల్ ముందు వాళ్ళని కూర్చోమని తనెళ్ళి కాఫీలు తీసుకొచ్చాడు.

మెల్లిగా ఆ షాక్‌నించీ బయటపడ్డారు తండ్రీ కూతుళ్ళు.

"ఏం చేద్దాం" అనుకున్నారు. "ఈయన చాలా ఫేమస్ డాక్టరే. ఈ ఫీల్డ్‌కి ఎక్స్

పర్ట్. మనకేమైనా అనుమానముంటే మరో డాక్టర్ వద్దకు వెళ్ళచ్చు. కాకపోతే అదంతా అనవసరమని నా ఐడియా" అన్నాడు సత్య.

"మరి ఇక్కడే చేయించుకుందామా!" అంది దివ్య.

ఇంటికెళ్ళి నిదానంగా ఆలోచిద్దామనుకున్నారు. ఇంటికి బయలుదేరారు. దార్లో సత్యకి ఒక ఆలోచన వచ్చింది. "అంకుల్! మనం ఓపని చేద్దామా! నా ఫ్రెండ్ వాళ్ళ నాన్నగారూ డాక్టరే. రైల్వేస్‌లో కార్డియాలజీ సర్జన్‌గా పనిచేసి ఈ మధ్యనే రిటైర్ అయ్యారు. సాయంత్రంపూట ఒక క్లినిక్‌కి వెళ్తారు. ఇప్పుడాయన ఇంట్లోనే ఉంటారు. ఇల్లిక్కడే. వెళ్ళి ఆయన్తో మాట్లాడదామా!" అన్నాడు.

"అవును సత్యా! వేరేవాళ్ళని కనుక్కుంటే మనకీ తృప్తిగా ఉంటుంది, వెళ్దాం" అన్నాడు రాజా.

"ఇప్పుడు లంచ్‌టైం కదా! ఆయన్ని డిస్టర్బ్ చేస్తే బావుంటుందా? పోనీ సాయంత్రం క్లినిక్‌కి వెళ్దామా!" అంది దివ్య.

"ఏం ఫర్వాలేదు. ఇక్కడే వాళ్ళిల్లు. వెళ్దాం" అన్నాడు. కారు డ్రైవర్‌కి చెప్పి వాళ్ళింటికి దారి మళ్ళించాడు. ఆయనింట్లోనే ఉన్నారు. చాలా ఆప్యాయంగా ఆహ్వానించారు. సత్య విషయం చెప్పగానే 'అలాగా? ఏవీ రిపోర్ట్సు?' అని అడిగి చూశాడు.

"ఏంజియోగ్రామ్ చెయ్యాలి. ఆ టెస్ట్ మంచి హాస్పిటల్‌లోనే చేయించాలి. మీరు ఈ డాక్టర్‌గారి దగ్గరే చేయించండి. ఆయన మంచి ఎక్స్‌పర్ట్" అని వెంటనే చెప్పేశాడు. ఆయనకు థాంక్స్ చెప్పి అక్కడినించి బయలుదేరారు. ఇంటికొచ్చేసరికి మూడవుతోంది. వాకిట్లోకి, ఇంట్లోకీ కాలు గాలిన పిల్లిలా పచార్లు చేస్తోంది శాంత. కారాగ్గానే "ఏమీటే? ఎక్కడికి పోయారు? ఎన్నిసార్లు ఫోన్ చేశాను?" అంటూ విసుక్కుంది.

"చెప్తాంలే, ముందు లోపలికి రానిస్తావా?" అంది దివ్య కూడా విసుగ్గా.

టాక్సీకి డబ్బిచ్చి పంపించి లోపలికొచ్చాడు రాజా. సత్య వెళ్తానని బయలుదేరితే, 'ఉండు, భోజనం చేసి వెళ్ళచ్చు' అని ఆపేసింది దివ్య.

"ఇప్పటికే బోలెడంత ఆలస్యమయింది" అంటూ వడ్డించింది శాంత.

"ఏమన్నాడు డాక్టరు?" హఠాత్తుగా అడిగింది.

"ఏంజియోగ్రామ్ చేయించాలి" చెప్పింది దివ్య. చేతిలో ముద్ద జారిపోయింది.

"అంటే. ఆ మధ్య మా బాబాయికి గుండె పోటొస్తే చేయించారు. అదేనా!" అడిగింది శాంత.

"అవును" అన్నాడు రాజా.

"ఆ పరీక్ష మీకెందుకండీ! మీరు నిక్షేపంలా ఉంటేనూ. విదేశాలకు వెళ్తేమాత్రం ఆ టెస్ట్‌లన్నీ చేయించుకోమనడం అన్యాయం కాదూ!" అంది అసహనంగా.

"కాదుట. నాన్నకి ఏదో ప్రాబ్లమ్ ఉందిట" చెప్పింది దివ్య మెల్లిగా.

శాంత నిర్ఘాంతపోయింది. కంచం ముందునించీ లేచి చెయ్యి కడుక్కుని

---

**కొత్తగాలి...**

**పురుగు చంపింది**
**పంటను...**
**రైతునూ...**

– పి.సునీల్,
పెద్దకొట్టాల, నంద్యాల

---

సోఫాలో కూచుంది తలపట్టుకుని. కళ్ళ వెంట నీళ్ళు కారిపోతున్నాయి.

రాజాకి భార్యని చూసి విసుగేసింది. కాస్త అటూ ఇటూ అయితే చాలు ఇదే గొడవ. ఆనందం వచ్చినా పట్టలేం, విచారం వచ్చినా పట్టలేం. మామూలుగా అయితే బుజ్జగించి నచ్చచెప్పి నానా తంటాలూ పడేవాడు. కానీ ప్రస్తుతం అతనికే చిరాగ్గా ఉంది. అనుకోని పరిస్థితి ఇది. దాంతో తలపట్టుకుని ఏడుస్తూ కూర్చున్న భార్యని చూసి తిక్కరేగింది.

"మొదలెట్టావా ఏడుపు? ఇపుడేమైందని ఏడుస్తున్నావ్? నన్ను టెస్ట్ చేయించుకోమన్నారు. అంతేగానీ ఓ నెల్రోజుల్లో చస్తానని చెప్పలేదు" అన్నాడు.

"అయ్యో ఏం మాటలండీ అవి!" అంది.

"మరేం చెయ్యమంటావ్? ఏదైనా సమస్య వస్తే ధైర్యంగా ఉండి ఎలా సాల్వ్ చేసుకోవాలో చెప్తే అదోరకం. ఊరికే ముందే శోకాలు పెట్టేసి పక్కవాళ్ళకూ తినకుండా చేసేస్తావ్. కొందరు ఆడవాళ్ళను చూస్తే ముచ్చటేస్తుంది. మగవాడు ఉద్యోగం చేసుకుంటే చాలు. ఇంటి గొడవలన్నీ ఇల్లాలే సమర్థించుకుంటుంది. నువ్వు ఉన్నావు ఎందుకూ? " ఎప్పుడూ లేనిది కాస్త గట్టిగానే విసుక్కున్నాడు. దాంతో మరింతగా ఏడ్చింది శాంత.

దివ్య కల్పించుకుని ఇద్దరికీ నచ్చచెప్పింది. అందరూ ఏదో మొక్కుబడిగా భోజనాలు ముగించి లేచారు. జరగాల్సింది ఏమిటో సీరియస్‌గా చర్చించారు.

"వీలైనంత త్వరగా ఏంజియో చేయించేద్దాం" అన్నాడు సత్య.

ఇంకెక్కడో ఎందుకు? ఆ హాస్పిటల్ లోనే చేయించేద్దామనుకున్నారు.

"మా కజిన్ ద్వారా ఆ డాక్టర్‌గార్ని రిక్వెస్ట్ చేస్తే బిల్‌లో కాస్త కన్సెషన్ ఇస్తారు" అన్నాడు సత్య.

శాంతకి చాలా భయం వేస్తుంది. ఏడిస్తే భర్త తిడతాడేమోనని భయం. అందుకే దేవుళ్లకి దణ్ణం పెట్టుకుంటూ కూర్చుంది.

అప్పుడే ఫోన్ వచ్చింది. విమల ఫోన్ చేసింది. "ముందుగా మీకు కంగ్రాట్స్. మీ వారు మస్కట్ వెళ్తున్నారటగా! మాకు పార్టీ ఇవ్వాలి" అంది.

ఆ తర్వాత "మంచి చీరలున్నాయి. తెమ్మంటారా? " అంది.

శాంత పరిస్థితి వర్ణనాతీతం. అసలే మతిపోయి ఏడుస్తుంటే ఇదో గోల అనుకుని ఓపిగ్గానే సమాధానం చెప్పింది. 'ఇదీ విషయం. మేము ఆ హడావిడిలో ఉన్నాం' అని చేప్పేసింది.

మరో గంట గడవకుండానే సువర్ణ ఫోన్ చేసింది. "ఏవిటీ వదినగారూ! అన్నయ్యగారికి ఏమైంది? " ఆదుర్దా పడింది. శాంత సమాధానం చెప్పింది.

"అలాగా! మీ వంశంలో ఎవరికైనా హార్ట్ ప్రాబ్లం ఉండేదా! ఇలాంటివన్నీ వంశపారంపర్యంగా కూడా వస్తాయంటారు" అంది.

"ఏమోనండీ మరి! నాకు తెలిసినంతవరకూ ఎవరికీ లేవు" అంది శాంత.

"ఆ! ఈ రోజుల్లో ఇవన్నీ కామన్. మీరేం కంగారు పడకండి. ప్రతీ వ్యాధికీ మంచి ట్రీట్‌మెంట్ ఉందీ రోజుల్లో. మావారూ, అబ్బాయిలూ చాలా బిజీగా ఉన్నారు. మలేషియాలో ఏదో బిజినెస్ స్టార్ట్ చేస్తారుట. పొద్దున్నే వెళ్ళి అర్ధరాత్రి వస్తున్నారు. ఆయనొచ్చాక చెప్తాను. మీరు ధైర్యంగా ఉండండి" అన్నది.

శాంతకి మనసుకి ఏదో దిగులు. ఎవరికైనా చెప్పుకోవాలనివుంది. కానీ అలా చెప్తే రాజా కోప్పడతాడు. ఎందుకు చెప్పావు అనవసరంగా అంటాడు.

అందుకే అక్కకి ఫోన్ చెయ్యాలనే ఆలో

## రమణీయ శిలారణ్యం!

అమెరికాలోని బ్రైస్ కెనాన్ నేషనల్ పార్క్‌లో వివిధ ఆకారాల్లో ఏర్పడిన శిలలవరుసలు ఇవి. లక్షలాది సంవత్సరాలుగా గాలి, నీరు, మంచు కోతలతో తెలుపు, నారింజ రంగుల్లో ఏర్పడిన ఈ వింత రూపాలు 145 చదరపు కిలోమీటర్ల మేరకు వ్యాపించి ఉన్నాయి. ప్రపంచవ్యాప్తంగా చూపరులను విశేషంగా ఆకట్టుకుంటున్న శిలారణ్యం ఇది.



# చతుర - విపుల

## ప్రకటనల రేట్లు

| కవర్స్ | చతుర | విపుల |
|---|---|---|
| ఫ్రంట్ కవర్ (స్ట్రిప్) కలర్ | 7,500/– | 6,000/– |
| బ్యాక్ కవర్ (కలర్ మాత్రమే) | 7,500/– | 6,000/– |
| రెండు / మూడు కవర్ (కలర్) | 6,750/– | 5,625/– |
| రెండు / మూడు కవర్ (నలుపు/తెలుపు) | 3,750/– | 3,000/– |
| లోపలివైపు ... | | |
| ఫుల్ పేజి (కలర్) | 6,000/– | 5,000/– |
| ఫుల్ పేజి (నలుపు/తెలుపు) | 3,000/– | 2,500/– |
| హాఫ్ పేజి (కలర్) | 3600/– | 3,000/– |
| హాఫ్ పేజి (నలుపు/ తెలుపు) | 1800/– | 1500/– |

వివరాలకు మీ సమీపంలోని
ఈనాడు కార్యాలయాన్ని సంప్రదించగలరు


చన విరమించుకుని వంటింట్లోకి వెళ్లి ఏదో పని కల్పించుకుంది.

సత్య తన కజిన్‌తో మాట్లాడాడు. అతను డాక్టర్‌తో మాట్లాడతానని భరోసా ఇచ్చాడు.

"సత్యా! పొద్దుట్నుంచీ మాతోనే ఉన్నావు! ఇంటికి వెళ్లు" అంది దివ్య.

"ఫర్వాలేదులే. అమ్మకి ఫోన్‌చేశాను. ఇదుగో మా కజిన్ ఏమైనా చెప్పాడేమో. ఇప్పుడు ఇంటికెళ్లి చేసేదేంలేదు. కాసేపు ఉండే వెళ్తాను" అన్నాడు. అటువంటి సమయంలో మనిషి తోడుంటే కొండంత ధైర్యం. ముగ్గురూ ఏదో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. సాయంత్రం ఏడింటికి ఆ కజిన్ ఫోన్ చేశాడు. "నేను మాట్లాడాను డాక్టర్‌గారితో. ఆయన సరేనన్నారు. మీరు రేపే వెళ్లండి. ఆయన దగ్గర ఏంజియోకి ఫిక్స్ చేసుకోండి. ఆయనకి సవాలక్ష వ్యవహారాలు. మళ్ళీ లేట్ చేస్తే విషయం మర్చిపోతారు" అన్నాడు.

"మరైతే రేపు పొద్దుటే వెళ్దాం అంకుల్" చెప్పాడు సత్య.

"అలాగే" అన్నాడు రాజా.

భోజనం చేసి "నేను రేప్పొద్దునే వచ్చేస్తా. ఎవరిదైనా కారు తీసుకొస్తా. ఊరికే టాక్సీకి ఎందుకూ దండగ" అని చెప్పి వెళ్లిపోయాడు సత్య.

దిగులుగా ఉన్న శాంతకి ధైర్యం చెప్పాడు రాజా. "నాకేం కాలేదు. ఈ టెస్ట్‌లూ అవీ అంటే హాస్పిటల్ చుట్టూ తిరగాలి. నువ్వు మనసు పాడు చేసుకుంటే నీ ఆర్యోగం పాడైపోతుంది. కాబట్టి నువ్వు ధైర్యంగా ఉంటే ఈ ప్రాబ్లం తేలిగ్గా దాటేస్తాం" అన్నాడు.

దివ్యకీ నిద్రపట్టలేదు. శ్రీరామ్‌తో ఇదంతా చెప్పాలని ఆరాటం. ఎన్నిసార్లు

ఫోన్ చేసినా తియ్యడం లేదు. వాయిస్ మెయిల్‌లో ఉంది ఫోన్. రాత్రి చాలాసేపటి వరకూ ట్రై చేసింది. పొద్దుటినించీ హైరానా పడివుందేమో! పుస్తకం చదువుతూనే నిద్రలోకి జారుకుంది.

తెల్లారాక హడావిగా తయారై హాస్పిటల్‌కి వెళ్లారు. డాక్టర్ని కలిశారు.

మర్నాడే హాస్పిటల్లో చేరమన్నాడు ఆయన. ఆ మరునాడు ఏంజియో అన్నాడు. రిసెప్షన్‌లో వివరాలన్నీ చెప్పి ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేసుకుని ఇంటికొచ్చేసరికి లంచ్‌టైం అయింది. భోజనం చేసి సత్య, దివ్య ఆఫీస్‌కి వెళ్లారు. రాజా కూడా ఆఫీస్‌కి వెళ్తానన్నాడుగానీ శాంత వద్దంది. "ఫోన్‌చేసి చెప్పండి. ఏకంగా ఆ టెస్ట్ ఏదో చేశాక అప్పుడే వెళ్లొచ్చు" అంది.

ఆఫీస్‌కి ఫోన్‌చేసి చెప్పాడు.

దివ్య పొద్దుటినించే ఫోన్ సైలెంట్ మూడ్‌లోనే పెట్టింది. ఆఫీస్‌కి వెళ్లాక చూస్తే శ్రీరాం దగ్గర్నించీ రెండు మిస్డ్ కాల్స్ ఉన్నాయి. వెంటనే ఫోన్ చేసింది.

"హాయ్ హనీ! ఏమైపోయావ్?" అన్నాడు. దివ్య చెప్పేది వినకుండానే "సరే, నీకు గుడ్ న్యూస్. మనం మలేషియాలో కొత్త బ్రాంచ్ ఓపెన్ చేస్తున్నాం" అన్నాడు. చాలా సంతోషంగా ఉన్నాడు.

"అలాగా కంగ్రాట్స్" అంది దివ్య.

నవ్వేశాడు. "మనం సెలబ్రేట్ చేసుకోవాలి. చూశావా! నువ్వు నాకు లక్ తెస్తున్నావు. సర్లే, ఫోన్లో ఎందుకు? సాయంత్రం కలుసుకుందాం. నేను మళ్ళీ ఫోన్ చేస్తా" అనేసి కట్ చేశాడు. అతనితో తన సమస్యలన్నీ చెప్పుకోవాలని ఎంతో ఎదురు చూసిన దివ్య కాస్త నిరుత్సాహపడింది. మళ్ళీ అంతలోనే సర్లే బిజీగా ఉన్నాడేమో అనుకుంది. దివ్యకీ బోలెడంత పని. కిందటిరోజు రాలేదు. మరో రెండు మూడు రోజులు రాదు. అందుకే ఆ పనంతా చూసుకోవాలి.

సాయంత్రం నాలుగింటికి ఫోన్ చేశాడు శ్రీరాం. ఏడింటికి ఇంటికొచ్చి పికప్ చేసుకుంటానన్నాడు. ఒక్క క్షణం ఆలోచించి, "వద్దులే, ఆఫీస్‌కే రండి! ఇక్కడినించే వెళ్దాం" అంది. సరేనన్నాడు.

ఏడింటికి అన్నవాడు కాస్త ఆలస్యంగా ఎనిమిదింటికి వచ్చాడు. అయినా ఓ అయిదు నిముషాలు వెయిట్ చెయ్యాల్సి వచ్చింది. పని ముగించుకుని ఒకసారి బాత్‌రూంకి వెళ్ళి కాస్త మొహం కడుక్కుని తలదువ్వుకుని పరుగులు పెడుతూనే వచ్చింది దివ్య. "సారీ.." అంటూ కారెక్కింది. "ఇట్స్ ఓకే" అంటూ చెయ్యి అందుకుని షేక్‌హాండ్ ఇచ్చాడు. అక్కడినించి బయలుదేరి కాస్త దూరంలో ఉన్న రెస్టారెంట్‌కి తీసికెళ్ళాడు. దార్లో అంతా చాలా సంతోషంగా మాట్లాడుతూనే ఉన్నాడు. కొత్త బిజినెస్ గురించి చెప్తూనే ఉన్నాడు. అతనితో మాట్లాడుతూ గత రెండు రోజులుగా పడుతున్న టెన్షన్ మర్చిపోయింది. లిఫ్ట్ ఎక్కారు. వాళ్ళిద్దరే ఉన్నారు. హఠాత్తుగా పక్కనే నిలబడి దివ్యని దగ్గరికి తీసుకుని బుగ్గమీద ముద్దు పెట్టుకుని వదిలేశాడు. మొదటిసారి అతని చనువుకు నిర్ఘాంతమయింది. చిలిపిగా నవ్వాడు. "నేనివ్వాళ చాలా హేపీగా ఉన్నాను. సో ఇదో చిన్న సెలబ్రేషన్ అంతే. నువ్వేం బెదిరిపోకు" అన్నాడు. తలొంచుకుని నవ్వింది దివ్య.

టేబుల్ ముందే రిజర్వ్ చేశారు. అక్కడ కూర్చుని సూప్ ఆర్డర్ ఇచ్చాడు. చాలా ఉత్సాహంగా ఉన్నాడు. "నాన్నగారి హెల్ప్ తీసుకోకుండా ఈ బిజినెస్ డీల్ నేనే సెటిల్ చేశా. అందరూ చాలా హేపీగా ఉన్నారు" అంటూ అంతా వివరంగా చెప్పాడు.

"దివ్యా! నిన్నొకటి అడగనా?"

సూప్ తాగుతున్న దివ్య తలెత్తి చూసింది. "అడగండి" అంది.

"నెక్ట్స్ వీక్ నేనూ అన్నయ్యా మలేషియా వెళ్తున్నాం. ఈ బిజినెస్‌లో పూజా వాళ్ళ నాన్నగారు కూడా పార్ట్‌నర్. పూజా కూడా వస్తోంది. నీకు వీలైతే నువ్వూ రాకూడదూ!" మెల్లిగా అడిగాడు.

తడబడింది దివ్య. "ప్లీజ్ ట్రైటూ అండర్‌స్టాండ్. ఇదో హాలీడే అంతే. నువ్వు ఫ్రెండ్స్‌తో టూర్ వెళ్ళినట్లే సరదాగా వెళ్ళొద్దాం! నీకు పూజ కంపెనీ ఉంటుంది. ఏం వస్తావా? "

దివ్యకి ఏం చెప్పాలో తెలియలేదు. "నేను నాన్నగారితో మాట్లాడుతా. పెద్ద వాళ్ళ పర్మిషన్ తీసుకునే వెళ్దాం!" అన్నాడు. అప్పటికీ దివ్య ఏమి సమాధానం చెప్పకపోయేసరికి "సర్లే నీకు ఇష్టం లేకపోతే వద్దు" అన్నాడు.

"అది కాదు? శ్రీరాం. నాకో ప్రాబ్లం వచ్చింది" అంటూ అంతా చెప్పేసింది.

"అరెరే. నాకు తెలియదే. సర్లే, ఇంకో వారం టైముందిగా. ఈలోగా అంతలో టెస్ట్‌లు అన్నీ అయిపోతాయి. అప్పుడు ఆలోచిద్దాం!" అన్నాడు. దివ్య మనసు తేలికపడింది. ఆ తర్వాత ఇద్దరూ హాయిగా కబుర్లు చెప్పుకున్నారు. పదిన్నర దాటాక దివ్యని ఇంటిదగ్గర దించేసి, రాజానీ, శాంతనీ పలకరించి వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారుజామునే లేచింది శాంత. దేవుడికి పూజ చేసింది. పొద్దున తొమ్మిదింటికి సత్య వచ్చాడు కారు తీసుకుని. నలుగురూ బయలుదేరి వెళ్ళారు. రాజాని ఎడ్మిట్ చేసుకున్నారు. "ఇక్కడ ఉండి చేసేది ఏంలేదు. నువ్వు వెళ్ళు ఆఫీస్‌కి" అని సత్యని పంపించేసింది దివ్య. సాయంత్రం మళ్ళీ వస్తానని చెప్పాడు సత్య. అలాగే వచ్చాడు. దివ్య, సత్య వెళ్ళి హోటల్లో టిఫిన్ తిని, శాంతకి తీసుకొచ్చారు. ఎనిమిదింటి దాకా ఉండి మళ్ళీ రేపొద్దునే వస్తానని చెప్పివెళ్ళాడు.

మర్నాడు పొద్దున ఏంజియోగ్రామ్ తీశారు. సత్యని, దివ్యని లోపలికి పిల్చి డాక్టర్ చెప్పేశాడు. "బ్లాక్స్ ఉన్నాయి. వీలైనంత త్వరగా బైపాస్ సర్జరీ చేయించుకోవాలి" అన్నాడు. దివ్య బాగా నెర్వస్ అయిపోయింది. డాక్టర్ మాత్రం "ఏం కంగారులేదు. వీలైనంత త్వరగా చేసేస్తాం" అన్నాడు.

సత్య కూడా ధైర్యం చెప్పాడు. "ఈ రోజుల్లో బైపాస్ సర్జరీ చాలా కామన్ అయిపోయింది" అన్నాడు.

మర్నాడు రాజాని ఇంటికి పంపించేశారు. తనకు బైపాస్ సర్జరీ అనేసరికి దిగాలు పడిపోయాడు రాజా! గతాన్ని గుర్తు చేసుకోకుండా భవిష్యత్తు గురించి బాధ లేకుండా హాయిగా వర్తమానంలోనే బతికే వ్యక్తి రాజా. సాఫీగా సాగిపోతూ ఉన్న దారిలో హఠాత్తుగా అగాధం ఎదురయ్యేసరికి తట్టుకోలేకపోతున్నాడు. సర్జరీ ఈ రోజుల్లో సర్వసాధారణమే. తన గురించి భయంకన్నా మరో భయం అతన్ని కుదిపేస్తోంది. ఆపరేషన్ అంటే చాలా డబ్బు కావాలి. అంత తన దగ్గర లేదు. సాధారణంగా ఇటువంటి అత్యవసర సమయాలకి కంపెనీ ఆదుకుంటుంది. అక్కడ రిజైన్ చేసేశాడు. కాబట్టి వాళ్ళేం పట్టించుకోకపోవచ్చు. బయటికి చెప్పుకోలేక మధనపడుతున్నాడు.

దివ్య మాత్రం ధీమాగా ఉంది. మెడికల్ ఇన్సూరెన్స్ తీసుకుంది. తనకు తల్లిదండ్రులకూ కవరేజ్ ఉంది.

కానీ శాంతకి దిగులుగానే ఉంది. ఇవ్వాళో రేపో అత్తారింటికి వెళ్ళే పిల్ల. పెళ్ళవగానే ఉద్యోగం మాన్పించి బిజినెస్‌లో చేరిపోతుందని ఆవిడ చెప్పూనే ఉంది. మరి ఈ డబ్బెప్పుడు తీరుస్తుందని

# సంచారి

గంగిరెద్దును ఆడిస్తూ
బతికే రాజలింగం డబ్బు
సంపాదనకు దుబాయ్‌కు వెళ్లి
జైలుపాలయ్యాడు. ఎట్టకేలకు
విడుదలై సొంత గూటికి చేరుకున్న అతనికి
ఎదురైన పరిస్థితులు అనూహ్యం! కుటుంబం
ఛిన్నాభిన్నమైంది. కోడలు ఇల్లొదిలి పోయింది.
కూతురు మొగుడ్ని వదిలి పుట్టిల్లు చేరింది..
ఈ పరిస్థితుల్లో రాజలింగం ఏంచేశాడు?
సమస్యల సుడినుంచి కుటుంబ నావను తీరం చేర్చాడా? ఓ సంచార కుటుంబ
వ్యధార్త గాథ పెద్దింటి అశోక్‌కుమార్ నవల సంచారి!
తరతరాలుగా నాగరికతకు దూరమై బతుకీడుస్తున్న
సంచారతెగల జీవితాలను అత్యంత ఆర్ద్రంగా
అక్షరబద్ధంచేసిన నవల సంచారి
తెలంగాణ పలుకుబడిలోని రుచిని చవిచూపే
సరికొత్త నవలారాజం సంచారి మీకోసం..





కూతురితో అంటే దివ్య నవ్వేసింది. తల్లి అమాయకత్వానికి జాలి వేసింది. అన్ని వ్యవహారాలూ తండ్రే చూసుకోవడంతో ఆవిడకేమీ తెలియదు.

"అమ్మా ఈ డబ్బు అప్పుగా కాదు. నేను పాలసీ కడుతున్నా కాబట్టి వాళ్ళే వైద్యం ఖర్చులన్నీ భరిస్తారు" అని అర్థం అయ్యేలా చెప్పింది.

కూతురికి మెడికల్ ఇన్సూరెన్స్ ఉందని తెలిశాక రాజా గుండెమీద బరువు దించి నట్లూ అయింది. రాజాకి ఆపరేషన్ అని తెలిసి శ్రీధర్ సువర్ణా వచ్చి చూసివెళ్ళారు. ధైర్యం చెప్పి వెళ్ళారు.

ఆపరేషన్ డేట్ ఫిక్స్ అయింది. వారం రోజుల తర్వాత బంధువులందరికీ చెప్పారు ఈ విషయం. అందరూ ఫోన్లు చేసి ఆప్యాయంగా మాట్లాడారు. కంగారేం లేదని చెప్పారు.

రాజా తమ్ముడూ, శాంత తమ్ముడూ ఆపరేషన్‌వేళ్టికి వస్తామని చెప్పారు. "హాస్పిటల్‌కి మా ఇల్లు దగ్గర మీ ఇంటి కంటే. నేను భోజనం పంపిస్తా" అంది శాంత అక్క. శ్రీరామ్ మలేషియా ప్రయాణం గురించి అడిగాడు. "ఎలా శ్రీరామ్? నాన్నగారి ఆపరేషన్ కదా!" అంది దివ్య.

"ఓ నాల్రోజులుండి ఆవేళ్టికి వచ్చేయచ్చు కదా!" అన్నాడు. కానీ దివ్య ఉత్సాహం చూపించలేదు. "సర్లే, నేనెలాగా అక్కడ కొన్ని రోజులుండాలి. అంకుల్ సర్జరీ అయి ఇంటికొచ్చాక రా!" అన్నాడు.

"అలాగే తప్పకుండా వస్తాను" అంది. అతను వెళ్ళే ముందరిరోజు ఇద్దరూ కలిసి సినిమాకి వెళ్ళారు. దివ్యని ఇంటి దగ్గర

దిగబెట్టి రాజాకి, "నేను ఊరు వెళ్తున్నా. నేను మళ్ళీ వచ్చేసరికి మీరు పూర్తిగా కోలుకుని ప్రయాణానికి రెడీ అవుతూ ఉంటారు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

మర్నాడు రాజా ఆఫీస్‌కి వెళ్ళాడు. బాస్ దగ్గరికి వెళ్ళి తన ఆరోగ్యం సంగతి చెప్పాడు. అదివరకైతే ఎంత కంగారు పడేవాడు. ప్రస్తుతం పరిస్థితులు మారాయి. అందుకే "అయ్యో అలాగా? ఇప్పుడు ప్రాబ్లం అవుతుందేమో. మరి కొత్త ఉద్యోగంలోకి చేరాలి కూడాను" అన్నాడు. అది సానుభూతో, వ్యంగ్యమో అర్థం కాలేదు రాజాకి. ఆ విషయం పట్టించుకోకుండా తన పన్లలో మునిగిపోయాడు. రాజాకి హాస్పిటల్ వారి దగ్గర్నించీ ఫోన్ వచ్చింది. ఆయనకు సర్జరీ సమయంలో బ్లడ్ అవసరమవుతుందని, బైపాస్‌కి బ్లడ్ బ్యాంక్‌లోని బ్లడ్ వాడరని, ఆరేడుగురు డోనర్స్‌ని అరేంజ్ చేసుకోవాలని అన్నారు. రాజా బ్లడ్‌గ్రూప్ 'ఒ' పాజిటివ్. ఈజీగానే దొరుకుతుంది. ఈ మాట ఆఫీసులో కొలీగ్స్‌తో చెప్తే అలాగే తామూ కనుక్కుంటామని అన్నారు.

వెంటనే కూతురికి ఫోన్ చేశాడు. "అదేం ప్రాబ్లెం కాదు నాన్నా. మావాళ్ళు చాలామంది ఉన్నారు. ఆరుగురు కాదు పదిమంది రమ్మన్నా వస్తారు" అంది. వెంటనే ఫ్రెండ్స్‌కి చెప్పేసింది. క్షణంలో రెడీ అయిపోయారు బ్లడ్ ఇచ్చేవాళ్ళు. 'వాళ్ళు ఆరుగురని అన్నా మనం పదిమందిదాకా రెడీగా ఉందాం. లాస్ట్ మినిట్‌లో ఎవరైనా డ్రాపైపోయినా ఇంకొకరు వెళ్తారు' అనుకున్నారు. పన్నెండుమంది డేటూ, టైమూ, హాస్పిటల్ వివరాలూ సెల్‌ఫోన్లలో ఫీడ్ చేసేసుకున్నారు.

ఆ రాత్రి మస్కట్‌నించీ రామకృష్ణ ఫోన్ చేశాడు. "ఎప్పుడొస్తున్నావ్? వీలైనంత త్వరగా వచ్చేయ్" అన్నాడు.

"సర్జరీ అయ్యాక వీలైనంత త్వరగా వస్తాను" అన్నాడు.

"అరే అదేమిటి రాజా! ఇంత సడన్‌గా ఏమైంది? " అంటూ కంగారుపడ్డాడు.

అంతా వివరంగా చెప్పాడు. "పోన్లే! భగవంతుడి దయవల్ల సరైన సమయంలో కనుక్కున్నారు. అక్కడైతే ట్రీట్‌మెంట్ కూడా చాలా బావుంటుంది. ఇక్కడికి వచ్చాక తెలిస్తే ఇబ్బంది అయ్యేది" అన్నాడు.

"మరి మీవాళ్ళకి నేనేమైనా మెయిల్ పంపించాలా" అడిగాడు రాజా. "అవసరం లేదు. నేను చెప్తాను. ఊరికే ఫార్మాలిటీ కోసం ఇదీ విషయం అని చెప్పి కాస్త లేట్‌గా జాయిన్ అవుతాననీ మెయిల్ పంపించు" అన్నాడు రామకృష్ణ. వెంటనే వాళ్ళకి పరిస్థితి వివరంగా తెలియజేస్తూ మెయిల్ ఇచ్చాడు.

మర్నాడు కూడా మామూలుగా ఆఫీస్‌కి వెళ్ళాడు. వీలైనంత త్వరగా వర్క్ పూర్తి చేసి మరో రెండోరోజుల తర్వాత తన అకౌంట్ సెటిల్ చేయమని బాస్‌ని అడగాలని రాజా ఆలోచన. ఆపకుండా పనిచేసేసరికి అలసిపోయాడు. ఇంటికి వెళ్ళి కాఫీ టిఫిన్ ముగించి హాయిగా స్నానం చేసేసరికి కాస్త అలసట తీరింది. భార్యతో కబుర్లు చెప్పాడు. చాలా ఫోన్లు వచ్చాయి. మాట్లాడాడు.

దివ్య ఫోన్‌చేసింది. "సత్య ప్రాజెక్ట్ వర్క్‌మీద అమెరికా వెళ్తున్నాడు. ఈనెల పదో తారీఖు బయలుదేరాలి. ఇంకో ఇద్దరు కూడా వెళ్తున్నారు. వాళ్ళు ట్రీట్ ఇస్తున్నారు. ఇంటికొచ్చేసరికి ఆలస్యం అవుతుంది" అని చెప్పింది.

శాంత టీవీ చూస్తోంది. రాజాకి విసుగనిపించి వెళ్ళి కంప్యూటర్ ముందు కూర్చున్నాడు. ఆన్ చెయ్యగానే కొత్త మెయిల్స్ డిస్‌ప్లే కనిపించింది. లాగ్‌ఇన్ అయి

మెయిల్ ఓపెన్ చేశాడు. తను చేరబోయే కొత్త కంపెనీ వారి మెయిల్. క్లిక్ చెయ్యగానే తెరమీద కనిపించింది.

"సారీ మిస్టర్ రాజా!"

ఉలిక్కిపడ్డాడు రాజా! మళ్ళీ చదవడం మొదలుపెట్టాడు.

"మీ అనుభవం మాకెంతో పనికివస్తుందనే ఉద్దేశంతో మీకు జాబ్ ఆఫర్ చేశాం. మా దగ్గర ఉద్యోగానికి శారీరక శ్రమ, మానసిక శ్రమ ఎంతో అవసరం. మీ ఆరోగ్యం విషయం తెలిశాక ఈ స్థితికి మిమ్మల్ని అంత శ్రమపెట్టడం మాకంత మంచిది కాదేమో అనిపిస్తుంది. అందుకే మా ఆఫర్ వెనక్కి తీసుకుంటున్నాం. ఈ విషయంలో ఎటువంటి వాదవివాదాలకూ ఆస్కారం ఉండదని తెలియజేస్తున్నాం"

ముందర అసలేమీ అర్థం కాలేదు. ఆ తర్వాత మెల్లిగా అర్థం అయింది. అంతా శూన్యం. ఆ తర్వాత వణుకు. గుండె దడ దడలాడింది. బుర్ర గిర్రున తిరిగింది.

మరోసారి చదివాడు. వెంటనే రామకృష్ణకి ఫోన్ చేశాడు. అతను అతి నీరసంగా "హలో" అన్నాడు.

"రామకృష్ణా! నాకు మెయిల్ వచ్చింది" అనగానే "అవును రాజా! నేనే ఫోన్ చేద్దామనుకున్నా! ఎలా చెప్పాలో అర్థంకాక ఊరుకున్నా! ఏమిటో సరిగా సమయానికి ఈ సర్జరీ రావడం నిజంగా బేడ్‌లక్. నువ్వేం అధైర్యపడకు. ఇక్కడ కాకపోతే మరోచోట. నాకు చాలా కాంటాక్ట్స్ ఉన్నాయి. ఎక్కడో దగ్గర దొరుకుతుంది. నీ ఆపరేషన్ అయ్యాక నువ్వు కొంచెం కోలుకున్న తర్వాత ప్రయత్నం చేద్దాం. నేను టచ్‌లోనే ఉంటాను" అన్నాడు.

"అదికాదు. జాబ్ ఇస్తామని ఇలా చెయ్యడం అన్యాయం కదా! నువ్వేం అడగలేదా? "

"నేనా! నేనూ ఎంప్లాయీనేగా రాజా! వాళ్ళని ఎలా అడుగుతాను? " నిస్సహాయంగా అన్నాడు రామకృష్ణ.

మెల్లిగా పరిస్థితి అర్థం అయింది రాజాకి. ఇక చేసేది ఏమీలేదు. వెంటనే ఇక్కడి బాస్‌కి ఫోన్‌చేసి విషయం అంతా చెప్పాడు. "మీరు అవకాశం ఇస్తే నేనిక్కడే కంటిన్యూ అవుతాను" అన్నాడు దీనంగా. ఆ బాస్‌కి చాలా సంతోషం వేసింది. ఎంతమంచి మనిషి అయినా కొన్ని సమయాలలో పైశాచిక ప్రవృత్తి కలుగుతుంది.

అంతా విన్నాడు. "ఐయాం సారీ రాజా! నేను మరో వ్యక్తిని మీ స్థానంలో తీసు

## డిసెంబరు-2010
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. **ఎం.రామచంద్రరావు**
   - హిల్ కాలనీ, నల్గొండ జిల్లా
2. **డా.ఆర్.వి.శివకుమార్**
   - ముషీరాబాద్, హైదరాబాద్
3. **కటకం మహాలక్ష్మి**
   - విజయవాడ
4. **కె.నాగమణి**
   - నర్సంపేట, వరంగల్ జిల్లా
5. **టి.ఆర్.బాలకృష్ణా రావు**
   - ప్రకాశం నగర్, రాజమండ్రి

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. పార్వతమ్మ | 6. మానవీనీ భవాయి |
| 2 .పుల్లారావు | 7. మైనంపాటి భాస్కర్ |
| 3. సుజాత | 8. ఫ్రాంస్వా రాబెలా |
| 4. శ్రీదేవి | 9. రత్తమ్మ కష్టాలు |
| 5. ఉన్నవ లక్ష్మీనారాయణ | 10. సైనిక్‌పురి |

కున్నా. అయినా ఒకసారి వద్దు అనుకున్న తర్వాత మా దగ్గర పనిచెయ్యాలనుకోడం మీకు కష్టమే, మాకూ కష్టమే" అన్నాడు అతి మామూలుగా.

ఫోన్ పెట్టేసి మంచంమీద పడుకున్నాడు రాజా. సన్నగా గుండెలో నొప్పి, అనీజీనెస్. మీకు ఏదైనా బాధగా ఉంటే వెంటనే ఈ మందు వేసుకోండి అని డాక్టర్ చెప్పిన విషయం గుర్తు వచ్చింది. మెల్లిగా లేచాడు.

దివ్య ఆఫీస్‌నించి మూడు కార్లలో బయలుదేరారు అందరూ. పన్నెండుమంది. అంతా హుషారుగా ఉన్నారు. బంజారాహిల్స్‌లో మంచి హోటల్‌కి వెళ్ళారు. టేబిల్ ముందే రిజర్వ్ చేయించి పెట్టారు. కబుర్లే కబుర్లు.

ఎనిమిదిన్నరకి దివ్య ఫోన్ రింగ్ అయింది. హోమ్ అని డిస్‌ప్లే అవుతుంది. నవ్వుతూనే ఫోన్ తీసుకుని "ఆ! చెప్పమ్మా!" అంది.

అవతల శాంత నోటమాట రావడం లేదు. కంగారు, గాభరా.. ఏడుపు. దివ్యకి భయంవేసింది. "అమ్మా ఏమైంది? "

"నాన్నగారికి ఏం బాగాలేదు. పిలిస్తే పలకడం లేదు" ఈ ముక్క చెప్పడానికనే మూడు నిముషాలు పట్టింది. చివాల్న లేచింది దివ్య. "నేనొస్తున్నా" అనేసి వెంటనే 108కి ఫోన్‌చేసి ఇంటి అడ్రస్ చెప్పింది. "నేను అర్జెంట్‌గా వెళ్ళాలి" అంది. "అసలేమిటి రీజన్. ఏమైందిట" అడిగారు మిగిలినవాళ్ళు. 108 అంటే ఎమర్జెన్సీ అని అర్థం అయిపోతోంది. విషయం చెప్పింది. "మీరు ఉండండి. నేను వెళ్తా" అంది. కానీ వాళ్ళొప్పుకోలేదు. సత్య, మరో ఇద్దరూ కూడా వెంట వెళ్దామని బయలుదేరారు. మిగిలినవాళ్ళు డల్‌గా అయిపోయారు. ట్రాఫిక్ దారుణంగా ఉంది. కారెక్కగానే తల్లికి ఫోన్ చేసింది. "నేను అంబులెన్స్‌కి ఫోన్ చేశాను. నువ్వు కంగారుపడకు. వచ్చేస్తున్నా" అని చెప్పింది.

మరో పదినిముషాలాగి మళ్ళీ చేసింది. కారుని మెయిన్‌రోడ్ ఎవాయిడ్ చేసి సందులూ గొందుల వెంటే పోనిస్తున్నాడు ఆ కొలీగ్.

అయిదయిదు నిముషాలకే ఫోన్ చేస్తోంది. 108 వచ్చేసింది అనగానే ఊపిరి పీల్చుకుంది. 'హమ్మయ్య, ఇక ఫర్వాలేదు. హీ ఈజ్ ఇన్ సేఫ్ హాండ్స్' అనుకుంది. సత్య తన ప్రయత్నం చేస్తున్నాడు. కజిన్‌ని అడిగి ఆపరేషన్ చెయ్యాల్సిన డాక్టర్ నెంబర్ తీసుకున్నాడు. ఆయనకి ఫోన్‌చేసి అంతా చెప్పాడు. 'తక్షణం హాస్పిటల్‌కి తీసుకురండి' అని చెప్పాడాయన.

ఇంటికి ఫోన్ చేసింది దివ్య. అంబులెన్స్ స్టాఫ్ తీశారు. "మీరు వెంటనే పేషెంట్‌ని ఆ హాస్పిటల్‌కి తీసుకువెళ్ళండి" అంది.

"మీరెవరు? " అడిగారు వాళ్ళు. చెప్పింది. "ఎక్కడున్నారు? " అని అడిగారు. చెప్పింది. "సరే, ఇంటికి రండి. మీరొచ్చాక తీసికెళ్దాం" అని ఫోన్ పెట్టేశారు.

మరో పది నిముషాలలో ఇంటికి చేరారు. ఇంటి ముందర ఆంబులెన్స్. ఇరుగుపొరుగువాళ్ళు వచ్చారు. పరిగెడుతూ లోపలికి వెళ్ళింది దివ్య. హాల్లో శాంత పడుకుని ఉంది. ఆవిడని అటెండ్ అవుతున్నారు.

"అదేమిటి నాన్నగారికి బాగాలేదన్నారుగా" ఆశ్చర్యంగా అడిగింది దివ్య. పక్కింటావిడ ఏడిచింది. తండ్రి గది గుమ్మం దగ్గర ఉన్నాడు పక్కింటాయన. చివాల్న లేచి గది దగ్గరికి వెళ్ళింది. మంచం మీద తండ్రి.

"సారీ మేడమ్! మేము వచ్చేసరికే ప్రాణం పోయింది. ఈ విషయం చెప్పేస

రికి.." అంబులెన్స్ వాళ్ళెవరో చెప్తున్నారు.

తలమీద పిడుగు పడ్డట్లు అయింది. మెల్లిగా అటువైపు వెళ్ళింది. వెంటవచ్చిన కొలీగ్స్ దివ్య వెంటే వెళ్ళి మంచం దగ్గ రున్న కుర్చీలో ఆమెను కూర్చోబెట్టారు. శాంతకి స్పృహ వచ్చింది. లేచి కూర్చుంది. షాక్ నించి ఇంకా తేరుకోలేదు.

సత్యకి మతిపోతోంది. ఏంచెయ్యాలో అర్థం కావడం లేదు. వాళ్ళిద్దరూ షాక్‌లో ఉన్నారు. ఇప్పుడేం చెయ్యాలి? డైనింగ్ టేబిల్ మీదున్న జగ్‌లోంచి ఓ గ్లాసు నీళ్ళు తాగాడు. కాస్త బుర్ర పనిచెయ్యడం మొదలుపెట్టింది.

ఫోన్ దగ్గరికి వెళ్లాడు. నెంబర్లు రాసిన బుక్ అక్కడే ఉంది. తియ్యగానే ఇంపార్టెంట్ నెంబర్స్ అని రాసి ఉన్నాయి. మొదటి నెంబర్ డయల్ చేశాడు. అది శాంత తమ్ముడి నెంబరు. కొత్తగూడెం.



అవతలి మనిషి హలో అన్నాడు. ఏం చెప్పాలో తెలీక తడబడ్డాడు సత్య.

"నా పేరు సత్య. నేను రాజాగారి ఇంటి నుంచి మాట్లాడుతున్నా!" అన్నాడు.

"అలాగా! ఏమిటీ" అన్నాడతను.

"మీకు రాజాగారు ఏమవుతారు? " అనే సరికి అతను కాస్త కంగారుపడ్డాడు. "ఆయన మా బావగారు, ఎందుకూ? ఇంతకీ మీరెవరూ? " అనుమానంగా అడిగాడు.

"నేను దివ్య కొలీగ్‌ని. మీకో శాడ్ న్యూస్. రాజాగారు పోయారు" అదిరి పడ్డాడతను.

"అదేవిటి! ఎప్పుడు? ఎలా? ఆపరేషన్ అనుకున్నాంగా!" అంటూ ప్రశ్నల వర్షం.

మెల్లిగా సమాధానం చెప్పాడు సత్య.

"నేనిప్పుడే బయలుదేరి వస్తున్నా" అన్నాడు.

"మరి మీ వాళ్ళకి ఫోన్ చెయ్యాలి కదా!" అంటే, "ఆ! నేను చేస్తా" అన్నాడు. మరో నిముషం గడిచేసరికి ఫోన్ మోగడం మొదలయింది.

శాంత అక్క ఫోన్ చేసింది. తర్వాత శాంత చెల్లెలు. తర్వాత రాజా తమ్ముడు. మరో తమ్ముడు. వరుసపెట్టి ఫోన్లు. ప్రతీ వారు ముందుగా ఇది నిజమేనా! అని ఆశగా అడగడం, నిజమే అనగానే భోరున ఏడుపు. దివ్య ఏది? శాంత ఎలా ఉంది? అని అడగడం.. అందరికీ ఓపికగా సమాధానాలు చెప్పేడు సత్య. అందరూ వెంటనే బయలుదేరుతున్నామని అన్నారు.

దుబాయ్‌నించీ, అమెరికానించీ ఫోన్లొచ్చాయి. "మేం వస్తున్నాం. బాడీని ఉంచండి" అన్నారు. అప్పటిదాకా తనేదో గడిపేసినా ఇక దివ్యతో సంప్రదించాలని లోపలికి వెళ్లాడు సత్య. "నాన్నా! నాన్నా! ఎలా ఉంది నాన్నా? ఏమైంది మీకు? " కుర్చీ నుంచి దగ్గరికి జరుపుకుని కూర్చుని తండ్రి చెయ్యి పట్టుకుని మాట్లాడుతోంది. అతని వెంటే వెళ్లారు మిగిలినవాళ్లు. అందరికీ కళ్లనీళ్లు తిరిగాయి. వాళ్ల ఫోన్లు అందుకున్న ఫ్రెండ్స్, అందరూ హోటల్ నుంచి అక్కడికి వచ్చేశారు.

దివ్య భుజంమీద చెయ్యి వేశాడు సత్య. "దివ్యా! నువ్వు ధైర్యం తెచ్చుకో. ఆంటీని చూడెలా ఉన్నారో? నువ్వు వచ్చి పలకరించు" అన్నాడు. ఉలికిపడింది దివ్య. పరుగున హాల్లోకి వెళ్లి తల్లి దగ్గర కూర్చుంది. "అమ్మా" అంటూ కావలించేసుకుంది. శాంత అక్క వచ్చింది. అక్కని చూడగానే శాంతకి ఏడుపొచ్చేసింది.

సత్య తన పనిమీద తనున్నాడు. ఫ్రీజర్ బాక్స్ కోసం ఫోన్ చేశాడు. దాదాపు నలభై ఎనిమిది గంటల కోసం కావాలని చెప్పాడు. అమెరికా వాళ్లు రావాలిగా. అంతలోనే ఫోన్. "దివ్యతోగానీ శాంతతో గానీ మాట్లాడాలి" అంటూ. వాళ్లిద్దరూ ప్రస్తుతం మాట్లాడే స్థితిలో లేరని అన్నాడు సత్య.

"మరి చాలా ముఖ్యమైన విషయం ఎవరితో చెప్పాలి" అన్నారు వాళ్లు.

"నాతో చెప్పండి" అన్నాడు. చెప్పారు. రాజావాళ్లు అద్దె ఇంట్లో ఉంటున్నారు. ఓనరు అమెరికాలో ఉంటున్నాడు. వాళ్ల తమ్ముడు ఇక్కడే ఉంటాడు. అద్దె వసూలు చేసుకోవడం, ఏదైనా రిపేర్లనీ కావాలంటే చేయించటం అతనే చూసుకొంటాడు. అతనే ఫోన్ చేశాడు. అతనికీ విషయం తెలిసింది. కొత్త ఇల్లు. ఆ ఇంట్లో ఇవన్నీ జరగడం వాళ్లకి ఇష్టం లేదుట. కాబట్టి వేరే ఏర్పాట్లు చేసుకోమన్నాడు.

ఏంచెయ్యాలో అర్థం కాలేదు. శాంత బావగారి దగ్గరికి వెళ్లి ఇదంతా చెప్పాడు. "అవును. వాళ్లలా అనడం సహజమే. ఈ రోజుల్లో ఇంటివారు ఒప్పుకోవటంలేదు. నేనూ అనుమానిస్తూనే ఉన్నాను. మనమే

వేరే ఏదైనా దారి చూసుకోవాలి" అన్నాడా యన. అంతా మాట్లాడుకున్నారు. బాడీని ఏదైనా హాస్పిటల్‌లో ఉంచాలి. వేరే మార్గాంతరం లేదు.

దివ్యని పిలిచారు. మొహం అంతా వాచిపోయింది. ఇంకా వెక్కిళ్లు పెడు తోంది. అటువంటి స్థితిలో ఇలాంటి విష యాలు మాట్లాడాలంటే బాధాకరమే. కానీ తప్పదు. అంతా విని "పెద్దనాన్నా" అంటూ ఆయన్ని కావలించుకుని ఏడిచింది దివ్య. "వూరుకో అమ్మా. ధైర్యం తెచ్చుకో వాలి మరి! ఏం చేస్తాం? మన చేతుల్లో ఏముంది? " అంటూ ఓదార్చాడు.

అంబులెన్స్‌లో రాజా భౌతిక కాయాన్ని హాస్పిటల్‌కి తరలించారు. అర్ధరాత్రి అయింది. అప్పటికే ఇరుగు పొరుగు వారంతా వెళ్లిపోయారు. సత్య, మరో ముగ్గురు ఫ్రెండ్స్ ఉన్నారు. శాంత అక్క ఫేమిలీ ఉన్నారు.

అప్పుడు గుర్తొచ్చింది సత్యకి. శ్రీరాంకి ఈ విషయం చెప్పలేదు. దివ్యకి, శాంతకి మైక్డాడాస్ స్లీపింగ్ టాబ్లెట్ ఇచ్చారు. పడు కుంది దివ్య.

ఒక్క క్షణం ఆలోచించి దివ్య సెల్ తీసుకుని నెంబర్స్ చూశాడు. రెండు మిస్డ్ కాల్స్ ఉన్నాయి శ్రీరాం దగ్గ ర్నించి. ఆ నెంబర్‌కి ఫోన్ చేశాడు. వెంటనే రిసీవ్ చేసుకున్నాడు శ్రీరాం.

తనని తను పరిచయం చేసుకుని మెల్లిగా ఈ విషయం చెప్పాడు. అదిరిప డ్డాడు శ్రీరాం. నేను వెంటనే దివ్యతో మాట్లాడాలి అన్నాడు. దివ్య అంత గాఢ నిద్రలో లేదు. ఉలిక్కిపడి లేస్తూనే ఉంది. సత్య వెళ్లి ఈ విషయం చెప్పి ఫోన్ ఇచ్చాడు. బావురుమంది దివ్య.

శ్రీరాం గుండె కరిగిపోయింది. ఏం చెయ్యాలో, ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఆకుచాటు పిందెలాగా తండ్రి చాటున ఏ కష్టమూ తెలియకుండా పెరిగిన శ్రీరాంకి కష్టాలూ కన్నీళ్లు తెలియవు.

"ఐయాం సారీ దివ్యా! ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు? వెంటనే రమ్మంటావా? నీకేం హెల్ప్ కావాలి? ఏం కావాలన్నా హెసిటేట్ చెయ్యకు!" అన్నాడు.

దివ్యకీ ఏం చెప్పాలో తెలియలేదు. "ఫోన్ చేస్తూ ఉండండి" అంది ఏడు స్తూనే. దివ్యకే ఇదంతా నిజంగా జరి గిందా, ఏదైనా పీడకల వచ్చిందా అర్థం కావడంలేదు. అంతా అయోమయంగా వుంది. బుర్ర మొద్దుబారి పోయింది.

తెల్లవారేసరికి శాంత తండ్రి, తమ్ముడు, కుటుంబం వచ్చేశారు. మరికాసేపటికి చెల్లెలు వచ్చింది బెంగుళూరు నుంచి.

> **కొత్తగాలి...**
>
> **ఇంట్లో సంగీతం**
> **మూగబోయింది**
> **పిల్ల నిద్రపోయింది**
>
> – పి. సునీల్,
> పెద్దకొట్టాల, నంద్యాల

మధ్యాహ్నం ఒరిస్సా నుంచి రాజా తమ్ము డొచ్చాడు. మరి కాస్సేపటికి మరో తమ్ముడు. కుటుంబంలోని వ్యక్తి హఠా త్తుగా చనిపోయాడని బాధ ఒకపక్క. బాడీ ఇంట్లో పెట్టకుండా ఎక్కడో హాస్పిట ల్‌లో ఉందనే బాధ మరోపక్క. "ఎంత చెప్పినా విన్నాడు కాదు. రెండు గదుల స్వంత ఇల్లున్నా ఎంత బాగుండేది? " అని చిన్నతమ్ముడు చాలా కుమిలిపోయాడు.

శ్రీరాం తనకు తెలియగానే తండ్రికి ఫోన్‌చేసి ఈ విషయం చెప్పాడు. వాళ్లూ నిర్ఘాంతపోయారు. "పొద్దున్నే వెళ్తాం"

అన్నారు. అన్నారుగానీ వెళ్లలేకపోయారు. ఆ విషయమే కొడుక్కి ఫోన్‌చేసి చెప్పారు. "వియ్యంకుడు పోతే వెళ్లకూడదుట. నువ్వూ వెళ్లకూడదుట. మన పెద్దవాళ్లు వద్దన్నారు" అన్నారు. ఫోన్ చేశారు. శాంతతోగానీ దివ్యతోగానీ మాట్లాడతాం అన్నారు. శాంత మాట్లాడే స్థితిలో లేదు. దివ్య బయటికి వెళ్లిందని చెప్పాడు శాంత బావగారు. "అలాగా.. మా సానుభూతి తెలియజెయ్యండి" అన్నారు. ఆ విషయం అందరికీ చెప్పాడాయన. అవును నిజమే. కొన్ని జిల్లాలవాళ్లకి అటువంటి పట్టింపులు ఉంటాయని అన్నారు.

దివ్య బ్యాంక్‌కి వెళ్లింది. మరునాడు అంత్యక్రియలు జరగాలి. ఆ విషయాలన్నీ పెద్దవాళ్లు బ్రాహ్మణులను పిల్చి మాట్లాడారు. దానికీ కాంట్రాక్టే. అన్నీ వాళ్లే తెచ్చుకునేట్లు మాట్లాడారు. దివ్య రాగానే అన్ని వివరాలూ చెప్పారు. శ్రీధర్‌గారు ఫోన్ చేసిన మాట కూడా చెప్పారు. ఎవరేం చెప్పినా తలకి ఎక్కడం లేదు దివ్యకి. యాంత్రికంగా పని చేసుకుపోతోంది. సత్య మాత్రం దివ్య వెంటే ఉన్నాడు. ఆఫీస్ నుంచి దాదాపు అందరూ వచ్చి పలకరించి వెళ్లారు. ఇంకా కాలేజీ ఫ్రెండ్స్, పాత స్నేహితులు, దూరపు బంధువులు, పరిచయస్తులు, గుంపులు గుంపులుగా వస్తూనే ఉన్నారు. వారిలో చాలామందిని దివ్య ఎప్పుడూ చూడలేదు కూడా. రాత్రి పొద్దుపోయాక వచ్చింది రాజా చెల్లెలు అమెరికా నుంచి. ఆ అమ్మాయికి పాపం రాజా దగ్గర చనువెక్కువ.

మరునాడు అంత్యక్రియలు. అందరూ హాస్పిటల్‌కే వెళ్లారు. అటునించీ అటే తీసుకెళ్లారు. రాజా పెద్ద తమ్ముడు శేఖర్ ఆ కార్యక్రమం చేశాడు. అంతా ఇంటికి వచ్చేశారు. మూడు రోజులుగా కిటకిటలాడిన ఇల్లు ఖాళీ అయిపోయింది. ముఖ్యులు మాత్రం మిగిలారు.

అయిదోరోజు బీచ్‌పల్లి వెళ్లి కృష్ణానదిలో అస్థి నిమజ్జనం చేసి వచ్చారు. ఇకముందు జరగాల్సిందేమిటి అని చర్చ వచ్చింది. అందరూ ఏకమై చర్చించారు.

దివ్యకి ఎలాగూ పెళ్లి కుదిరింది. వీలైనంత త్వరగా పెళ్లి చేసేస్తే రాజాకీ కన్యాదాన ఫలితం దక్కుతుంది. పెళ్లి ఖర్చులు పెద్ద సమస్య కాదు. అందరం తలో చెయ్యి వేస్తే పెళ్లయిపోతుంది. పోతే, శాంత గురించే అందరి బాధానూ.

శాంతకి ఇల్లు, సంసారం తప్ప బయటి ప్రపంచం గురించి ఏమీ తెలియదు. అన్నీ రాజానే చూసుకునేవాడు. ఇప్పుడు మరి పరిస్థితులు తారుమారు అయిపోయాయి. రాజాది పెన్షన్ వచ్చే ఉద్యోగం కాదు. మరెలా!

రాజా పెద్ద తమ్ముడు శేఖర్ కలగజేసుకున్నాడు. "నేను వదినని నాతో తీసుకెళ్తాను" అన్నాడు.

"ఎందుకు దేశంగాని దేశం వెళ్లటం? నేను తీసుకెళ్తాను" అన్నాడు ఒరిస్సాలో ఉన్న రెండో తమ్ముడు వేణు.

"నేను అమెరికా తీసుకువెళ్తా" అంది ఆడపడుచు.

"ఎందుకండీ! అక్కయ్యని నేను తీసుకెళ్తాను. నాన్నగారెలాగా నా దగ్గరే ఉన్నారు కదా! అక్కకి నాన్నగారి దగ్గరుంటేనే బావుంటుంది" అన్నాడు శాంత తమ్ముడు. శాంత తండ్రి అక్కడే ఉన్నాడు. అంతా వింటూనే ఉన్నాడు. ఆయన అనుభవజ్ఞుడు. ఎంతో జీవితం చూసినవాడు. ఇవ్వాళ నేను తీసుకెళ్తా.. నేను తీసుకెళ్తా అన్నవాళ్లంతా మరో నాలుగు రోజుల తర్వాత నువ్వు తీసుకెళ్లు.. నువ్వు తీసుకువెళ్లు అంటారని ఆయనకి తెలుసు. రాణీలాగా జీవిస్తున్న కూతురికి ఈ దుస్థితి వచ్చినందుకు దుఃఖం వచ్చింది ఆయనకి.

# ఖైదీలకు మాత్రమే ఉద్యోగాలు!




చార్లెస్ ఏ వార్డ్ ప్రెసిడెంట్‌గా ఉన్న ఓ ఎలక్ట్రికల్ కంపెనీలో పనిచేసే పదిహేను వందల మందికి ఓ ప్రత్యేకత ఉంది. వారంతా జైలు జీవితాన్ని అనుభవించినవారే. సాధారణంగా జైలు నించి వచ్చినవారికి ఎక్కడైనా ఉద్యోగం దొరకడం కష్టం. అమెరికాలో వారి సోషల్ సెక్యూరిటీ ఫైల్‌లో జైలు విషయం నమోదైపోతుంది. కాబట్టి దాన్ని వారు దాచలేరు. న్యాయంగా ఆలోచిస్తే ఓసారి తాము చేసిన నేరానికి శిక్ష అనుభవించిన తర్వాత వారు ఆ నేరం నించి విముక్తి చెందినట్లే. అయినా సమాజం వారిని నేరస్థులుగానే చూస్తుంది.



చార్లెస్ కూడా కొద్ది కాలం జైలు శిక్ష అనుభవించాడు. అప్పుడు ఆదాయ పన్నును ఎగ్గొట్టిన నేరానికి శిక్ష అనుభవించే హెర్బర్ట్ హ్యూజ్ అనే తోటిఖైదీతో స్నేహం ఏర్పడింది. ముందుగా విడుదలైన హెర్బర్ట్ ఓ ఎలక్ట్రికల్ కంపెనీకి ప్రెసిడెంట్ అయ్యాడు. తర్వాత విడుదలైన చార్లెస్‌కి తన కంపెనీలో ఉద్యోగం ఇచ్చాడు. హెర్బర్ట్ మరణానంతరం చార్లెస్ ఆ కంపెనీకి ప్రెసిడెంట్ అయ్యాక జైలునుంచి వచ్చిన ఖైదీలకు మాత్రమే ఉద్యోగాలు ఇవ్వసాగాడు. అతని ఇంట్లో ముగ్గురు చిన్నారులు ఆడుకునే తోటలో పనిచేసే వ్యక్తి కూడా హత్యానేరం మీద శిక్షని అనుభవించినవాడే!

దివ్యకి కూడా ఈ చర్చ బాధ కలిగించింది. తల్లివంక చూసింది. ఈ నాలుగు రోజులకే పిచ్చిదానిలా అయిపోయింది. ఏమీ మాట్లాడదు. పదిసార్లు పిలిస్తే సమాధానం చెప్తుంది. ఆవిడ ఎదురుగా ఇవన్నీ మాట్లాడుకోటం దివ్యకి నచ్చలేదు.

"బాబాయ్. ఇప్పుడవన్నీ ఎందుకు? ఈ పరిస్థితిలో అమ్మని వదిలి నేనెక్కడికీ వెళ్లను. పెళ్లీగిళ్లీ ఏం వద్దు నాకు" అంది.

"ఏదో మరి మాకూ బాధ్యత ఉంది కాబట్టి చెప్పాం దివ్యా. అంతేగానీ నీ మనసు కష్టపెట్టాలని కాదు" అన్నారు. వాళ్లకీ దివ్య అలా అనడం మనసుకి కష్టం కలిగించింది. ఏదో ఆపదలో ఉన్నారు కాబట్టి ఆదుకుందామనే ఆలోచనే తప్ప ఇందులో తమకు ఒరిగేదేమీ లేదు కదా! అప్పటికి ఆ విషయం పక్కన పెట్టారు.

రోజులు జరిగిపోతున్నాయి. సత్య అమెరికా వెళ్లాలి. కానీ దివ్యని అలా ఒంటరి చేసి వెళ్లాలనిపించడం లేదు. అందుకే బాస్‌తో మాట్లాడి మరో పదిహేను రోజులు ప్రయాణం వాయిదా వేశాడు. మామూలుగా అయితే ఏమైనా అనేవారేమో. తల్లి అనారోగ్యం అని బలమైన కారణం చెప్పాడు. కాబట్టి సరే అన్నారు. ఈ విషయం చెప్తే దివ్య కళ్లనీళ్లు పెట్టుకుంది. ఆ సమయంలో సత్య ఉనికి కొండంత ధైర్యం కలిగిస్తుంది. మొదట్లో తెలియలేదుగానీ ఒక్కోరోజు గడుస్తున్న కొద్దీ గుండె జారిపోతోంది. తండ్రి ఇకరాడు అనే నిజాన్ని జీర్ణించుకోలేకపోతోంది. ఇంట్లో వచ్చేపోయేవారి సానుభూతి భరించడం కూడా కష్టం అయిపోతోంది. ఏనాడు రానివాళ్లు రావడం, వాళ్లను చూడగానే తల్లి పక్షిలా కొట్టుకుంటూ ఏడవటం చూసి భరించలేకపో

తోంది. ఇంకా జరగాల్సిన కార్యక్రమాలు ఏ పని కావాలన్నా దివ్యతో సంప్రదించాల్సిందే. "ఏమ్మా దివ్యా ఇదుగో ఇలా చెయ్యాలి.. మరి నువ్వేమంటావు" అంటూ పెద్దవాళ్లు అడగ్గానే, "నాన్నా" అంటూ లేచి నాలుక కరుచుకోవాల్సి వస్తోంది.

ఇంతకాలం తనకు నీడనిచ్చే వృక్షాన్ని రాత్రికి రాత్రే ఎవరో నిర్దాక్షిణ్యంగా కూల్చేస్తే మండుటెండలో ఒంటరిగా నిలబడ్డట్లుగా ఉంది దివ్య పరిస్థితి. తట్టుకోలేకపోతోంది. అందరూ ఉన్నారు. అందరూ దగ్గరి వాళ్లే అయినా ఏదో ఒంటరితనం. పిచ్చెక్కిస్తోంది. శూన్యం. అంతా శూన్యం. ఆ స్థితిలో సత్య సాయం కొండంత బలంగా ఉంది. అందుకే అతను తన ప్రోగ్రాం పోస్ట్‌పోన్ చేసుకున్నానంటే మర్యాదకి కూడా వద్దనలేదు. "థాంక్స్ సత్యా! ఈ కండీషన్‌లో నువ్వూ వెళ్లిపోతే నాకు పిచ్చెక్కుతుంది" అంది.

శ్రీరామ్ ప్రతిరోజూ ఫోన్ చేస్తున్నాడు. అదివరకైతే గంటల తరబడి మాట్లాడుకునేవాళ్లు. ఇప్పుడు మాటలే దొరకడంలేదు. 'ఎలా ఉన్నావ్? ధైర్యంగా ఉండు. మీ అమ్మగారికి ధైర్యం చెప్పు. నావల్ల ఏదైనా హెల్ప్ కావాలంటే అడుగు' అంతే. ఆ తర్వాత ఏం మాట్లాడాలో తోచడం లేదు.

తల్లికి ఫోన్ చేసి చాలా బాధపడుతున్నాడు. 'పాపం! తను చాలా బాధపడుతోంది. ఇటువంటి టైమ్‌లో మనం వెళ్లకపోవడం ఏమిటమ్మా? ' అంటాడు.

'ఏం చేస్తాం శ్రీరామ్? మరి పెద్దవాళ్లొద్దన్నారుగా' అంటోంది సువర్ణ. ఈ సంఘటన జరిగాక సువర్ణ మనసు మరీ పాడైపోయింది. తొందరపడి సంబంధం కుదుర్చుకున్నారనే గునుపుగా ఉంటే ఇదొకటి! ఆ మధ్య ఆయనకి ముప్పూటలా మంచి ఉద్యోగం వచ్చిందని తెలిసి చాలా సంతోషించింది. కాస్త వాళ్ల హోదా పెరిగితే తమకూ బావుంటుందనుకుంది. ఆ ఆనందం కాస్తా ఆవిరైపోయింది. ఇప్పుడు ఆ తల్లి బాధ్యత ఈ పిల్లదే. ఆస్తీ లేదు. కనీసం ఉండేందుకు ఇల్లూ లేదు. చాలా ఉక్రోషంగా ఉంది సువర్ణకి.

దానికి సాయం ఈ విషయం తెలిసి అందరూ అయ్యో పాపం అనటంతో మరీ చిర్రెత్తుకొస్తోంది. విమల అంతకుముందు రోజే వెళ్లి శాంతని పరామర్శించి వచ్చింది. సువర్ణ ఇంటికి వెళ్లి అక్కడి పరిస్థితి అంతా వివరించి చెప్పింది.

"హృదయవిదారకంగా ఉంది. ఆవిడైతే పిచ్చికళ పడిపోయింది. దివ్య కూడా బాగా దిగులుగానే ఉంది. పరామర్శించడానికి వచ్చినవాళ్లు పెళ్లిమాట ఎత్తితే ఇప్పుడిప్పుడే ఆ మాట ఎత్తవద్దని అంటోంది. వాళ్ల బంధువులు తల్లిని తీసికెళ్తానంటే వద్దనే చెప్పిందట. అంతేకాదు, ఏ ముహూర్తాన ఈ సంబంధం ఖాయం చేసుకున్నారో లక్షణంగా తిని తిరుగుతున్న మనిషి కాస్తా పోయాడని వాళ్ళ చుట్టాలు చెవులు కొరుక్కోడం నా చెవినపడింది" అని వివరంగా చెప్పింది. సువర్ణకి మనసు చివుక్కుమంది. డైనింగ్ టేబుల్ దగ్గర ఈ మాట చెప్పింది. భర్త ఏం మాట్లాడలేదు. శ్రీరాంతో ఫోన్‌లోనూ చెప్పింది. అతనూ ఏమీ అనలేదు. విని ఊరుకున్నాడు.

పన్నెండు రోజులు గడిచిపోయాయి. యథావిధిగా జరిగిందంతా. శాంతని పుట్టింటివారు తీసుకెళ్ళి నిద్ర చేయించాలి. అంతదాకా ఆవిడ ఎక్కడికీ వెళ్ళకూడదు. నెల లోపల వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు శాంత తమ్ముడు. తండ్రి మాత్రం నేనింకొన్నాళ్ళు ఇక్కడే ఉంటానన్నాడు. అందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు. ఇల్లంతా బావురుమంటోంది.

మర్నాడునించీ ఆఫీస్‌కి వెళ్దామనుకుంది దివ్య. "అలాగే వెళ్ళమ్మా నేనుంటాగా





# అధికారికి గుణపాఠం

నిన్నటి నిజం

తమ అధికారాన్ని కొందరు ఇష్టారాజ్యంగా చలాయిస్తుంటారు. ప్రభుత్వం ఇచ్చిన అధికారం ప్రజా సేవకే గాని, వారిని బాధపెట్టేందుకు కాదని తెలుసుకోలేరు.

బెంగళూరు ఆకాశవాణిలో రంగనాథ్ అనే సీనియర్ అధికారి ఉండేవారు. ఆయన మంచి రచయిత. చక్కని ఉపన్యాసకుడు. అధ్యాపకుడిగా, నిర్దేశకుడిగా, పరిపాలకుడిగా ప్రఖ్యాతి చెందారు. పదవీ విరమణ చేశాక భారతీయ విద్యాభవన్, బెంగళూరు కార్యాలయంలో పరిపాలనాధికారిగా పని చేశారు. ఒకసారి భవన్ పనిపై విధానసభకు వెళ్లి ఓ సీనియర్ అధికారిని కలవాల్సివచ్చింది. ఆ అధికారి తన అధికార బలాన్ని ప్రదర్శిస్తూ రంగనాథ్‌ను మానసికంగా నొప్పించాడు. అతడు ఎప్పుడైనా తనవద్దకు రాకుండా పోతాడా? అని రంగనాథ్ అనుకున్నారు. ఆయన అంచనా తప్పలేదు. ఆ అధికారికి పనిపడి రంగనాథ్‌ను కలవాల్సి వచ్చింది. రంగనాథ్‌ను కలిసేందుకు అతడు సమయంకోసం ఫోన్ చేశాడు. రంగనాథ్ స్టెనోగ్రాఫర్‌తో అతడు వచ్చినప్పుడు ఎలా ప్రవర్తించాలో సూచనలు ఇచ్చాడు.



ఆ అధికారి నిర్ణీత సమయానికి వచ్చాడు. రంగనాథ్ వినయంగా లేచి నిలబడి అతడితో ఉత్సాహంగా కరచాలనం చేశాడు. కాఫీ తెప్పించి చాలా మర్యాదలు చేశారు. ఇంతలో స్టెనోగ్రాఫర్ లోపలికి వచ్చి అత్యవసరంగా చేయాల్సిన పని గుర్తు చేశాడు. దాంతో కొంచెం గాబరా కనబరచిన రంగనాథ్ ప్రభుత్వ అధికారి క్షమ యాచించి అతడి ముందు మరో కప్పు కాఫీ పెట్టించాడు. వెంటనే స్టెనోగ్రాఫర్‌కు కొన్ని లేఖల్ని డిక్టేట్ చేయనారంభించాడు. ఆ లేఖలు భారత విదేశాంగ మంత్రికి, ప్రధాన మంత్రికి పోవాల్సినవి. ఆ లేఖల ప్రతులను రాష్ట్ర ముఖ్యమంత్రికి పంపాల్సిందిగా, ఈ అన్ని లేఖలను అర్ధగంట లోపల ప్రత్యేక కొరియర్ ద్వారా పంపాల్సిందిగా ఆ స్టెనోగ్రాఫర్‌కు ఆజ్ఞలు జారీ చేశారు. అప్పుడు ప్రభుత్వ అధికారి వైపు తిరిగి, ‘మీకు కలిగిన ఇబ్బందికి క్షమించండి! చూశారు కదా మా ఎమర్జెన్సీని. ఆ పత్రాలు అత్యవసరంగా వెళ్లకపోతే పైవారి నుంచి మాటపడాల్సి వచ్చేది. అందుకే మిమ్మల్ని ఇబ్బంది పెట్టాల్సివచ్చింది. ఇప్పుడు చెప్పండి, మీ పనిని నా పనిగా భావించి చేస్తాను’ అన్నారు రంగనాథ్. స్టెనోగ్రాఫర్‌తో కలిసి ఆయన ఆడిన నాటకంలో ప్రేక్షకుడిగా అరగంట సేపు గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నాడు ఆ అధికారి. అలా అతడి పెద్దరికానికి, అహంకారానికి తూట్లు పొడిచారు రంగనాథ్. అతను వెళ్లిపోయాక వారు తమ నాటకానికి వాడిన పత్రాలను చెత్తబుట్టలో వేస్తూ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుకున్నారు.

అమ్మ దగ్గర" అన్నాడు తాతగారు.

ఆ రాత్రే ఫోనొచ్చింది ఇంటి ఓనర్ దగ్గ రినించి. వాళ్ళకి అర్జెంట్‌గా ఇల్లు కావా లిట. వీలైనంత త్వరగా ఖాళీ చెయ్యమని అతి మర్యాదగానే చెప్పాడు.

"అంతేనమ్మా దివ్యా! చాలామందికి వాళ్ళింట్లో ఇటువంటివి జరగడం ఇష్టం ఉండదు" అన్నాడు తాతగారు.

"పోన్లే తాతయ్యా! ఇదీ ఒకందుకు మంచిదే. ఈ ఇంట్లో ఉండడం మాకూ కష్టంగానే ఉంటుంది. ఆఫీస్‌కి దగ్గర్లో ఇల్లు చూసుకుంటే నాకూ బావుంటుంది" అంది దివ్య.

ఆఫీస్‌కి వెళ్ళగానే అందరూ వచ్చి పలక రించారు. మనసంతా బాధ. ఏ పనీ చెయ్యలేకపోయింది. సత్యతో ఇల్లు మార డం విషయం చెప్పింది. అలాగే అందరికీ చెప్తే సరిపోతుందన్నాడు. అలానే అంద రికీ చెప్పాడు. మరో రెండు రోజుల్లో ఒక ఇల్లు దొరికింది. టూ బెడ్‌రూం అపార్ట్ మెంట్. ఇద్దరమ్మాయిలు అద్దెకి తీసుకు న్నారు. మరో ఇద్దరుండచ్చు. నీకు నచ్చితే మీ ఇద్దరూ ఉండండి అన్నారు వాళ్ళు. ఇల్లు చాలా బావుంది. ఆఫీస్‌కీ దగ్గర. ఇంట్లో మరో ఇద్దరు ఉంటారు కాబట్టి కాస్త సందడిగా ఉంటుంది. వాళ్ళతో సరే నని చెప్పి, అడ్వాన్స్ ఇచ్చింది దివ్య. బ్యాంక్ బ్యాలెన్స్ చూస్తే భయం వేసింది. ఇటీవల వచ్చిన ఖర్చులతో బోలెడు ఖర్చ యిపోయింది. ఇకమీదట జాగ్రత్తగా ఉండాలనుకుంది. నాలుగు రోజుల తరు వాత శాంతని తమ్ముడు తీసికెళ్ళాడు నిద్ర చేయించడానికి. తల్లి వెళ్ళాక ఆ ఇంటి నుండి మారిపోయింది దివ్య. సత్య చాలా సాయం చేశాడు. కొద్దికొద్దిగా కోలుకుం టున్న దివ్యకి కర్తవ్యం గుర్తొచ్చింది.

"సత్యా! ఇక నన్ను వదిలేసి నీ పన్లు చూసుకో. నీ ప్రయాణం దగ్గర పడుతోంది కదా!" అంది.

"అంతా అయిపోయింది దివ్యా! పెట్టె సర్దుకోవాలంతే! అదేం పెద్ద పని కాదులే" అనేశాడు. మరి మూడురోజుల తర్వాత ప్రయాణం.

"నువ్వెళ్లి పోతానంటే నాకు చాలా బాధగా ఉంది" అంది.

"ఈ పరిస్థితుల్లో నిన్ను వదిలి వెళ్ళా లంటే నాకూ బాధగానే ఉంది. పోనీ ఈసారికి వద్దని చెప్పెయ్యనా? " అన్నాడు.

"ఇంకా నయం ఎన్నాళ్ళుగా వెయిట్ చేస్తున్నావు ఈ ఆఫర్ కోసం. ఇప్పుడు వద్దంటానా? వెళ్ళు" అంది దివ్య.

"మరి నీ మాటేమిటి? " అడిగాడు మెల్లిగా.

"నాకు? నాకేమైంది? "

"అదే నీ పెళ్ళి విషయం? ఆంటీని ఏం చేస్తావ్? నీకు సలహా ఇవ్వడం కాదుగానీ నీ పెళ్ళికి ముందరే ఆవిడని ఎక్కడైనా సెటిల్‌చేయ్ దివ్యా!" మెల్లిగా చెప్పాడు. దివ్య కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. అమ్మని చూస్తుంటే చాలా బాధగా ఉంది.

"ఈ పరిస్థితుల్లో నా పెళ్ళి వాయిదా వెయ్యాలనుకుంటున్నాను"

"అంతా నీ ఇష్టమేనా? వాళ్ళొప్పుకోవా లిగా? "

"ఎందుకొప్పుకోరూ? పూజ విషయంలో పెళ్ళి ఆపలేదా? ఇదీ అంతే!" అంది.

"సర్లే. అవన్నీ నిదానంగా ఆలోచించుకో వచ్చు. నువ్వు ధైర్యంగా ఉండు. ఆంటీకి ధైర్యం చెప్పు. నేను రోజూ మాట్లాడతాను. వెబ్ కేమ్‌లో అయితే ఫ్రీగా ఎంతసేపైనా మాట్లాడుకోవచ్చు కదా!" అన్నాడు. మరికా సేపు జాగర్తలు చెప్పి వెళ్ళిపోయాడు. తర్వాత రెండు రోజులూ బిజీగానే ఉన్నాడు తన పనులతో.

రెండేళ్ళ ప్రాజెక్ట్‌కోసం వెళ్తున్నాడు. హెచ్ వన్ వీసా దొరికింది. అలా అక్కడే

సెటిలైపోయి తల్లిని తీసికెళ్ళాలని అతని ఆలోచన. ఏకంగా పెళ్ళి చేసుకుని వెళ్ళమంది తల్లి. అప్పట్లో అలా అనుకున్న మాట నిజమే. కానీ ఆ తర్వాత పోస్లే ఇప్పుడింత అర్జెంటుగా పిల్లని వెతుక్కుని పెళ్ళి చేసుకోవడమెందుకు, నిదానంగా చూద్దామని వాయిదా వేశాడు. తల్లితో ఇదంతా చెప్పలేదు. నాలుగు డబ్బులు వెనకేసుకుని అప్పుడు చేసుకుంటాలే అన్నాడు.

కొడుకు అంతదూరం వెళ్తున్నాడని దిగులు పెట్టుకుంది. ఆ రెండ్రోజులూ తల్లి దగ్గరే ఉండిపోయాడు. ఫ్లైట్ అర్ధరాత్రి. టాక్సీ బుక్ చేసుకున్నాడు. 'నేనూ వస్తాన్రా ఎయిర్‌పోర్టుకి' అంది తల్లి. సాయంత్రం ఏడింటికి దివ్య దగ్గరికి వెళ్ళాడు. దివ్యకి చాలా దిగులు వేసింది. ఎంత ఆపుకున్నా ఏడుపు ఆగలేదు. వాళ్ళిద్దరి మధ్యా మంచి స్నేహం ఉంది. ఈ మధ్య జరిగిన సంఘటనల వల్ల మరింత ఆత్మీయత పెరిగింది. సత్యకీ బాధగానే ఉంది. బోలెడన్ని జాగ్రత్తలు చెప్పాడు. శాంత దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు రమ, వాణినీ వెంటబెట్టుకుని దివ్య ఇంటికి వచ్చింది సువర్ణ. ముందే ఫోన్ చేసింది. ఇంటి గుర్తులు చెప్పింది దివ్య. 'నేను వచ్చేస్తాను మీరొచ్చే టైంకి' అంది. కానీ ఆఫీసులో ఏదో పని ఉండి రాలేకపోయింది. వాళ్ళే డైరెక్ట్‌గా ఇంటికొచ్చేశారు.

లోపలికి వెళ్ళి శాంతని పలకరించారు. తలవంచుకుని ఏడ్చింది శాంత. ముగ్గురూ ఆ గది వంక పరిశీలనగా చూశారు. అదో టూ బెడ్‌రూం ఫ్లాట్. ఒక గది వాళ్ళది. డ్రాయింగ్ రూమ్, కిచెన్ కామన్. ఇంటెడు సామానూ ఆ గదిలో ఇరికించేసరికి కాలు పెట్టే సందు లేక ఇరుగ్గా ఉంది.

అయిదు నిముషాలు అక్కడ ఉండేసరికి కంపరంగా ఉంది అందరికీ. 'ఇక వెళ్తాం' అని లేచారు.

"అయ్యో ఉండండి దివ్య వస్తుంది" అంది శాంత.

"ఫర్వాలేదులెండి. తను బిజీగా ఉందేమో" అంది సువర్ణ.

"ఫోన్ చేస్తాను.. వస్తుంది" అంది శాంత.

"వద్దులెండి మరోసారి తీరిగ్గా వస్తాం!" అనేసి వెళ్ళిపోయారు. కారెక్కగానే నోరు విప్పింది రమ. "హారి భగవంతుడా! ఆ ఇల్లేమిటి? ఆ లక్షణం ఏమిటి? గొడ్ల కొట్టంలా ఉంది" అంది.

"అలా అనకండి. పాపం వాళ్ళ లెవెల్ అదీ. అసలే అతి మామూలు సంసారం. పుట్టెడు కష్టం వచ్చిపడింది. ఇంకెలా ఉంటారు? ఇంకా నయం ఏ చెట్టుకిందో ఉండకుండా ఓ గది తీసుకుని ఉంటున్నారు" అంది వాణి.

"నిజమే అనుకోండి. ఏ సంబంధం లేని వాళ్ళైతే అలానే అనుకునేవాళ్ళం. కానీ అయినవాళ్ళు కదా! రేపోమాపో వారితో సంబంధం కలుపుకోవలసిన వాళ్ళం. అందుకే ఈ బాధా, ఆరాటం" అంది రమ.

"ఏం చేస్తాం? మన చేతుల్లో ఏముంది? అంతా ఆ దైవ నిర్ణయం" అంది వాణి నిట్టూరుస్తూ. సువర్ణ వంక జాలిగా చూశారు.

సువర్ణ పరిస్థితి వర్ణనాతీతం. పుట్టి బుద్ధి తెలిశాక ఇటువంటి సందర్భం ఏనాడూ ఎదుర్కోలేదు. ఆస్థిలో, అందంలో అందరికంటే పైమెట్టున ఉండేది. అందరూ ఆరాధనగా చూసేవారు. కొంతమంది ఈర్ష్యగా చూసేవారు. అలా చూస్తుంటే ఎంతో గర్వంగా ఉండేది. అటువంటిది ఇంత కాలానికి ఇవ్వాళ తోటి వాళ్ళు జాలిగా చూస్తుంటే ఆమె మనసు దహించుకుపోయింది. ఉక్రోషంతో కళ్ళ నీళ్ళు తిరిగాయి. అది గమనించి వాణి,

రమ కూడా నొచ్చుకున్నారు. "నువ్విలా ఫీలైపోకు. ఇప్పుడేం మించిపోయిందనీ. చూద్దాం.. భవిష్యత్తులో ఏం జరుగు తుందో! నీకంతగా ఇష్టం లేకపోతే లక్ష ణంగా వేరే సంబంధం చూసుకోవచ్చు" ధైర్యం చెప్పారు.

ఇంటికి వచ్చాక కూడా ఎవరితో మాట్లా డలేదు. తన గదిలోకి వెళ్ళి కూర్చుంది. అదే సమయంలో దివ్య దగ్గర్నించి ఫోన్.

తను రాలేకపోయినందుకు సారీ చెప్పింది. అసలే చిరాగ్గా ఉన్న సువర్ణ ఆగ్ర హంగా మాట్లాడింది. "ఆమాత్రం మర్యాద లేకపోతే ఎలా? తోటివాళ్ళముందు నా పరువు పోయింది. మేము వస్తున్నామని తెలిసీ కాస్త ఇల్లు శుభ్రంగా పెట్టుకోవద్దా? " అని నిలదీసింది.

దివ్యకి కూడా ఆవిడ ధోరణి ఆగ్రహాన్ని కలిగించింది. అందుకే "క్షమించండి. మీకు తెలుసుగా. మేము అన్నివిధాలా బాధపడు తున్నాం. ఇలాంటి సిల్లీ విషయాలు పట్టిం చుకునే స్థితిలో లేము" అనేసింది.

ఆ సమాధానం విని మరీ కోపం వచ్చింది సువర్ణకి "ఏమిటా ఎదురు సమా ధానం చెప్పడం? " అంది విసురుగా.

"ఎదురు సమాధానం కాదాంటీ! ఉన్న మాటే చెప్పాను" అంది దివ్య.

"సర్లే! మీ అమ్మగారితోనే మాట్లాడ తాను. ఇవ్వాళేదో అయిపోయిందిగానీ ఈసారినించి జాగర్తగా ఉంటారు" అంది సువర్ణ.

"అమ్మ ఇప్పుడేం మాట్లాడే పరిస్థితిలో లేదుకదా ఆంటీ! ఇకనించీ అన్నీ నేనే చూసుకోవాలి. నాతోనే చెప్పండి"

"సరే! నీతోనే చెప్తాను. ఆ ఇల్లు, ఆ వ్యవహారం నాకేం నచ్చలేదు. మావా ళ్ళంతా వస్తారు మీ ఇంటికి. పలకరించ డాలూ అవీ ఉంటాయిగా. వీలైతే ఆ ఇల్లు మారి మంచి ఇల్లు తీసుకోండి. లేదా ఉన్న గదే కాస్త నీట్‌గానైనా సర్దుకోండి. వచ్చిన వాళ్ళ మొహాన ఏ కూల్‌డ్రింకో కాఫీనో అయినా పొయ్యాలి కదా? ఆ మాత్రం మర్యాద కూడా లేకపోతే బావుండదు. ఇవన్నీ చెప్పు మీ అమ్మకి"

ఆవిడ ధోరణికి ఒళ్ళు మండిపోయింది దివ్యకి.

"సారీ ఆంటీ! మా కండిషన్‌లో ఇల్లు మారలేము. వచ్చిన వాళ్ళకి మర్యాదలూ చెయ్యలేం. అన్నివిధాలా చితికిపోయాం. ఏదో ధైర్యం తెచ్చుకొని కాలం గడుపు తున్నాం. మమ్మల్ని పరామర్శించేవారు మా బాధ అర్థం చేసుకుంటే సంతోషం. కాదు, సదుపాయాలూ మర్యాదలూ కావల సిన వాళ్ళు మా ఇంటికి రాకపోతేనే మంచిది" అనేసింది.

"దివ్యా! ఏవిటా పెడసరం మాటలు. మంచీ మర్యాదా ఉండద్దా!"

"మర్యాదగానే చెప్తున్నాను కదా ఆంటీ! మా పరిస్థితి దాచిపెట్టి ఆర్భాటాలకి పోతా మని గొప్పలు చెప్పడంకంటే ఉన్నది ఉన్నట్లు చెప్పడం మంచిదికదా? " అంది దివ్య.

"దివ్యా! ఇలా అయితే మీ పెళ్ళి విష యంలో నేను నా నిర్ణయం మార్చుకోవాల్సి ఉంటుంది!" ఆవిడకు ఆగ్రహం అదుపు తప్పింది.

"మీ ఇష్టం ఆంటీ! మీరు పెద్దవారు. ఏ విషయమైనా ఆలోచించే నిర్ణయం తీసు కుంటారు" మెల్లిగా చెప్పింది దివ్య.

ఫోన్ కట్ చేసేసింది సువర్ణ. జీవి తంలో ఇలా ఎవరూ మాట్లాడలేదు తనతో. వెంటనే వాణికి ఫోన్ చేసింది. తన బాధంతా వెళ్ళబోసుకుంది.

అంతా విని నిట్టూర్చింది వాణి.

"ఈ రోజుల్లో పిల్లలంతా అలాగే ఉంటు న్నారు సువర్ణా. నీ బాధ నాకర్థం అయింది. నువ్వు కలిగిన ఇంటిదానివి.

# భూతదయ!



న్యూయార్క్ సిటీలో ఫైర్‌మేన్ డేవిడ్ జియానెల్లి ఓ ఉదయం బ్రూక్లిన్ లో నిప్పంటుకున్న ఓ గేరేజ్‌ని ఆర్పడానికి వెళ్ళాడు. అతను తన పరికరాలను వేన్‌లోంచి తీస్తుంటే పిల్లి కూనల అరుపులు వినిపించాయి. ఆ గేరేజ్‌కి అయిదడుగుల దూరంలో పేవ్‌మెంట్ మీదనుంచి ఆ అరుపులు విన్పిస్తున్నాయని గ్రహించాడు. దగ్గరకి వెళ్ళి చూస్తే భయంతో బిక్కచచ్చి పోయిన మూడు పిల్లి కూనలు కనిపించాయి. వాటినలా చూస్తూండగానే ఓ తల్లిపిల్లి నోట పిల్లని కరుచుకుని తెచ్చి అక్కడ ఉంచింది. వెంటనే మళ్ళీ కాలుతున్న గేరేజ్‌లోకి పరిగెత్తింది. అప్పటికే దాని ఒళ్ళు అక్కడక్కడ కాలి, ఎర్రటి మచ్చలు కనిపిస్తున్నాయి! అంతటి మంటలోనూ అది నాలుగు సార్లు లోపలకి, బయటకి తిరగడమే కాక ఐదోసారి కూడా లోపలకి వెళ్ళడం డేవిడ్‌ని కదిలించింది.



వెంటనే డేవిడ్ దానివెంట లోపలకి పరిగెత్తాడు. అయిదో పిల్లి కూన అరుపు వినిపించిన వైపు వెళ్ళాడు. తల్లి పిల్లికి కనురెప్పలు కాలి మూసుకుపోయాయి. అది తన పిల్లకోసం వెదుకులాడుతోంది. డేవిడ్ తక్షణం ఆ తల్లిని, పిల్లని రెండు చేతుల్లోకి తీసుకుని బయటకి తెచ్చాడు. అవన్నీ అప్పటికే కొంత కాలిపోయాయి. డేవిడ్ స్థానికులను అతి దగ్గరగా ఉన్న హాస్పిటల్ గురించి వాకబు చేశాడు. తల్లిపిల్లికి ఎక్కువగా కాలింది. వాటన్నిటినీ వేన్‌లో ఎక్కించుకుని లాంగ్ ఐలెండ్‌లోని నార్త్‌షోర్ ఏనిమల్ సెంటర్‌కి వెళ్ళి అప్పచెప్పాడు. మర్నాడు ఉదయం వెళ్ళి వాటికెలా ఉందని కనుక్కున్నాడు. తల్లి పిల్లి, అయిదో పిల్ల పరిస్థితి వెంటనే చెప్పలేమని వారు చెప్పారు. వరసగా మూడు రోజులు డేవిడ్ అక్కడికి వెళ్ళి వాటి ఆరోగ్యం గురించి కనుక్కుంటూనే ఉన్నాడు. మూడో రోజు డేవిడ్‌ని చూడగానే వెటర్నరీ డాక్టర్ నవ్వుతూ 'అన్నీ ప్రమాదంలోంచి బయటపడ్డాయి' అన్నాడు.

నీకై నువ్వు కోరి చేసుకుంటున్నావు కాబట్టి ఆ అమ్మాయి కృతజ్ఞతతో నీ కాళ్ళు కడిగి నెత్తిన జల్లుకుంటుందని అనుకుంటే అది నీ పొరబాటు. నిజం నిష్ఠూరంగానే ఉంటుంది. అయినా చెప్తాను. నీకై నువ్వు వెళ్ళావుగానీ వాళ్ళేం రాలేదు నీ దగ్గరికి. సరే అనుకున్నాక కూడా నీకు మనసులో అసంతృప్తిగానే ఉంది. అటూ ఇటూ ఊగులాడుతూనే ఉన్నావు. ఇప్పుడంటావా పరిస్థితి పూర్తిగా తల్లక్రిందులైపోయింది. ఈ టైంలో నువ్వు కాస్త నిదానించాలి.. ఓర్పుగా ఉండాలి. పరిస్థితి అర్థం చేసుకో. ఈ పెళ్ళైతే శ్రీరాంకి ఏ అండా ఉండదు. ఒకపూట అత్తవారింటికి పిలిచి భోజనం పెట్టే దిక్కు కూడా ఉండదు. రాకపోకలూ ముద్దుముచ్చట్లూ ఉండనే ఉండవు. వాటన్నింటికీ ఇష్టపడితేనే అడుగు ముందుకి వేయ్. లేదా ఇంతటితో ఫుల్‌స్టాప్ పెట్టెయ్. అది నీకూ వాళ్ళకీ మంచిది.

నువ్వు ఈ సంబంధం కాదనుకున్నంత మాత్రాన ఏం కొంపలంటుకుపోవు. ఈ రోజుల్లో ముందు అవుననుకోడం తర్వాత కాదనుకోవడం మామూలే. కాబట్టి మీరంతా మాట్లాడుకుని ఓ నిర్ణయానికి రండి. అది వీలైనంత త్వరగా జరిగితే మంచిది".

స్నేహితురాలు కాబట్టి వివరంగా చెప్పింది.

"వాణీ! ఇప్పుడు కాదనుకుంటే దివ్యకి ఏం నష్టం కాదుకదా? " అనుమానంగా అడిగింది.

నవ్వేసింది వాణి "ఏం కాదు. దివ్యకేం?

బంగారంలాంటి పిల్ల. ఆస్తి లేదుగానీ చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. నిజం చెప్పాలంటే ఇప్పుడున్న కండిషన్‌లో ఆ అమ్మాయికి మీ సంబంధం తప్పిపోతేనే మనశ్శాంతిగా ఉంటుంది" అంది.

"మరి మావాడి విషయం ఏమిటి? "

"కో అంటే కోటిమంది వస్తారు. ఎవరో ఎందుకు మీరు దివ్యను వద్దనుకుంటే మా అమ్మాయి మీ అబ్బాయి ఇష్టపడితే నేనే నా కూతుర్నిచ్చి పెళ్ళిచేస్తా" అంది వాణి.

వాణితో మాట్లాడాక ఆవేశం కాస్త తగ్గింది సువర్ణకి. కప్పుమీద కప్పు కాఫీ తాగుతూ చాలా సీరియస్‌గా అలోచించింది. ఒక నిర్ణయానికి వచ్చింది. ఈ సంబంధం డ్రాప్ చేసుకోవాలి. అన్ని విధాలా సర్దుకుపోయి కొడుకు పెళ్ళి చెయ్యాల్సిన ఖర్మ తనకేం పట్టలేదు.

ఆ రాత్రి భర్తతో ఈ విషయం మాట్లాడింది. ఆశ్చర్యపోయాడు శ్రీధర్. ఎందుకిలా మనసు మార్చుకున్నావన్నాడు. అంతా వివరంగా చెప్పింది. అన్నీ విన్నాడాయన.

"ఇవన్నీ ముందునించీ ఉన్న సమస్యలే. ఇప్పుడింత సడన్‌గా వచ్చినవేం కాదు" అన్నాడు. సువర్ణ అంత తేలిగ్గా వదల్లేదు. ఈ సంబంధం చేస్తే కొడుక్కి అన్యాయం చేసినట్లవుతుందని అంది. అదీగాక అప్పటికీ ఇప్పటికీ దివ్య నేచర్లో చాలా మార్పు వచ్చిందని చెప్పింది. భార్య మాటలు విన్న తర్వాత ఇదేమంత కొట్టిపారేయాల్సిన విషయం కాదనిపించింది శ్రీధర్‌కి.

"సర్లే, నేనూ ఓసారి దివ్యతో మాట్లాడతాను" అన్నాడు. ఆ రాత్రి శ్రీరామ్ ఫోన్ చేశాడు. ఇవన్నీ చెప్పాలనుకుని కూడా వద్దులే అనుకొని, పొడిగా మాట్లాడింది దివ్య. మర్నాడు దివ్యకి ఫోన్ చేశాడు శ్రీధర్. మామూలు మాటలయ్యాక, "నీతో కొంచెం మాట్లాడాలమ్మా" అన్నాడు.

"అలాగే అంకుల్. మీరు మా ఇంటికొస్తారా? లేకపోతే ఇంకెక్కడైనా కలుసుకుందామా? " అంది.

"నా ఆఫీస్‌కి రామ్మా" అన్నాడు.

"అలాగే వస్తాను" అంది దివ్య. ఆవేళే ఆఫీసయ్యాక రమ్మని చెప్పాడు. దివ్య వచ్చే టైంలో ఇంకెవరూ తనని డిస్టర్బ్ చెయ్యకుండా ఉండాలని సెక్రటరీకి చెప్పాడు.

ఆరున్నరకి వచ్చింది దివ్య. అంతకు ముందు శ్రీరామ్‌తో ఒకటి రెండుసార్లు ఆఫీస్‌కి వచ్చింది. అందరూ వినయంగా విష్ చేశారు.

"రండి మేడమ్! సార్ మీ కోసమే వెయిట్ చేస్తున్నారు" అంది సెక్రటరీ. శ్రీధర్ గదిలోకి వెళ్ళింది "రామ్మా" ఆదరంగా ఆహ్వానించాడు. ఎదురుగా కూర్చుంది. "ఎలా ఉన్నావు దివ్యా? " ఆయనని చూడగానే ఏడుపొచ్చింది దివ్యకి. చేతుల్లో మొహం దాచుకుని ఏడ్చింది. దగ్గరకొచ్చి తల నిమిరాడాయన.

"ఊరుకో తల్లీ! ఊరుకో" ఓదార్చాడు.

కాసేపటికి తేరుకుంది. కాఫీ తెప్పించాడాయన.

"నిన్ను చూస్తుంటే నాకు చాలా బాధగా ఉందమ్మా. నువ్వు ధైర్యంగా ఉండాలి" అన్నాడు.

పేలవంగా నవ్వింది.

"ధైర్యంగానే ఉన్నాను అంకుల్. మిమ్మల్ని చూస్తే ఏడుపొచ్చింది" అంది.

కష్టసుఖాలు అడిగి తెలుసుకున్నాడు.

"నీ పెళ్ళి విషయం మాట్లాడదామని రమ్మన్నానమ్మా" అన్నాడు.

"నేను ఆ విషయమే మీతో మాట్లాడాలనుకుంటున్నా అంకుల్.. ఇంతలో మీరే పిల్చారు."

"అలాగా ఏం మాట్లాడాలో చెప్పమ్మా!"

"మీరు చెప్పండి"

"ఏం లేదమ్మా మీ ఆంటీ ఎందుకో

చాలా బాధపడుతోంది. నీతో ఓసారి మాట్లాడి మనం ఆవిడని కన్విన్స్ చేస్తే బావుంటుందని నా ఆలోచన" చెప్పాడు.

నిట్టూర్చింది దివ్య. "ఆంటీని కన్విన్స్ చెయ్యడం సంగతి అలా ఉంచండి. నేనే ఈ పెళ్ళి విషయంలో కన్విన్స్ కాలేకపోతున్నాను."

ఆశ్చర్యపోయాడాయన "అదేమిటమ్మా?"

"మీకు తెలియనిదేముంది? మొదటి నుంచీ మన కుటుంబాల మధ్య చాలా తేడాలున్నాయి. అపుడు నాన్నగారూ, మీరు అన్ని విషయాలూ మాట్లాడుకున్నారు. ఆయనే ఉండుంటే పరిస్థితి వేరుగా ఉండేది. ఇప్పుడు అంతా మారిపోయింది. నిర్ణయం తీసుకోవాల్సిన బాధ్యత నా మీద పడింది. కాబట్టి చెప్తున్నాను నాకీ పెళ్ళొద్దు"

"అదేమిటి దివ్యా! నిశ్చితార్థం కూడా అయిపోయింది. నలుగురికీ తెలిసిపోయింది."

"నిశ్చితార్థమేగా అయింది. పెళ్ళి కావాలి. ఆ తర్వాత లైఫ్ అంతా సవ్యంగా జరగాలి. ఆ విషయం ఆలోచించుకోవాలిగా మనం. ఇక నలుగురూ అంటారా? అప్పుడు పెళ్ళి కుదిరింది అనుకున్నారు, ఇప్పుడు తప్పిపోయింది అనుకుంటారు" తేలిగ్గా చెప్పింది.

"దీనికి బదులు నువ్వు కొంచెం సర్దుకుపోతే అంతా సవ్యంగా జరుగుతుంది కదా అని నా ఆలోచన" అన్నాడు.

ఆదరంగా నిట్టూర్చింది దివ్య.

"అంకుల్! మనం ఇలా మాట్లాడుకుంటున్నాం కాబట్టి మీకు ఉన్నదున్నట్లు చెప్తాను. నిజం చెప్పాలంటే ఈ సంబంధం కుదిరిన దగ్గర్నించీ అమ్మా నాన్నా చాలా విషయాల్లో సర్దుకుపోయారు. మీకు మాకు ఉన్న తేడా వాళ్ళకి మనశ్శాంతి లేకుండా చేసింది. ఇది మావైపునించీ. అలాగే మీకూ ఎన్నో సమస్యలు, చిన్న చిన్న మనస్తాపాలూ కలిగే ఉంటాయని నేను ఊహించగలను.

ఇప్పుడు ఇంకా వర్స్ట్ అయింది మా పరిస్థితి. మీ దగ్గర్నించీ ఏమీ దాచలేను. మాకు ఆస్తులేం లేవు. నాన్నగారు డబ్బు వెనకెయ్యలేదు. ప్రైవేటు ఉద్యోగం. అందులోనూ ఉద్యోగం రిజైన్ చేసి వాళ్ళ ఆగ్రహానికి కూడా గురయ్యారు. నాన్నగారికి రావలసిన డబ్బెంత వస్తుందో.. మరీ ఎక్కువ రాదని మాత్రం తెలుసు! ఈ కండిషన్‌లో మా అమ్మ నా పెళ్ళి ఎలా చేస్తుంది? ఒకవేళ ఉన్నదంతా తుడిచి పెట్టి పెళ్ళి చేసినా తర్వాత ఏం చేస్తుంది? మీకు చాలా సామాన్యంగా అనిపించిన మర్యాదలన్నీ మా శక్తికి మించిపోతున్నాయి. ఆవిడకంత శక్తిలేదు. ఇక నా మాటకొస్తే నాన్నగారు నన్ను కూతుర్లా పెంచలేదు. కొడుకైనా కూతురైనా నేనే. అమ్మ బాధ్యత అంతా నాదే. ఈ మధ్య కొద్ది రోజులుగా ఈ సమస్య నన్ను తినేస్తోంది. నేను నిర్ణయానికి వచ్చాను. ఈ పెళ్ళి విషయం మర్చిపోదాం. న్యాయంగా ఈ మాట మా అమ్మ మీతో చెప్తే మర్యాదగా ఉండేది. కానీ మొదటినించీ ఆవిడకి ఇలాంటి వ్యవహారాలు అలవాటులేవు. అందుకే నేను చెప్తున్నాను. చిన్నదాన్ని ఇలా మాట్లాడాల్సి రావడం తప్పైతే నన్ను క్షమించండి. మీరు నా తండ్రి లాంటి వారు. ఈ మాట నేనేదో తలపొగరుగా చెప్తున్నాననుకోకండి. వేరే దారిలేక ఇలా మాట్లాడుతున్నాను. నా పరిస్థితి అర్థం చేసుకోండి. ఈ పెళ్ళి క్యాన్సిల్ చేసెయ్యండి. అలా చేస్తేనే మీకూ సుఖం. నాకు సుఖం" మెల్లిగా, మర్యాదగా, దృఢంగా చెప్పేసింది.

వింటున్న శ్రీధర్‌కి ఏం చెప్పాలో తోచలేదు.

"మరి ఈ సంగతి శ్రీరామ్‌తో మాట్లాడావా? " అడిగాడు.

"ఇంకా లేదు. ఇవ్వాళో రేపో చెప్పాలనుకున్నాను. ఇంతలో మీరే పిల్చారు. పెద్దవారు.. మీతో చెప్తేనే మంచిది కదా! మీరు శ్రీరామ్‌తో చెప్పండి. నేనూ చెప్తాను. తను చాలా మంచివాడు. నా కండిషన్ అర్థం చేసుకుంటాడనే అనుకుంటున్నాను"

బరువుగా నిట్టూర్చాడాయన. ఏం చెప్పాలో అర్థం కావడం లేదు.

మెల్లిగా లేచింది దివ్య. "మరి నేను వెళ్తాను. అమ్మ ఒక్కతే ఉంది" అని చెప్పి వెళ్ళిపోయింది.

ఇంక ఆఫీస్‌లో ఉండబుద్ధికాలేదు శ్రీధర్‌కి. ఇంటికి వెళ్ళిపోయాడు. ఇదంతా విని తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది సువర్ణ. కాగల కార్యం గంధర్వులే తీర్చారన్నట్లూ చేతికి మట్టి అంటకుండా పనైపోయిందనుకుంది.

పైకి మాత్రం "సర్లెండి! ఆ అమ్మాయే వద్దనుకుంటూ ఉంటే మనమేం చేస్తాం? పరిస్థితులు కూడా తోడయ్యాయి కదా! అందుకే అలా ఆలోచించింది. ఇక మనం కాళ్ళావేళ్ళా పడడం అనవసరం" అంది.




**ది**వ్య ఇంటికొచ్చి నెమ్మదిగా తల్లికి అన్నీ చెప్పింది. భర్త పోయినప్పటికంటే ఎక్కువగా ఏడ్చింది శాంత. "ఎందుకా ఏడుపు? ఏం ముంచుకుపోయిందనీ! ప్రతీ దానికీ నువ్విలా ఏడ్చి నీ ఆరోగ్యం పాడు చేసుకోకు" కాస్త గట్టిగానే చెప్పింది దివ్య.

లేచి వంటింట్లోకి వెళ్ళి వంట మొదలు పెట్టింది. గడ్డకట్టిపోయిన మనసు ద్రవించసాగింది. దాచుకున్న దుఃఖం బయటికి వచ్చేస్తోంది. వెంటనే ఉల్లిపాయలు ముందుకి లాక్కుని తరుగుతూ తనివితీరా ఏడ్చింది. మనసు తేలికపడేలా ఏడ్చింది. ఏడుస్తూనే వంట ముగించి వెళ్ళి స్నానం చేసి వచ్చింది. ఇంకా ఏడుస్తున్న తల్లిని ఓదార్చింది. అర్థం అయ్యేలా చెప్పింది. బలవంతాన అన్నం తినిపించి నిద్రమాత్ర వేసి పడుకోబెట్టింది. కొన్నాళ్ళు నిద్రమాత్రలు వాడమని చెప్పాడు డాక్టర్. అమ్మ నిద్రపోయాక మరీ ఒంటరిగా అనిపించింది. హాల్లోకొచ్చింది. ఆ అమ్మాయిలిద్దరూ టీవీ చూస్తూ కబుర్లు చేప్పేసుకుంటూ హుషారుగా ఉన్నారు. వాళ్ళ దగ్గర కూర్చుంటే మూడ్ మారుతుందేమో అనుకుందిగానీ అయిదు నిమిషాలకే విసుగేసి తలనొప్పి వచ్చేసింది. అందుకే లేచి లోపలకి వచ్చేసింది. ఆ గదిని ఆనుకొని ఒక బాల్కనీ ఉంది. విశాలంగానే ఉంటుంది. కానీ దాన్నిండా సామాన్లు. ఓ కుర్చీ వేసుకొని చీకట్లోనే కూర్చుంది.

సువర్ణ మాటలు గుర్తొచ్చాయి. ఆవిడ అన్నదాంట్లో అబద్ధమేమీ లేదు. ఇల్లు నిజంగానే చీదరగా ఉంది. వీలు చూసుకొని ఇల్లు మారితే బానే ఉంటుంది. కానీ వచ్చే ముప్పైవేలకి పన్నెండువేలు ఇంటికే పెడితే ఎలా? దిగులుగా అనిపించింది. ఒక్క నెలరోజుల్లో ఎంత మార్పు. మళ్ళీ ఏడుపొచ్చింది. సెల్ మోగింది.

అవతలనించీ సత్య. అతని గొంతు వినగానే బోలెడంత సంతోషం వేసింది. "హాయ్. చేరావా? జర్నీ బాగా జరిగిందా? ఇల్లిచ్చారా? " ప్రశ్నల వర్షం కురి

పించింది. దానికి చాలా పెద్ద సమాధానం చెప్పాడు. జర్నీ చాలా హాయిగా జరిగింద న్నాడు. ఒక ఇంట్లో నలుగురు బ్యాచిలర్స్ ఉంటున్నామన్నాడు. ఇల్లు లొకేషన్ అద్భుతంగా ఉందన్నాడు. చకచకా వివ రాలు చెప్పాడు. "నువ్వెలా ఉన్నావ్ దివ్యా? " అని అడిగాడు.

అప్పటిదాకా సంతోషంగా వింటున్న దివ్యకి ఒక్కసారి తన పరిస్థితి గుర్తుకొ చ్చింది. గబగబ జరిగిందంతా చెప్పేసింది. చెప్పేశాక మనసు తేలికపడింది.

అటు సత్య నిర్ఘాంతపోయాడు. ఎందు కిలా చేశావని దెబ్బలాడాడు. తొందరపడ్డా

## కొత్తగాలి...



**అసెంబ్లీ పీటపై**
**జంబో ఏనుగు**
**నిలిచేనా...?**

– గంపాశ్రీదేవి,
సింహాచలం

వని మందలించాడు. శ్రీరామ్‌కి చెప్పా ల్సింది, అతను చూసుకునేవాడని అన్నాడు. అన్నింటికీ సరైన సమాధానాలు చెప్పింది.

"మరి ఇది ఇంతదాకా వచ్చాక వెనక్కి తగ్గడంతో బాధగా లేదా? " అడిగాడు.

"ఏంలేదు, ఇదేం లవ్ మ్యారేజ్ కాదు కదా! బాధలేదని చెప్పను. కాస్త బాధగానే ఉంది. పర్వాలేదు. ఈ నిర్ణయం నాదే కాబట్టి త్వరగానే మర్చిపోతాను. శ్రీరామ్ కూడా ముందు బాధపడ్డా మర్చిపోతాడు. ఈ కండిషన్‌లో ఇదే బెస్ట్ సొల్యూషన్ అనిపించింది నాకు. మరో నె(్రోజుల్లో అంతా నార్మల్‌గా అయిపోతుంది. నాన్న గారు పోయిన బాధనే తట్టుకుని నిలబ డ్డాను. ఇదో లెక్కా!" అనేసింది.

"సర్లే, మళ్ళీ ఫోన్ చేస్తా. రేపు లాప్‌టాప్ ఇస్తారు. మనం చాట్ చేసుకోవచ్చు" అనేసి ఫోన్ పెట్టేశాడు సత్య. నిశ్చలంగా ఉన్న నీటిలో పెద్దబండ పడేసినట్లుగా ఉందతని పరిస్థితి. ఒకటే అలజడి మనసులో. ఏం చెయ్యాలో తోచలేదు. కాసేపు అటూఇటూ తిరిగి ఆఫీస్‌కి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి శ్రీరామ్ ఫోన్ చేస్తాడేమోనని వెయిట్ చేసింది దివ్య. ఫోనేం రాలేదు. మర్నాడు పొద్దున సువర్ణ ఫోన్ చేసింది. మామూలుగా కాఫీలయ్యాయా? స్నానం చేశావా? టిఫిన్ ఏమిటి? వంటి కాల క్షేపం ప్రశ్నలు వేశాక "నువ్వు ఈ పెళ్ళి వద్దనుకున్నావట కదా!" అడిగింది.

"అవునండీ. అదే మంచిదని నాకనిపిం చింది. మీ మనసుకి బాధ కలిగిస్తే నన్ను క్షమించండి."

"అయ్యో అదేంమాట దివ్యా. నీ జీవితం నీ ఇష్టం. మనం దెబ్బలాడుకోలేదుకదా. శత్రుత్వాలూ లేవు. నువ్వంటే నాకెప్పుడూ ఎంతో అభిమానం. మరి పూర్తిగా కాదను కునే ముందు ఒక్కసారి మీ అమ్మగారితో మాట్లాడాలనుకుంటున్నా" అందావిడ.

"ఇప్పుడు అమ్మకిస్తే ఏడిచి గొడవ చేస్తుంది. అయినా ఈ విషయంలో ఇక చర్చలు అనవసరం. అమ్మ బాధపడు తుంది. ఆవిడ ఇంకా కోలుకోలేదు" అంది.

"సరే, ఫైనల్‌గా వద్దనుకొన్నట్లేగా"

"అవునండీ" కాస్త తడబడి సూటిగానే చెప్పేసింది.

"సరేనమ్మా. అయితే శ్రీరామ్‌కి మీ నాన్నగారు నిశ్చితార్థంలో పెట్టిన ఉంగరం వాడొచ్చాక పంపిస్తాను. ఇంకా ఏవో ఇచ్చా రుగా! అవి ఇప్పుడే పంపిస్తాను" అంది.

"అలాగే ఆంటీ" అంది దివ్య.

వెంటనే ఆవిడ పెట్టిన నగలన్నీ బేగ్‌లో

# చిత్ర విచిత్రాలు



లండన్‌కు చెందిన సైకాలజిస్ట్ పేట్రీషియా రాస్‌బ్రూక్ జులై 2009లో తన 62వ ఏట అబ్బాయిని ప్రసవించింది. ఆమెకి అప్పటికే వివాహితులైన ముగ్గురు పిల్లలున్నారు. ఆమెకన్నా భర్త రెండేళ్లు చిన్న.

♦ ఆరెగాన్ రాష్ట్రానికి చెందిన లోర్నా జిన్ దుడాష్ ఎమర్జెన్సీ నంబర్ 911కు ఫోన్ చేసింది. ఓ పోలీస్ అధికారి వస్తే అతనితో 'నా వయసు 45. డేటింగ్ చేస్తావా? అందుకే ఫోన్ చేశా' అంది. అలా ఆ సర్వీస్‌ను దుర్వినియోగం చేసినందుకు అరెస్టయింది.




♦ పిట్స్‌బర్గ్‌కి చెందిన 80 ఏళ్ల ఫెలిక్స్‌ను పోలీసులు కొకైన్ కొంటుంటే పట్టుకున్నారు. అతనికి డ్రగ్స్ అలవాటు లేదు. వేశ్యలకి డబ్బిచ్చినా రాకపోవడంతో కొకైన్ ఇస్తే వస్తారని కొన్నాడట.

♦ అమెరికన్ మహిళ ఆనాకోల్జా ఉన్నతాధికారి క్రెడిట్ కార్డుల పాస్‌వర్డును దొంగలించి 12000 డాలర్లు ఓ హాస్పిటల్‌కు చెల్లించింది. ఆమె బ్రెస్ట్ ఎన్‌లార్జ్‌మెంట్ కోసం అలా చేసింది. కొసమెరుపు ఏమంటే ఆమె వయస్సు అరవైమూడేళ్లు. ప్రస్తుతం వాషింగ్టన్ కౌంటీ జైల్లో ఉంది.

♦ జర్మనీలోని ఫ్రాంక్‌ఫర్ట్‌లోని ఓ యూనివర్సిటీ డాక్టర్లు మనిషి వృషణాలు చల్లగా ఉంటే వీర్యకణాలు అభివృద్ధి చెందుతాయని కనుక్కున్నారు. ప్రస్తుతం బేటరీ సహాయంతో ఏర్ కండీషన్డ్‌గా ఉండే అండర్‌వేర్‌లను మార్కెటింగ్ చేయడానికి ఆ యూనివర్సిటీ ప్రయత్నాలు చేస్తోంది.

సర్దింది. చీరెలూ, బహుమతులూ పేక్ చేసింది. ఏడుస్తున్న తల్లిని మందలించి బయలుదేరింది. వాళ్లింటికి వెళ్లింది. ఆదరంగా ఆహ్వానించింది సువర్ణ.

"కూర్చోమ్మా. బాగా చిక్కిపోయావు. రంగు కూడా తగ్గిపోయింది" పరామర్శించింది. కాఫీ ఫలహారాలు ఇచ్చింది.

దివ్య తను తెచ్చిన నగలూ, వస్తువులూ తిరిగి ఇచ్చేసింది.

"అయ్యో! ఎందుకు దివ్యా? ఆడపిల్లవి. నీకు పెట్టినవి తిరిగి తీసుకోవడం నాకిష్టం లేదు. ఉండనీ. కాకపోతే పెళ్లి అవడం లేదు కాబట్టి ఆ ఉంగరం ఇచ్చెయ్" అంది.

"వద్దాంటీ. తీసుకోండి" అంది దివ్య. వేలినుంచి ఉంగరం కూడా తీసి ఇచ్చేస్తూ. ఉంగరం అందుకుంది సువర్ణ.

"నగలు ఉంచుకోమ్మా. పెళ్లి కావాల్సిన దానివి. నేనేం పరాయిదాన్ని కాదుకదా. నీ పెళ్ళికి నా బహుమతిగా ఉండనీ" అంది.

"పెళ్ళి సెటిలయ్యాక వస్తాను. అప్పుడిద్దురుగానీ.. ప్రస్తుతానికి మీ దగ్గరే ఉండనివ్వండి" అంటూ బల్లమీద పెట్టేసింది.

ఓ నిముషం కూర్చుని "వెళ్తానాంటీ.. ఆఫీస్‌కి వెళ్ళాలి" అంటూ లేచింది.

"ఇటువైపు వస్తే మా ఇంటికి రా!" అంటూ వాకిలిదాకా వెళ్ళి సాగనంపింది.

దివ్య స్కూటీ గేటుదాకా వెళ్తుంటే కలుక్కుమంది మనసు. అంతలోనే సర్దుకుంది. వెంటనే వాణికి ఫోన్ చేసింది.

"పోన్లే, అంతా మన మంచికే. శ్రీరామ్ వచ్చాక మనం తీరిగ్గా మిగిలిన విషయాలు మాట్లాడుకుందాం" అంది వాణి.

శ్రీరామ్‌కి ఫోన్‌చేసి జరిగిందంతా చెప్పింది.

"మీ ఇద్దరికీ రాసిపెట్టిలేదురా! అందుకే ఇలా జరిగింది. అంతా మన మంచికే జరి

గిందేమోలే. నువ్వోసారి దివ్యతో మాట్లాడు. మర్యాదగా ఉంటుంది" అంది.

"సరేలే" అన్నాడు.

కిందటిరోజు రాత్రి తండ్రి ఫోన్‌చేసి అంతా వివరంగా చెప్పాడు. మళ్ళీ తెల్ల వారి తల్లి ఫోన్ చేసింది. ఇప్పుడీ ఫోన్.

ఆవేళంతా శ్రీరామ్ ఫోన్ కోసం ఎదురు చూసింది దివ్య. రాలేదు. మనసు చివుక్కుమంది. తెగతెంపులు చేసేసుకుని మళ్ళీ ఆ వ్యక్తి గురించి ఆలోచించడం తెలివితక్కువని సర్దిచెప్పుకుంది. మనసు మళ్ళించడానికి కాస్త పనికల్పించుకుంది.

సాయంత్రం కంప్యూటర్లో వీడియో చాట్‌కి వచ్చాడు సత్య. చాలాసేపు

## కొత్తగాలి...

**చెట్టు కొమ్మల్ని**
**ఎన్నిసార్లు కత్తిరించినా**
**చిగురిస్తూనే ఉంటాయి**
**సడలని ఆశ అది**

– పాయసం సుబ్రహ్మణ్య మహర్షి,
నెల్లూరు

కబుర్లు చెప్పుకున్నారు. రోజూ ఈ టైంలో ఆన్‌లైన్ వస్తానన్నాడు. దివ్యతో మాట్లాడాక చాలా సంతోషంగా ఉందతనికి. అతని మనసులో లక్ష ఆలోచనలు.

ఒకసారి చెయ్యి జారిపోయిందనుకున్న అదృష్టం మళ్ళీ చేతికందుతుందా? ఈసారి మీనమేషాలు లెక్కపెట్టకూడదు. అడిగెయ్యాలి. మరీ వెంటనే అడిగితే బావుండదు. వారం ఆగి ప్లాన్ చేద్దామనుకున్నాడు.. అమ్మని, శాంతా ఆంటీనీ ఒక్క ఇంట్లో ఉంచాలి. దివ్య కూడా ఇక్కడికి వచ్చేస్తే కొన్నాళ్ళిక్కడ ఉండి కాస్త సంపాదించుకుని ఇండియా వెళ్ళిపోవచ్చు.

అప్పుడు లైఫ్ చాలా బావుంటుంది. ఏవేవిటో ఊహించుకుని మురిసిపోతున్నాడు. మరో వారం రోజులు గడిచిపోయాయి. దివ్యని ప్రాజెక్ట్ కోసం గట్టిగా ట్రై చెయ్యమని పోరుతున్నాడు సత్య. ఆలోచిస్తే అదీ మంచిదే అనిపిస్తోంది దివ్యకి. ముందు తను వెళ్తే తర్వాత అమ్మని పిలిపించుకోవచ్చు. ఒకసారి ఫోన్ చేసినప్పుడు మేనత్తతో చెప్తే, 'నువ్వు వచ్చేమాటైతే వదినకి నేను పేపర్లవీ పంపిస్తాను. తను ఈజీగా ఇక్కడికి రావచ్చు. అంతేకాదు టికెట్లన్నీ నేను చూసుకుంటాను' అని హామీ ఇచ్చింది. దివ్యకి అమెరికా వెళ్ళాలనే కోరిక మరింత బలపడింది. బాస్‌ని అడిగింది. 'అలాగే, ట్రై చేద్దాం' అన్నాడాయన. అలా వెళ్తే చాలా బావుంటుంది.

తన పెళ్ళి కేన్సిల్ అయిందనే విషయం అందరికీ తెలిసేలోగా వెళ్తే ప్రాణానికి సుఖం అనుకుంది. తను వెళ్ళటం ఏమంత కష్టమూ కాదు. ఈ టీమ్‌లోంచి వెళ్తున్నారు చాలామంది. ఇంతకాలం అవసరం రాలేదు. కాస్త సీరియస్‌గా ప్రయత్నిస్తే ఛాన్స్ వస్తుంది. ఇక్కడి నుంచి బయటపడాలి అనుకుంది.

ఆఫీస్‌నించీ బయటికొచ్చిన దివ్య ఎదురుగా నిలబడ్డతని చూసి అదిరిపడింది.

"శ్రీరామ్!"

"హలో హనీ! నిన్ను సర్‌ప్రయిజ్ చేద్దామని ముందు చెప్పలేదు. రా! కాఫీ తాగుదాం" అన్నాడు.

"ఎప్పుడొచ్చారు? " అడిగింది దివ్య తడబడుతూ.

"అన్నీ చెప్తాగా! రా!" కారు దగ్గరికి వెళ్తుంటే అనుసరించక తప్పలేదు దివ్యకి. ముందుపక్క డోర్ తీసి పట్టుకున్నాడు. కారు స్టార్ట్ చేశాడు, ట్రాఫిక్ దారుణంగా ఉంది. "ఈమధ్య ఇక్కడ లేనుకదా! డ్రైవ్ చెయ్యడం కాస్త అలవాటు తప్పింది.

ఇందాక రెండుసార్లు అడ్డం వచ్చిన బైక్‌ని డేష్ ఇవ్వబోయి తప్పించుకున్నా" అన్నాడు సీరియస్‌గా రోడ్డు మీదే దృష్టిపెట్టి.

అతని అవస్థ గమనించి మౌనంగా ఉండిపోయింది. అతనడిగిన ప్రశ్నలకు జవాబులు ఇస్తోంది. ఒక రిసార్ట్‌కి తీసికెళ్ళాడు. "పద కాసేపు మాట్లాడుకుందాం" అన్నాడు. ఓపన్ ఎయిర్ రెస్టారెంట్ ఉందక్కడ. జనం పలచగానే ఉన్నారు. ఒక టేబిల్ దగ్గర కూర్చున్నారిద్దరూ. సాయంత్రం ఆరున్నర దాటింది. "కాఫీ తాగుదాం. ఇక్కడ బఫే డిన్నర్ బావుంటుంది. ఏకంగా డిన్నర్ చేసి వెళ్దాం"

"అమ్మకి చెప్పి రాలేదు" అంది దివ్య.

"ఫోన్ చేసి చెప్పు" అతనంత ఆదరంగా చెప్తుంటే కాదనలేకపోయింది. ఫోన్ చేసి విషయం మాత్రం చెప్పింది. వివరాలేం చెప్పలేదు.

"ఆంటీ ఎలా ఉన్నారు? " అడిగాడు.

"ఎలా ఉంటుంది? ఇంకా కోలుకోలేదు" చెప్తుంటే కళ్ళనీళ్ళు తిరిగాయి దివ్యకి.

చెయ్యి చాచి ఆదరంగా దివ్య చెయ్యి నొక్కాడు. కళ్ళు తుడుచుకుంది.

"ఐయాం సారీ దివ్యా! ఇలా అవుతుందనుకోలేదు" అన్నాడు.

కాఫీ వచ్చింది. మౌనంగానే కాఫీ తాగారు. "పద అలా కాసేపు నడుద్దాం. డిన్నర్‌కి చాలా టైం ఉంది" అన్నాడు. ఇద్దరూ నడవడం మొదలుపెట్టారు. కాస్త దూరంలో బెంచ్‌మీద కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పు. మన పెళ్లి వద్దన్నావుట" అడిగేశాడు.

ఆ ప్రశ్నకోసం ఎదురుచూస్తూనే ఉంది. అందుకే "అవును శ్రీరామ్. చాలా ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నాను"

"అలా నిర్ణయించే అధికారం నీకెవరిచ్చారు దివ్యా? " హఠాత్తుగా కఠినంగా మారింది అతని స్వరం.

"ఎవరివ్వాలి? నాకా అధికారం లేదా? "

"లేదు. ఇది మనిద్దరి జీవితాలకీ సంబంధించినది కదా? నాతో మాట్లాడకుండా, అంగీకారం లేకుండా ఎలా డిసైడ్ చేసేశావు? " మళ్ళీ అదే కరుకుదనం.

"నా కండిషన్ నీకు తెలియదు. ఈ పరిస్థితిలో ఇంతకన్నా వేరేదారి లేదు"

"అలా అని నువ్వనేసుకుంటే ఎట్లా? నాది ఏదైనా లోపం ఉన్నా, నా వల్ల నీకు కష్టం కలిగినా పెళ్ళి వద్దు పొమ్మంటే అదోరకం. అదైనా నాతో చెప్పాలి. అప్పుడు కేన్సిల్ చేసుకోవాలి. అంతేగానీ నీ పరిస్థితులు బాగాలేవని పెళ్ళి వద్దు పొమ్మనడం ఏమిటి? "

"నువ్వు నా కండిషన్‌లో ఉన్నా ఈ పనే

> **కొత్తగాలి...**
>
> **గుండె డప్పు**
> **మోగినంతసేపే**
> **మనిషి**
> **ఆట... పాట**
>
> – శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు,
> నెల్లూరు

చేసేవాడివి శ్రీరామ్"

"సమర్థించుకోవాలని చూడకు. నేను నీ పరిస్థితిలో ఉంటే ఏం చేసేవాడినో పక్కన పెట్టు. ఇప్పుడు నువ్వు చేసిన పనే నేను చేసివుంటే నీకెలా ఉంటుంది? బాగానే మాట్లాడుతూ హఠాత్తుగా ఓరోజు నీ కాబోయే లైఫ్ పార్టనర్ నీతో పెళ్లొద్దంటున్నాడని ఇంకెవరైనా చెప్తే నువ్వేలా రియాక్ట్ అయ్యేదానివి, చెప్పు" అడిగాడు.

తడబడింది దివ్య.

"వద్దులే నీకా అనుభవం లేదుకదా! కాబట్టి నేనే చెప్తాను. చాలా దారుణంగా

ఉంటుందీ బాధ. దగ్గర వాళ్ళు చీట్ చేస్తే భరించలేం దివ్యా"

"ఇందులో చీటింగ్ ఏమీ లేదు. ఆలోచిస్తే నీకే తెలుస్తుంది. మనిద్దరి మంచి కోసమే ఇలా చేశాను"

"అలాగా! పెళ్ళి చేసుకుందామనుకుని అంతలోనే వద్దు పొమ్మనడంలో మంచేవిటో నా మట్టిబుర్రకి అర్థం కావడంలేదు. నువ్వు చెప్తే తెలుసుకుంటాను" అడిగాడు.

"అలా అడిగావు చెప్తాను. మనిద్దరి ఫైనాన్షియల్ స్టేటస్‌లో చాలా గ్యాప్"

"అదెప్పుడూ ఉంది. అప్పుడూ ఇలాగే ఉన్నాం. ఎంగేజ్‌మెంట్ చేసుకున్నాం"

"అప్పుడు మా నాన్నగారున్నారు"

"ఇప్పుడు లేరు. కానీ పెళ్ళి చేసుకోవాల్సింది మనిద్దరం కదా! అంకుల్ లేకపోతే లేరని ఫీలవుతాం. పెళ్ళి మానెయ్యాలా? "

"ఆంటీకి ఈ పెళ్ళి అంతగా ఇష్టంలేదు"

"అలా నీతో చెప్పిందా మా అమ్మ? "

"అవును. మా లైఫ్‌స్టైల్ మార్చుకోమన్నారు. నా వల్ల కాదన్నాను. అయితే ఈ పెళ్ళి విషయంలో నేను మళ్ళీ ఆలోచించుకోవాలి అన్నారు" ఉక్రోషంగా చెప్పింది.

"ఆవిడ అలా అనేసరికి నీకు పౌరుషం వచ్చేసింది. నీ ఈగో దెబ్బతింది వద్దు పొమ్మన్నావు. అంతేనా? " అడిగాడు.

"నిజమే., నాకేనా పౌరుషం లేనిది? అందుకే వద్దనేశాను" చెప్పింది.

"సర్లే. ఇక విషయం వదిలెయ్. నీ జాబ్ ఎలా ఉంది? " టాపిక్ మార్చాడు

"బానే ఉంది"

"మీ జాబ్ చేసే వాళ్ళపనే హాయి. చక్కగా నెలంతా పనిచేస్తే చాలు. శాలరీ చేతికొచ్చేస్తుంది. ఓన్ బిజినెస్‌లో చాలా తలనొప్పి. ప్రతిరోజూ టెన్షనే" అన్నాడు.

"అదేం మాట. బిజినెస్ వాళ్ళ పనే సుఖం. కష్టపడ్డా రిజల్ట్సు అన్నీ మీవేగా. మేమలా కాదు. ఇంకెవరి లాభం కోసమో మేము చాకిరీ చెయ్యాలి" అంది దివ్య.

"పని చేసినా డబ్బొస్తుందిగా. పైగా ఎవరూ ఏమీ అనరు" అన్నాడు శ్రీరామ్.

"ఇంకా నయం. ఎందుకనరు? దుమ్ము దులుపుతారు. తలాతోకా లేకుండా మాట్లాడుతారు. ఒక్కోసారి ఒళ్ళు మండిపోతుంది. రిజిగ్నేషన్ వాళ్ళ మొహాన కొట్టి వచ్చేద్దామనిపిస్తుంది"

"మరి వచ్చేస్తారా? "

"ఎలా రాగలం? ఉద్యోగం కదా! ఇది వదిలేసినా ఊరికో కూర్చోలేం. మళ్ళీ ఇంకోటి వెతుక్కోవాలి. అక్కడ మాత్రం ఈ గొడవలన్నీ ఉండవని గ్యారంటీ ఏం లేదుకదా. ఎందుకొచ్చిన తలనొప్పి? ఇక్కడే అడ్జస్ట్ అయిపోతే పోలా అనుకుంటాం" చెప్పింది.

"ఉద్యోగం విషయంలో ప్లస్ అండ్ మైనస్ పాయింట్లు అంత ఓర్పుగా ఆలోచించే నువ్వు జీవితంలో ఎందుకిలా తొందరపడ్డావ్? " నిదానంగా అడిగాడు.

నోరావలించింది ఏం చెప్పాలో తోచక.

"చెప్పవేం? ఎందుకు ఇంత హేస్టీ డెసిషన్ తీసుకున్నావ్? "

"ఇది మరీ బావుంది. దానికీ దీనికీ ఏమిటీ పోలిక? "

"ఎందుకు లేదు? ఎక్కడైనా అడ్జస్ట్‌మెంట్ తప్పదు. అసలా మాటకొస్తే లైఫ్ అంతా అడ్జస్ట్‌మెంట్ మీదే ఆధారపడి వుంది. ఇద్దరు మనుషులు ఓ గంటసేపు మాట్లాడుకుంటేనే ఆర్గ్యుమెంట్స్ వచ్చేస్తాయి. నేనే కరెక్ట్.. కాదు.. నేనే కరెక్ట్ అని వాదించుకుంటారు. మరి భార్యాభర్తల మధ్య డిఫరెన్సెస్ రావా? ఆమాత్రం అడ్జస్ట్ అవకపోతే ఎలా? "

"మనం భార్యాభర్తలం కాలేదు కదా శ్రీరామ్? "

"నువ్వలా అనుకున్నా.. నేను మాత్రం మనం భార్యాభర్తలమనే అనుకున్నాను"

చెప్పలేనంత బాధ కనిపించింది అతని మొహంలో.

దివ్య మనసు చివుక్కుమంది. "సారీ శ్రీరామ్. నిన్ను చాలా హర్ట్ చేశానేమో!"

"నువ్వు. హర్ట్ చేశావనే బాధకంటే నేను ఓడిపోయాననే బాధ ఎక్కువ దివ్యా"

"ఓడిపోవడమా!"

"అవును. ఈ మధ్య చాలామంది ఫ్రెండ్స్‌ని చూస్తున్నాను. పదిమందికి ముగ్గురో నలుగురో విడాకులు తీసుకుంటు న్నారు. ప్రేమించుకుంటారు. పెళ్లి చేసు కుంటారు. ఏడాది తిరక్కుండానే విడాకు లంటారు. కారణమేమిటంటే ఏవో కహా నీలు చెప్తారు. బలమైన కారణం ఉంటే,

> **కొత్తగాలి...**
>
> **తల్లిపాల తెలుగు చొప్ప**
> **ఎల్లదాటిన హిందీ గొప్ప**
> **తెల్లయాంగ్లము దాని అప్ప**
> **కల్లకాదిది నేటి యాంధ్రుల గొప్ప**
>
> – బద్దిగం పాండురంగారెడ్డి,
> కరీంనగర్

లేదా లైఫ్‌పార్టనర్ శాడిస్టు అయితే విడిపో వచ్చు. కానీ అన్నీ సిల్లీ కారణాలే.

అత్తగారు చీర కట్టుకోమంది. భర్తంటే మనసు విరిగిపోయింది. నా భార్య జాబ్ నాకు సూటవడం లేదు. మా లైఫ్ స్టయిల్ వేరు. అదివరకు ఓ అఫైర్ ఉండేది. పెద్దవాళ్లు ఒప్పుకోరని అది వద్ద నుకుని ఈ పెళ్లి చేసుకున్నాకానీ ఆ వ్యక్తిని మర్చిపోలేకపోతున్నా! ఎవరం కెరియర్ శాక్రిఫైస్ చెయ్యాలో డిసైడ్ చేసుకోలేకపో తున్నాం. వాళ్ల ఫేమిలీ నాకు నచ్చడం లేదు.. ఇవీ కారణాలు.

ఇదిగో పెళ్లి, అదిగో డైవర్సు. ఓ ఏడాది గాలికి తిరగడం.. మళ్లీ పెళ్లి చేసుకో వాలా? ఒంటరిగా బతకాలా అని అదో అయోమయం. అంతా అయోమయమే. వాళ్లందర్నీ చూసి భగవంతుడా నాకు మాత్రం వద్దీ తలనొప్పి అనుకున్నా. మా అమ్మావాళ్లు చూసిన అమ్మాయినే పెళ్లి చేసుకుని సుఖంగా వుందామని ఆశపడ్డా. కాలేజ్ డేస్‌లోనూ ఆ తర్వాతా చాలా మంది అమ్మాయిలు నా మీద ఇంట్రస్ట్ చూపించినా నవ్వేసి ఊరుకున్నా.

అనుకున్నట్లుగానే మా అమ్మ నాకు సంబంధం చూసింది. పెళ్లి చూపులకు వెళ్దామంది. సరే అన్నాను. అమ్మకి నచ్చింది కాబట్టి నాకంతగా నచ్చకపో యినా ఓకే అనేద్దామనే ఆలోచనతోనే వచ్చాను మీ ఇంటికి. నిన్ను చూడగానే మతిపోయింది. నేనెలాంటి భార్య కావాల నుకున్నానో అచ్చు అలాగే ఉన్నావు నువ్వు. థాంక్‌గాడ్ అనుకున్నా. ఒక్క మాటలో చెప్పాలంటే పెళ్లి చూపులకు వచ్చినట్లు అనిపించలేదు. పుట్టింట్లో ఉన్న భార్యను చూడ్డానికి వెళ్లినట్లు అనిపిం చింది. మన పెళ్లి సెటిల్ అయింది.

ఎంగేజ్‌మెంట్ అన్నారు. ముహూర్తం పెట్టడానికి వచ్చిన మా పురోహితుడిని అడిగాను 'ఏంటి దీని అర్థం? ' అని.

ఆయన చరిత్ర అంతా చెప్పుకొచ్చాడు. వివాహం నిశ్చయమయ్యాక పెద్దల ముందరా నిశ్చయ తాంబూలాలు ఇచ్చి పుచ్చుకునేవారు. అంటే ఫలానివారి అబ్బా యికి ఫలానావారి అమ్మాయిని ఇచ్చి వివాహం చేస్తారని నలుగురికీ తెలు స్తుంది. అప్పట్లో ఆ కార్యక్రమానికి వధూ వరులు హాజరయ్యేవాళ్లు కాదు. పెద్దవాళ్లు మగవారు మాత్రమే వెళ్లేవారు. తాంబూ లాలు ఇచ్చిపుచ్చుకున్నాక ఆ అమ్మాయి వీరికి వాగ్దత్త అయిపోయేది. సంబంధం నిశ్చయమని నలుగురికీ తెలిసేది. ఇక

# అమెరికాలో భారతీయుల హవా!




అమెరికాలో ఈ ఏడాది కేంద్ర లేదా రాష్ట్ర ఎన్నికల్లో అమెరికాలోని ఇండియన్ సంతతి అత్యధికంగా పోటీ చేసారు. భారతదేశం నించి వలస వెళ్ళిన వారి సంతతిలో ఎనిమిదిమంది ఎన్నికల్లో పాల్గొన్నారు. సౌత్‌కరోలినా రాష్ట్ర గవర్నర్‌గా నిమ్రతా నిక్కి రణ్‌ధావా (నిక్కి హేల్) పోటీ చేస్తోంది. రిపబ్లిక్ పార్టీకి చెందిన ఆమెని చాలామంది శ్వేతజాతి యువతిగా పొరపడటం కద్దు. ఈమె సిక్కు మతాన్ని వదిలి క్రిస్టియానిటీని తీసుకోవడాన్ని చాలామంది భారతీయులు తప్పు పట్టారు.




బాబీజిందాల్ 2007లో ముప్పై ఆరోఏట గవర్నర్‌గా ఎన్నికైన తొలి ప్రవాస భారతీయ సంతతి వ్యక్తి. టీన్స్‌లోనే ఇతను కేథలిక్‌గా మారాడు. 2008 కాంగ్రెషనల్ ఎన్నికల్లో మిన్నిసోటాలో డెమొక్రటిక్ పార్టీ తరపున జిందాల్‌జె అశ్విన్ ఓడిపోయాడు. ఇతను జైన్ అయితే తను క్రైస్తవం తీసుకోకపోవడం తన ఓటమికి కారణం కాదని ఓ ప్రశ్నకి జవాబుగా చెప్పాడు.

రాజ్ గోయెల్ కేన్సస్‌లోని విచిటాలో డెమొక్రటిక్ పార్టీ తరపున నామినేషన్ 2006లో దాఖలుచేసి గెలుపొందాడు. కేన్సస్ లెజిస్లేచరీకి ఎన్నికైన మొదటి ప్రవాస భారతీయుడితను. ఏభై ఏళ్ల క్రితం భారతదేశం నించి అమెరికాలో చాలామంది వలస వెళ్ళారు. వారి సంతతి ఇప్పుడు ఎన్నికల బరిలో దిగుతున్నారు. ఈ రోజు అమెరికాలో ఎన్నికల్లో గెలిచిన భారత సంతతికి చెందినవారు ఆరుమంది ఉన్నారు. వారిలో సూర్యా యలమంచిలి ఒహాయో రాష్ట్రంలో గెలుపొందాడు.

వాళ్లిద్దరికీ కాబోయే దంపతులుగా ముద్ర పడిపోయేది. ఎందుకంటే చివరికి నిశ్చయమైన అబ్బాయింటికి ఇంకెవరైనా పిల్లనిస్తామని వెళ్లకూడదు. అది చాలా తప్పు. అందుకే ఈ శుభకార్యం జరిపేసేవారు.

ఆ తర్వాత ఆ అమ్మాయి వారింటి కోడలిగానే చలామణి అయ్యేది. ఇక వీలు చూసుకుని ముహూర్తం నిశ్చయించి వివాహం జరిపించటమే.

ఇప్పుడు తాంబూలాల తతంగం పెళ్లి మాదిరిగానే చేస్తున్నారు. అమ్మాయీ అబ్బాయీ దండలూ ఉంగరాలూ మార్చుకోడం.. సగం వివాహం ఎంగేజ్‌మెంట్ నాడే జరిగిపోతుంది.

కాకపోతే నిశ్చితార్థం జరిగాక కొన్ని సందర్భాల్లో పెళ్లిదాకా వెళ్లకుండా ఆగినాయి. ఎంగేజ్‌మెంట్ రద్దు చేసేసుకుంటూ ఉంటే బాధగా ఉంటుంది. కాస్త నిదానంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటే బావుండు కదా అనిపిస్తుందని అన్నాడు, ఎన్నో వివాహాలు తనచేతి మీదుగా జరిపించిన ఆ పెద్దాయన.

మన ఎంగేజ్‌మెంట్ రోజున నన్ను పిల్చి ఓ మాట చెప్పాడాయన. నాయనా ఈ అమ్మాయి మంత్రపూర్వకంగా నీ భార్య కాలేదు కానీ మాట పూర్వకంగా సహధర్మచారిణి. ఆ మాటకు నువ్వెంత విలువ ఇస్తావో నీ ఇష్టం. నా చేతుల మీద ఎన్నో వివాహాలు జరిపించాను. ఈ జంట కలకాలం కలిసుండేలా దీవించమని ఆ దేవుడిని మనసారా వేడుకుంటాను. ఇప్పుడూ అంతే. మీరిద్దరూ లక్ష్మీనారాయ

ఱుల్లా కలిసుండాలని అన్నాడు. నాకు చాలా తృప్తిగా అనిపించింది. ఆ తర్వాత మనం మానసికంగా చాలా దగ్గరయ్యాం. స్నేహంగా ఉన్నాం.

పెద్దవాళ్లు కుదిర్చిన పెళ్లి. మా మనసులు కూడా కలిశాయి. ఇక ఏ ప్రాబ్లమ్స్ రావు అనుకున్నా. పెళ్లిదాకా రాకుండానే ఇలా జరగడం నాకు షాక్‌లా ఉంది. నేను తట్టుకోలేకపోతున్నాను.

ఫోన్‌లో మాట్లాడ్డం కంటే కలిసి మాట్లాడ్డం మంచిదని ఈ నాలుగురోజులూ ఆగి ఇప్పుడొచ్చాను. నువ్వు పెళ్లి వద్దనుకున్నావు. ఎందుకొద్దనుకున్నావు? నాకు చెప్పు ఆ కారణం. నాకూ నిజమే, ఆ కారణం సరైనదే అనిపిస్తే అలాగే విడిపోదాం" నిలదీశాడు శ్రీరాం.

ఏం చెప్పాలో అర్థం కాలేదు దివ్యకి. కాసేపు ఆమె సమాధానం కోసం చూసి మళ్లీ తనే మాట్లాడాడు.

"సరే నేనే అడుగుతాను. నా బిహేవియర్‌లో ఏమైనా లోపం ఉందా? "

"లేదు."

"నన్ను పెళ్ళి చేసుకుంటే నీ లైఫ్ బావుండదని భయమా? "

"అలాంటిదేం లేదు. కాకపోతే మనిద్దరి కుటుంబాల మధ్య చాలా డిఫరెన్స్. మనకు మెంటల్ పీస్ ఉండదేమో"

"అలా అని ఎందుకనుకుంటున్నావ్!"

"మొన్న ఆంటీ స్పష్టంగా చెప్పారు. మా లైఫ్‌స్టయిల్ నచ్చలేదనీ, మార్చుకోమనీ"

"అంటే? అంతమాత్రానికే పెళ్ళి మానెయ్యాలా? నువ్వేం అనుకోనంటే నేనూ ఓ మాట చెప్పనా? "

"చెప్పు"

"మన ఎంగేజ్‌మెంట్ అయ్యాక నీతో సినిమాలకీ షికార్లకీ వెళ్ళాలనిపించేది. నిన్నడిగితే మొహమాటపడ్డావు. రాలేనన్నావు. సర్లే. మీ ఇంట్లో పద్ధతులు అంతే కాబోలు అనుకున్నానేగానీ పెళ్లి వద్దు పొమ్మన్నానా? నిజానికి మా ఫ్రెండ్సంతా ఎంగేజ్‌మెంట్ అయ్యాక ఫ్రీగా చెట్టాపట్టాలేసుకు తిరిగారు. నాకందులో తప్పేం కనిపించలేదు. ఇవన్నీ భయంకరమైన సమస్యలేం కాదు. ఎదుటివాళ్ళు ఎందుకలా అన్నారా అని కాస్త నిదానంగా ఆలోచిస్తే తెలుస్తుంది" చిరాగ్గా అన్నాడు.

"అంటే నాకు తొందరపాటనేగా!"

"డౌటా? ప్రూవ్ అయిపోయిందిగా. ఏ మాత్రం ఆలోచన ఉన్నా ఇలా ఫూలిష్‌గా బిహేవ్ చేసివుండేదానివి కావు."

"సరే. నేను ఫూల్‌నే. మరి నన్నెందుకు పెళ్ళి చేసుకోడం. మంచి ఇంటెలిజెంట్‌ని పెళ్ళి చేసుకుంటే సరి? " అంది విసురుగా.

"అమ్మో భార్య ఇంటెలిజెంట్ అయితే మరీ తట్టుకోలేం! ఫూల్ అయితేనే కొంత నయం" భయం నటించాడు.

"మరీ అంత ఫూల్‌ని కూడా కాదు నేను. ఇలా వచ్చి నన్ను ఒప్పించాలని చూస్తున్నందుకు థాంక్స్. కానీ ఎన్నివిధాలుగా ఆలోచించినా మనం పెళ్ళిచేసుకోకపోవడమే మంచిదనిపిస్తోంది. మనం ఫ్రెండ్స్‌లా విడిపోదాం!" చెప్పింది.

"విడిపోవడం నాకిష్టంలేదు. అంత అవసరం నాకేం కనిపించడంలేదు. ఏదైనా స్ట్రాంగ్ పాయింట్ ఉంటే చెప్పు"

"నేనంటే నీకంత ఇష్టమా? " అడిగింది.

"ఇంత అని చెప్పలేనుగానీ ఇష్టమే"

"మరి నా కోసం మీ వాళ్ళని ముఖ్యంగా మీ అమ్మగారిని వదిలి రమ్మంటే ఓకేనా!"

"లేదు. చచ్చినా రాను. మన పెళ్ళికీ అమ్మని వదలడానికీ ఏమిటి లింకు? "

"మరి నేను అమ్మని వదిలెయ్యాలా? "

"అని నేను అన్నానా? నువ్వేదో ఊహించుకునేస్తే ఎట్లా? మీ అమ్మకోసం పెళ్లి మానేస్తే ఆవిడ సంతోషించదు. పైగా తనవల్లే నీ లైఫ్ పాడయిందని జీవి

తాంతం కుమిలిపోతారు. ఇక నీమాట కొస్తే ఇప్పుడున్న ఆవేశం నాలుగురోజులు పోతే ఉండదు. అప్పుడు బాధపడతావు. ఇదంతా ఎందుకసలు? మనిద్దరమూ ఈ చిన్న ప్రాబ్లమ్‌కి సొల్యూషన్ ఆలోచించ లేమా! ఇవన్నీ నువ్వు నాతో డిస్కస్ చేసి నేను కాదంటే, అప్పుడు నీ ఇష్టమొచ్చినట్లు పెళ్ళి మానేసినా అర్థం ఉందిగానీ అస లేమీ లేకుండా నాకు పెళ్ళొద్దనేస్తే అంతా నీ ఇష్టమేనా? ఏదైనా ప్రాబ్లమ్ వస్తే పరి ష్కారం ఆలోచించాలి. అంతేగానీ వదిలేసి పారిపోతారా ఎవరైనా! నీలాంటి వాళ్ళు ఎదుటివాళ్ళని సలహా అడిగితే మంచిది!" మెత్తగా చీవాట్లు పెడుతున్నాడు.

"ఇదేమంత ఈజీ ప్రాబ్లమ్ కాదు. పెళ్ళ య్యాక నీ ఉద్యోగం మాన్పించేస్తాం అంటున్నారు మీరంతా. మరి నాకు ఇన కమ్ లేకపోతే అమ్మనెలా చూసుకుం టాను? " ఉక్రోషంగా అడిగింది.

"అదా నీ భయం. ఆ మాటకొస్తే నాకూ లేదు ఇన్‌కమ్. జాయింట్ బిజినెస్ కాబట్టి ఇంట్లో అందరికీ సమానంగానే హక్కులుం టాయి. అది అండర్‌స్టాండింగ్ అందరి మధ్యనా. ఉద్యోగం వదిలేసినంత మాత్రాన బికారివైపోవు, నీకూ హక్కుం టుంది"

"మరి మీ పేరెంట్స్ ఒప్పుకుంటారా? మీ ఇంట్లోవాళ్ళు వద్దంటే" అడిగింది.

"ఇదుగో ఇలా మాట్లాడితేనే నాకు నవ్వొ స్తుంది. పెళ్ళయ్యాక అది నీ ఇల్లేగా. నీ సమస్య అందరి సమస్య అవుతుంది. మిగి లిన అన్ని ప్రాబ్లమ్స్ సాల్వ్ చేసుకున్నట్లు ఇదీ సాల్వ్ చేస్తాం!" చెప్పాడు.

"ఏమో ఇంత జరిగాక పెళ్ళయ్యాక అడ్జస్ట్ అవడం కష్టమేమో? " అంది.

"సరే. మరి ఫ్యూచర్‌లో అసలు పెళ్ళి చేసుకోవా? ఒంటరిగా ఉండిపోతే మాత్రం ప్రాబ్లమ్స్ రావా? వస్తే సాల్వ్ చేసు కోవా? కాదు ఇంకో వ్యక్తిని పెళ్ళి చేసు కుంటే మాత్రం వాళ్ళతో అడ్జస్ట్ అవ్వవా? అవకుండా జరుగుతుందా? " నిలదీశాడు.

మౌనంగా ఉండిపోయింది.

"చూడు హనీ! లైఫ్ అంటేనే అడ్జస్ట్ మెంట్. ఒక్క విషయంలో నాకు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ప్రతి వ్యక్తికీ లైఫ్‌లో ఎంతోమంది వ్యక్తులతో సంబంధ బాంధవ్యాలుంటాయి. కొన్నాళ్లు ఏవో గొడ వలొచ్చినా తర్వాత సర్దుకుపోతారు. రాక పోకలుండకపోవచ్చు మాటలూ ఉండక పోవచ్చు కానీ తెగతెంపులు చేసుకోరెవరూ! తల్లిదండ్రులకూ, పిల్లలకు, తోడబుట్టిన వాళ్లకూ మనస్పర్థలు వస్తాయి. సూర్యుడి వెలుగురాగానే పొగమంచు కరిగిపోయి

## కొత్తగాలి... 

**ఎదురు పడితే**
**ముఖం చెల్లదు**
**నెట్ ఫేస్‌బుక్కుల్లో మాత్రం**
**ఆప్యాయతలు.. పలకరింపులు**

– ప్రభాకర్ తల్లాప్రగడ,
హైదరాబాద్

నట్లు కరిగిపోతాయి. ఇంకే రిలేషన్‌షిప్ లోనూ లేనిది జీవితాంతం కలిసి బతకా ల్సిన దంపతుల మధ్యలోనే ఈ విడాకులు, గొడవ. మన సంప్రదాయంలో పెళ్ళంటే నూరేళ్ళ పంట అనీ, ఏడు జన్మల అనుబం ధమనీ అంటారు. అవన్నీ కల్పితాలేనా? నాకలా అనిపించడంలేదు. నువ్వు కాదను కున్నంత ఈజీగా నేను కాదనలేకపోతు న్నాను. నిశ్చితార్థం అయ్యాక వద్దనుకునే టంత కారణం నాకేం కనిపించడంలేదు.

మనిద్దం పెళ్ళి చేసుకుంటే హాయిగా బతగ్గలమని నాకు పూర్తి నమ్మకం ఉంది.

మిగిలినవన్నీ పక్కనబెట్టి నువ్వు మరోసారి ఆలోచించు. ఈ మనిషితో జీవితం పంచుకోవడం నాకిష్టం లేదు అనుకుంటే ఇంతమటుకీ నేను చెప్పిందంతా ఉత్త వేస్ట్ అని అనుకుంటే ఆ మాటే చెప్పేయ్" అన్నాడు.

దివ్యకి ఏడుపొచ్చేసింది.

"ఏడవడం ఎందుకు? ఇప్పుడు నేనేం అన్నాను? నా మనసులో మాట చెప్పానంతే. నిన్నేం ఫోర్స్ చెయ్యడం లేదుగా!"

"నాకెందుకో దిగులుగా ఉంది. ఏడుపొస్తోంది. ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు. బుర్రంతా బ్లాంక్ అయిపోయింది" అంది కళ్ళు తుడుచుకొంటూ.

"ఇలాంటప్పుడు నీకు కోపం వస్తే నాకు

> **కొత్తగాలి...**
>
> **మెరిసీ... కురిసీ**
> **అలసీ సొలసీ**
> **నల్లమబ్బులు**
> **తెల్లబోయాయి**
>
> – పినిశెట్టి శారద,
> రాజమండ్రి

డేంజరుగానీ బుర్ర బ్లాంక్ అయిపోతే శుభసూచకమే. ఏం చెయ్యాలో నన్నడుగు నేను చెప్తా? " అన్నాడు.

"ఏం చెయ్యను? " బేలగా అడిగింది.

జేబులోంచి ఉంగరం తీశాడు. "ఇదుగో నువ్వు వాపస్ ఇచ్చిన రింగ్. ఆ చెయ్యి ఇలా ఇవ్వు" అన్నాడు. దివ్య రియాక్ట్ అయ్యేలోగా తనే చెయ్యి అందుకుని ఉంగరం తొడిగాడు.

"ఇప్పుడు చూడు నీ బుర్ర దివ్యంగా పని చేస్తుంది" అన్నాడు.

మళ్లీ ఏడ్చేసింది.

తలనిమిరాడు. అమాంతం అతన్ని కావలించుకుని బావురుమంది దివ్య.

"ఏవిటదంతా దుఃఖమే. అయితే మళ్లీ ఆ ఉంగరం వాపస్ తీసేసుకోనా? " అల్లరిగా అడిగాడు.

"ఐ యాం సారీ శ్రీరామ్!" ఇంకా వెక్కుతూనే ఉంది.

"మన్లో మనకు సారీ ఎందుకు? జరిగిందంతా మర్చిపో. అనవసరంగా కంగారుపడిపోయావు. ఇందులో నా పొరపాటూ ఉంది. నీకంత కష్టం వచ్చినప్పుడు నేను వెంటనే వచ్చి నీపక్కనుంటే నీకు ధైర్యంగా ఉండేది. ఏవో ఆచారాలని, అమ్మావాళ్లు వద్దన్నారని ఆగిపోయాను. అందుకే ఈ గొడవంతా వచ్చింది" అన్నాడు.

"మరి ఆంటీ ఏమి అనరా? "

"ఏమీ అనదు. ఏ తల్లైనా కోరుకునేది బిడ్డ సంతోషం. మా అమ్మా అంతే. ఏదో ఆవేశపడింది. పద ఇంటికి వెళ్దాం? "

"ఇప్పుడా? " ఆమె భయం తీరలేదింకా.

"ఇప్పుడే నాన్నగారికీ అమ్మకీ చెప్పేసి వచ్చాను. కాస్త ఆలస్యం అయినా దివ్యని తీసుకునే వస్తానన్నాను. వాళ్లకు నా మీద నమ్మకం ఉంది. వెయిట్ చేస్తూవుంటారు. పద" అంటూ లేవదీశాడు.

కార్లో కూడా అతని భుజంమీద తల వాల్చుకునే కూర్చుంది.

ఇంటికి వెళ్లారు. గేటు దగ్గరున్న దర్వాన్, తలుపుతీసిన నౌకరూ వినయంగా నమస్కారం చేశారు. మెట్లెక్కి శ్రీధర్ పడగ్గది ముందర ఆగాడు శ్రీరామ్.

మెల్లిగా తలుపు తట్టాడు. "కమిన్" అన్నాడు శ్రీధర్. తలుపు నెట్టుకుని లోపలికెళ్లాడు. వాళ్ళిద్దరూ మంచం మీద దిళ్ళు కానుకుని పడుకుని ఉన్నారు. ఎదురుగా టీవీలో వీళ్ళ ఎంగేజ్‌మెంట్ వీడియో.

తలొంచుకు నిలబడిపోయింది దివ్య. బెరుగ్గానే ఉంది ఇంకా. "దివ్యా! ఇట్రా!" అంటూ పిలిచింది సువర్ణ.

మెల్లిగా వెళ్లి ఆవిడ పక్కన కూర్చుంది. రెండు చేతులని దగ్గరికి తీసుకొని "పిచ్చి పిల్లా!" అంది సువర్ణ. ఆ ఒక్కమాటలో పశ్చాత్తాపం, మందలింపు, ప్రేమ అన్నీ ధ్వనించాయి. ఆవిడని కావలించుకుని ఏడి చేసింది. శ్రీధర్ ఆదరంగా తలనిమిరాడు.

"సో! ఆర్యూ హేపీ మై ఛెయిల్డ్!" అన్నాడు. మెల్లిగా తేరుకుంది దివ్య. అప్పుడు గుర్తొచ్చింది. "అయ్యో అమ్మ కంగారు పడుతూవుంటుంది. ఫోనైనా చెయ్యలేదు" అంది.

నవ్వేశాడు శ్రీరామ్.

"సాయంత్రం ఆంటీ దగ్గరికి వెళ్ళాను. ఆవిడతో మాట్లడాకే నీ దగ్గరికి వచ్చా" అన్నాడు.

"మరైతే ఈ విషయం అమ్మకి చెప్పాలి. ఆవిడ చాలా సంతోషిస్తుంది. రోజూ నన్ను తిట్టిపోస్తోంది. ఇదంతా తన వల్లనే జరిగిందని కుమిలిపోతుంది. ఇప్పుడే ఫోన్ చేస్తా!" అన్నాడు.

మళ్ళీ నవ్వేశాడు శ్రీరామ్. "నీ సాటిస్ ఫ్యాక్షన్ కోసం చెయ్యి. నేను ఆంటీతో ముందే చెప్పేశాను. దివ్యని ఒప్పిస్తాను. వినకపోతే నాలుగు తగిలించైనా సరే పెళ్ళి చేసుకుంటా.. మీరు నిశ్చింతగా ఉండండని చెప్పేశా!" అన్నాడు.

వెంటనే శాంతకి ఫోన్ చేసింది.

"ఎక్కడున్నావ్ దివ్యా!" అడిగింది శాంత ఆత్రంగా.

"శ్రీరామ్ వాళ్లింట్లో" అనేసి నాలిక కరుచుకుని "మా ఇంట్లో!" అంది దివ్య.

ఆవిడ తృప్తిగా ఊపిరి పీల్చుకుంది.

"పదండి భోంచేద్దాం" లేచింది సువర్ణ.

"ఏడిచేడ్చి మొహం కందిపోయింది. పద కాస్త ఫ్రెష్ అవ్వు" అంటూ తన గది లోకి తీసుకువెళ్లాడు శ్రీరామ్.

దివ్య బ్యాగ్‌లోంచి సెల్ మోగుతోంది. శ్రీరామ్ తీశాడు. సత్య దగ్గర్నించీ కాల్.

బటన్ నొక్కగానే "హల్లో దివ్యా!" అన్నాడు సత్య.

"దివ్య లోపలుంది సత్యాగారూ!" అన్నాడు శ్రీరామ్.

"ఓ. మీరెవరూ? " అడిగాడు.

'నేను. శ్రీరామ్‌ని.'

తడబడిపోయాడు సత్య. "మీరు ఎప్పుడొచ్చారు హైద్రాబాద్‌కి? "

"మధ్యాహ్నం వచ్చా సత్యా. మీరు దివ్యకి చాలా హెల్ప్ చేశారు. అందుకు స్పెషల్ థ్యాంక్స్ చెప్పాలి మీకు" అన్నాడు శ్రీరామ్.

పరిస్థితి అర్థమైపోయింది సత్యకి. ఏం జరిగిందో అర్థం అయిపోయింది. ఎలా జరిగిందో తర్వాత దివ్యనడగాలి అనుకున్నాడు. "ఎందుకండీ థ్యాంక్స్ నా ఫ్రెండ్‌కి ఆ మాత్రం చెయ్యలేనా? " అనేశాడు.

"సరే దివ్యకి చెప్తా! షి విల్ కాల్ యూ!" అన్నాడు శ్రీరామ్.

"ఓకే, బై" అనేశాడు సత్య.

ఆవాళ హాలీడే. దివ్యని వీడియో చాట్‌కి రమ్మందామని కంప్యూటర్ ముందు కూర్చొని ఫోన్ చేశాడు.

ఫోన్ పక్కన పడేసి సిస్టమ్‌లో స్క్రీన్ సేవర్ మీద ఉన్న దివ్య ఫొటోని మార్చేసి తన ఇష్టదైవం అమ్మవారి ఫొటో సేవ్ చేసుకున్నాడు. ఫోన్ తీసి అమ్మతో కాసేపు మాట్లాడాడు, ఎందుకో అలజడిగా ఉందని.

యూట్యూబ్‌కి వెళ్లి తాళికట్టు శుభవేళ పాట పెట్టుకున్నాడు. 'ఏనాడు ఏ జంటకో రాసి వున్నాడు విధి ఎప్పుడో..'

మధురంగా వినిపిస్తుంది యస్.పి. వాయిస్.

వింటూ చిన్నగా నవ్వుకున్నాడు. 'ఆల్ ది బెస్ట్ దివ్యా! విష్ యూ ఎ హేపీ లైఫ్' అనుకున్నాడు మనస్ఫూర్తిగా. Ⓒ

# ఇప్పటికీ అదే పరిస్థితి!


తిరుమలశ్రీ

**'తిరుమలశ్రీ'గా పేరుపొందిన పామర్తి వీర వెంకట సత్యనారాయణకి 'విశ్వమోహిని' అనే మరో కలంపేరూ ఉంది. కేంద్ర శాస్త్ర - సాంకేతిక మంత్రిత్వశాఖలో పనిచేసిన ఆయన ఉద్యోగ రీత్యా వివిధ ప్రాంతాలు తిరిగారు, విశేష అనుభవాల్ని చవిచూశారు. పాతికేళ్ల క్రితం తనకెంతో పేరు ప్రతిష్ఠలు తెచ్చిన 'ఆడపిల్ల తండ్రి' కథ వెనక కథను 'చతుర' పాఠకులకోసం ఇలా చెప్పారాయన...**

కథలు ఎక్కడినుంచి వస్తాయి? జీవితం నుంచే కదా. నేను రాసిన 'ఆడపిల్ల తండ్రి' కథ కూడా అంతే. నిజంగానే అదో తండ్రి కథ. నాకు తెలిసిన తండ్రి కథ. ఎప్పుడో పాతికేళ్ల కిందట వెలువడిన ఆ నా కథకు ప్రేరణ సుందర్రావ్!

అతని పేరు సుందర్రావ్ (పేరు మార్చాను). నా సహోద్యోగి. పెళ్లీడొచ్చిన ముగ్గురు కూతుళ్ల తండ్రి. అమ్మాయిలంతా తెల్లగా, చక్కగా ఉండేవారు. అయినా, కట్నం బెడద కదా. వారికి పెళ్లిళ్లు చేయడం గడ్డు సమస్యగానే ఉండేది.

కానీ, అతను తెలివైనవాడు. అప్పట్లో మా సంస్థ కొన్ని ఉద్యోగాల ఖాళీల్ని ఎప్పటికప్పుడు కొత్తవారితో భర్తీ చేస్తుండేది. వారు మా కార్యాలయానికి రాగానే, వివరాలన్నీ దగ్గరుండి పరిశీలించేవాడు సుందర్రావ్. తగిన యువకుణ్ణి ఎంచుకుని, పరిచయం పెంచుకునేవాడు. ఇంటికి భోజనానికి పిలిచేవాడు. అతనితో స్నేహంచేసి సన్నిహితంగా మెలిగేలా కూతుర్ని ప్రోత్సహించేవాడు. అలా ఇద్దరు కూతుళ్ల పెళ్లిళ్లు జరిపించేశాడతను.




మూడో కూతురు పెళ్ళి విషయంలో కూడా అదే సూత్రాన్ని అతను పాటించాలనుకున్నాడు. కానీ ఆ అమ్మాయి మటుకు బయట మరెవరో కుర్రాడిని ప్రేమించింది, అతనితో వెళ్లిపోవడానికీ సిద్ధమైంది. గమనించిన సుందర్రావ్ ఆమె ప్రయత్నానికి చెక్ పెట్టాడు. తాను ఎంచుకున్న యువకుడితో పెళ్ళి జరిపించాడు. అక్కచెల్లెళ్లు ముగ్గురిలోనూ కూతుళ్ల పెళ్ళిళ్ళు చేయడానికి అతను ఎంచుకున్న విధానం సరైందా? కాదా? అదే నన్ను ఆలోచింపచేసింది. అంతకుమించి, అతను ఆడపిల్లల తండ్రి, సగటు మనిషి. ఆ అమ్మాయిలకు కట్నాలుపోసి వివాహాలు చేయలేడు. ఆ నిస్సహాయతా ఏదోవిధంగా తన బాధ్యత నెరవేర్చుకోవాలన్న తపనా అర్థమవుతూనే ఉంటుంది. అదే ప్రయత్నంలో వంశ గౌరవానికి, కుటుంబ పరువుకు ఆఖరిపీట వేయడమూ కనిపిస్తుంది! ఈ కథావస్తువు

ను తీసుకుని ఓ కథ రాయాలని అనిపించింది. ఆ ప్రయత్నమే 'ఆడపిల్ల తండ్రి'! ఒడిషాలో పని చేస్తున్న కాలంలో ఒక్క ఊపులోనే ఈ కథను పూర్తి చేశాను. రాయగానే ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపేశాను.

### తొలి ప్రచురణ

పంపిన రెండు నెలల తర్వాత ఆ పత్రికలో 1986 ఆగస్టు నెలలో ప్రచురితమైంది. ఎందరెందరో పాఠకుల ప్రశంసలందుకుంది. పెద్ద రచయితలు కూడా మెచ్చుకుంటూ ఉత్తరాలు రాశారు.

### నాలుగు భాషల్లోకి..

'ఆడపిల్ల తండ్రి' కథ.. ఇంతటితో ఆగిపోలేదు. ఆ తర్వాత ఒకటీ రెండూ కాదు.. ఏకంగా నాలుగు భాషల్లోకి అనువాదమైంది. హిందీలో 'సరిత', తమిళంలో 'కుముదం', కన్నడంలో 'మంజరి', అలాగే మళయాళ పత్రికల్లో కూడా ప్రచురితమై ఆయా భాషల పాఠకుల్ని ఎంతగానో అలరించింది. మా కార్యాలయంలోని ఉన్నతాధికారులూ ఈ కథను ఆయా భాషల్లో చదివి ప్రశంసించారు. కథావస్తువు బాగుందని, కొత్తగా ఉందని స్వయంగా నాతో చెప్పారు.

### కథలోకి వెళ్తే..

కూతురు జయంతికి పెళ్లి చేయడమే తండ్రి నరహరికి సమస్య. ఆమె అందానికి మురిసిపోయినా, తెలివితేటలకు పొంగిపోయినా.. కట్నం ఇవ్వలేని కారణంగా పెళ్లి చేయలేకపోతున్న అసహాయుడతను. ఇంటిపట్టున ఉండి ఆమె ముఖం చూడలేక, ఎప్పుడూ ఊరుపట్టుకు తిరగడం అలవాటు చేసుకుంటాడు. పార్క్‌కి వెళ్ళి ఓ మూల బెంచీమీద కూర్చొని, వచ్చేపోయేవారిని చూస్తూ తన ఆలోచనల్ని మరిచిపోవడానికి ప్రయత్నిస్తుంటాడు. అక్కడే ఓరోజు అతనికి మూర్తి పరిచయమవుతాడు.

## అంతా వాస్తవ చిత్రణే

రచయిత అనుభవమే కథగా మారుతుందంటారు. 'ఆడపిల్ల తండ్రి' కథ వెనకా ఆ అనుభవమే ఉంది. కాబట్టే, జీవితానికి అద్దంపట్టేదిగా ఉందా కథ. అప్పట్లో ఇదో కొత్త ప్రయోగం. అది విజయవంతం కావడం, నలుగురి మెప్పు పొందడం ఎంతో ఆనందాన్ని ఇచ్చిందన్నారు రచయిత తిరుమలశ్రీ.

అలాగని అన్ని కథలకీ నిజ జీవిత సంఘటనలే మూలాధారంగా ఉండాలా? అంటే.. అవసరం లేదని ఆయన అభిప్రాయపడ్డారు. కాకపోతే, కథలోనిదంతా వాస్తవానికి చేరువగా ఉండాలి. అప్పుడే చదువరుల్ని స్పందింపచేస్తుంది, వారి మనసులో కలకాలం నిలిచిపోతుంది అంటారాయన.

సమాజ పరిస్థితిపై పాతికేళ్లక్రితం ఈ కథ వచ్చినా పరిస్థితిలో ఇప్పటికీ పెద్ద మార్పేమీ లేదు, రాలేదు. ఇదంతా 'నథింగ్.. బట్.. ఎ శాడ్ కామెంటరీ ఆన్ అవర్ సొసైటీ' అంటారీ రచయిత.

ఇద్దరి సమస్య వేరైనా, దారి భిన్నంగా ఉన్నా కష్టం మాత్రం ఒకటే! అందుకే ఒకరి బాధను మరొకరితో పంచుకుంటూ ఇద్దరూ సన్నిహితమవుతారు. మూర్తికి




సచిత్రవార పత్రికలో ఈ కథకు వేసిన చిత్రం

పాతికేళ్ళే. అంతకు రెట్టింపు వయసున్న వ్యక్తి నరహరి. అయినా ఉభయులకీ స్నేహం ఏర్పడుతుంది. బ్యాంక్ ఉద్యోగిగా ఉన్న మూర్తికి పెళ్లి ప్రయత్నాలు జరుగుతుంటాయి. అందం, ఉద్యోగం అన్నీ ఉన్నా దిగులుగా కనిపిస్తున్న ఆ యువకుడిని వివరాలడుగుతాడు నరహరి. వయసులో పెద్దవాడు, పైగా శ్రద్ధతో ఆరా తీస్తున్నాడనుకుని సమస్యని అతని ముందుంచుతాడు మూర్తి.

ఉన్నత కులానికి చెందిన ఓ అమ్మాయిని ప్రేమించిన మూర్తికి.. ఆమెతో పెళ్ళి ఓ సమస్య! ఎందుకంటే, ఆమె తండ్రి ఒప్పుకోడనేది మూర్తి భయం. ఏడాది క్రితం పరిచయమైన ఆమెతో తొలిచూపులోనే ప్రేమలో పడిన ఆ యువకుడు.. ఆమెనే చేసుకోవాలని నిశ్చయించుకుంటాడు. తండ్రి అనుమతి లేనిదే కుదరదంటుంది ఆ అమ్మాయి.




'ఈ కులమతాల పట్టింపులేమిటి? అని ఆక్రోశంతో నరహరిని ప్రశ్నిస్తాడు మూర్తి. అప్పుడనుకుంటాడు నరహరి.. తనకీ అలాంటి పట్టింపులున్నాయేమో అని! 'మూర్తివంటి వరుడు కట్నం లేకుండా లభిస్తే.. కులమతాలంటూ నేను ఈ అవకాశాన్ని వదులుకుంటానా?' అని తనను తాను ప్రశ్నించుకుంటాడు.

'ఇంతకీ ఎవరా అమ్మాయి?' అని ఆరా తీసిన నరహరికి ఆమె పేరు జయ అనీ, ఇల్లు దేవాలయం వీధిలో ఉందనీ తండ్రి బడిపంతులుగా పనిచేసి ఏడాదిక్రితమే రిటైరయ్యాడనీ తెలుస్తుంది. 'వాళ్ల ఇల్లు ఎక్కడ'ని అడుగుతాడు. 'వీధి చివర బొప్పాయి చెట్లున్న పాత పెంకుటిల్లు' అనే సమాధానం రావడంతో, నరహరి గుండె గతుక్కుమంటుంది. కారణం.. ఆ చిరునామా అతనిదే!

ఇంటికి తిరిగొచ్చిన అతను.. కూతురు వంక కొత్తగా చూస్తాడు. ఆమె ప్రేమలో పడిందా? స్నేహితురాలి ఇంటికి వెళ్తున్నానని చెప్పి, రోజూ మూర్తిని ఎక్కడో కలుసుకుంటోందా? పెళ్లికి తండ్రే అడ్డుగా ఉన్నాడని బాధపడుతోందా? ..ఇలా ఎన్నో ఆలోచనలతో మథనపడతాడు నరహరి.

ఆ తర్వాత కూడా పార్కులో మూర్తిని అతను కలుసుకుంటూనే ఉంటాడు. 'మూర్తి ప్రేమిస్తోంది నా కూతురినే! కానీ అతనికా సంగతి తెలియద'ని అనుకుంటూ ఉంటాడు. నరహరిలో ఇంకా ఆలోచనలే. 'కూతురుకి కులాంతర వివాహం చేయాలా వద్దా? ఆ పెళ్లి చేయకుంటే, ఆమె భవిష్యత్తుకి నేనే అడ్డంకిగా మారినట్లు కాదా? ప్రేమిస్తున్న మూర్తికి ఇచ్చి చేయడంకంటే మంచి పనిని ఈ జన్మలో చేయలేను! కూతురుకి కులాంతర వివాహం చేసే తెగింపూ లేదు. ఎలా?' అని సతమతమవుతాడతను.

కూతురుకి, మూర్తికి పెళ్లిచేయడం నరహరికి ఇష్టమే. కానీ ఆ విషయాన్ని బహిరంగంగా ఒప్పుకోలేడు! వారి ప్రేమ ఫలించాలని మాత్రం కోరుకుంటాడు, అందుకే మూర్తిని అతను నిరుత్సాహపరచలేదు. కూతురుని మందలించనూ లేదు!

నరహరి ఆరాటం గమనించి మూర్తి అడుగుతాడు 'జయ కుటుంబం మీకు తెలుసా?' అని. అతను 'తెలిసినట్లే ఉంది' అంటూ తప్పించుకుంటాడు. మరో రోజున 'మేమిద్దరం వెళ్లిపోయి గుళ్లో పెళ్లి చేసుకుందామా అనిపిస్తోంది!' అంటాడు మూర్తి. 'కానీ ఆమె అందుకు ఒప్పుకోవడం లేదు.. జయ తండ్రి మీకు తెలుసేమో కదా! ఆయన మా పెళ్లికి ఒప్పుకునేలా చేయండి' అంటూ ప్రాధేయపడతాడు.

'ఆయనతో అంత పరిచయం లేదు. అయినా ప్రయత్నిస్తాను' అని చెప్పి వచ్చేసిన నరహరికి, వారందాకా మూర్తి

పార్కులో కనిపించడు! 'నేనెవరో ఆ కుర్రాడికి తెలిసిపోలేదు కదా!' అనుకున్న అతనిలో అంతర్మథనం తీవ్రతరం అవుతుంది. ఇంట్లో కూతురు ప్రవర్తనని గమనిస్తే, ఏ మార్పూ కనిపించదు. 'ఎంతైనా తెలివిగలది నా కూతురు!' అనుకుంటాడు నరహరి. అయితే ఆ వారం రోజులూ మిత్రురాలి ఇంటికంటూ ఆమె వెళ్లి వస్తుంటుంది. 'అంటే.. మూర్తి ఊళ్లో ఉన్నట్లే' అని తనకు తాను సమాధానపడతాడు.

ఇంకో రోజు.. పార్కులో నరహరికి మూర్తి కనిపించి పలకరిస్తాడు. 'విసుగెత్తి తన పెద్దల ఒత్తిడికి లొంగిపోయాడా? వాళ్లు చూపిన పిల్లనే పెళ్లాడబోతున్నాడా?' అనిపించి గుండెలు వేగంగా కొట్టుకుంటాయి. 'బదిలీ కోసం హెడ్డాఫీసుకి వెళ్లాను, అందువల్లే మిమ్మల్ని కలవలేకపోయాన'ని చెప్తాడు మూర్తి. జయని పెళ్లికి ఒప్పించగలిగానని, తనతో వచ్చేస్తోందని, ఈ ఊళ్లో ఉండకుండా ఇక హెడ్డాఫీసుకే వెళ్లిపోతున్నానని వివరిస్తాడు. 'రేపు రాత్రికే వెళ్లిపోతున్నామ'ని చెప్పడంతో, నరహరిలో సంభ్రమం కలుగుతుంది.

అన్యమనస్కంగానే మూర్తిని అభినందించి, ఇంటికి తిరిగొచ్చిన అతనికి వేదన ఎక్కువవుతుంది. కూతురు తనకు చెప్పకుండా అతనితో వెళ్లిపోతే, నలుగురూ ఆడిపోసుకుంటారనే క్షోభ కలుగుతుంది. 'కులంవాళ్లని కాదని ఈ పెళ్లి చేయలేను, ఇద్దరూ అలా పరాయిచోట పెళ్లిచేసుకోవడమే మంచిద'ని తనకు తాను సర్దిచెప్పుకుంటాడు. కొన్నాళ్ల తర్వాత తిరిగొచ్చి అమ్మాయి తండ్రి ఆశీస్సులు పొందుతామన్న మూర్తి మాటలు గుర్తొచ్చి స్థిమితపడతాడు నరహరి.

ఆ రోజంతా కూతురు మామూలుగానే ఉంటుంది! రాత్రి తొందరగా భోజనంచేసి నిద్రమాత్ర వేసుకుని పడుకున్న నరహరిని తెల్లవారుజామున నిద్రలేపుతుంది భార్య. 'ఈ చోద్యం విన్నారా? ఈ వీధికి పశ్చిమపు చివర పెంకుటింట్లో ఉండే రిటైర్డ్ హెడ్‌మాస్టర్ శంకరయ్యగారి కూతురు.. రాత్రి ఎవరో కులంకానివాడితో పారిపోయిందట' అంటుంది. అతను అదిరిపడుతూ 'జయంతి ఎక్కడ?' అని అడుగుతాడు. 'ఇంట్లోనే ఉంది' అంటుందామె!

నరహరికి చివరకు అర్థమవుతుంది.. తన కూతురు జయంతి అయితే.. మూర్తి ప్రేమించిన అమ్మాయి పేరు జయలక్ష్మి అని! జయ.. జయ.. అంటే తన కూతురే అనుకున్నాడు నరహరి. ఆమెని అలా పిలుస్తున్నాడనుకుని పొరబడ్డాడు. కానీ శంకరయ్య అమ్మాయి పేరు కూడా అదే. వాళ్లు ఉండేదీ తన వీధిలోనే. అయితే ఆ ఇల్లు.. వీధికి పడమట, తను ఉంటోంది తూర్పున! శంకరయ్య కూడా తనలానే రిటైరయ్యారు. ఆ ఇంట్లోనూ బొప్పాయి చెట్లున్నాయి. అంటే మూర్తి చెప్పిన చిరునామా వరకూ సరైందే. వ్యక్తులే వేరు!

నరహరి ఇప్పుడు మూర్తిని అభినందిస్తున్నాడా? అసూయతో శపిస్తున్నాడా? అతని మనసుకే తెలియాలి మరి!

సేకరణ : శరత్‌బాబు

## బహుముఖ ప్రతిభ

తెలుగుతో పాటు ఆంగ్ల, హిందీ భాషల్లో సైతం రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న 'తిరుమలశ్రీ'కి అరవై నాలుగేళ్లు. తొలి కథని పన్నెండో ఏట, తొలి నవలని పదిహేనో ఏట రాశారాయన.

ఆయన రచనల్లో కొన్ని దక్షిణాది భాషల్లోకి అనువాదమయ్యాయి. మరికొన్నింటికి జాతీయ ఆంగ్ల దినపత్రికల నుంచి బహుమతులు వచ్చాయి. ఆయన రాసిన పలు కథలు, నాటికలు, నాటకాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారమయ్యాయి. కొన్నింటిని ఆయనే స్వీయ దర్శకత్వంలో వేదికలమీద ప్రదర్శించారు, ఇంకొన్నింటిలో నటించారు. కార్టూన్లు, చిత్రలేఖనంలోనూ ప్రవేశమున్న తిరుమలశ్రీకి సంగీతమంటే ఇంకెంతో ఇష్టం.

# బ్రిటిష్ పాలకులకు సింహస్వప్నం

**ఉద్యమాలే ఊపిరిగా ప్రస్థానించి, పీడిత ప్రజల సమస్యలే కేంద్రంగా కావ్యరచన చేసి ఒడియా సాహిత్యానికి నూతన భావజాలాన్ని, శైలిని, అభివ్యక్తిని సంతరింపజేసిన గొప్ప వైతాళికుడు సచ్చిదానంద రావుత్‌రాయ్. సామాన్య మానవులు స్వేచ్ఛాపూర్ణంగా, ఆశావహులుగా జీవించే సమసమాజ స్థాపనకు కవితను సాధనంగా చేసుకున్న 'జనకవి' ఆయన. భారతీయ సాహిత్యాన్ని తన అమూల్య రచనల ద్వారా సుసంపన్నం చేసినందుకు ఆయన 1986లో జ్ఞానపీఠ పురస్కారాన్ని అందుకున్నారు.**



సచ్చిదానంద రావుత్‌రాయ్

డాక్టర్ సచ్చిదానంద రావుత్‌రాయ్ 1916 మే 13న ఒరిస్సా రాష్ట్రం పూరీ జిల్లా ఖుర్దాలో జన్మించారు. తండ్రి ప్రసన్నకుమార్ రావుత్‌రాయ్. బాల్యంలోనే రావుత్‌రాయ్‌కి తిరుగుబాటు తత్వం అలవడింది. ఖుర్దా ఉన్నత పాఠశాల విద్యార్థిగా 'వానరసేన'లో సభ్యుడయ్యాడు. అతని కార్యకలాపాల్లో విప్లవ వైఖరి గమనించి పాఠశాల నుంచి పంపివేశారు. కోల్‌కతాలో హైస్కూలు విద్య పూర్తిచేసి తదనంతరం కటక్‌లోని రెవెన్షా కళాశాలలో చదివి పట్టభద్రుడయ్యాడు. కర్షకోద్యమానికి నాయకత్వం వహించి జైలు శిక్ష అనుభవించాడు. 'గడజాత ప్రజామండళి' ఆందోళనలో ప్రముఖ పాత్ర వహించాడు. మార్క్స్ సిద్ధాంతాల పట్ల ఆకర్షితుడయ్యాడు. సమాజం గురించి, విలువల గురించి నిబద్ధతను ఏర్పరచుకున్నాడు. స్వాతంత్ర్యోద్యమంలో, రైతుల ఉద్యమాలలో, సంస్థానాధీశ్వరులకు వ్యతిరేకంగా సాగిన ప్రజా ఉద్యమాలలో క్రియాశీలకంగా పనిచేశాడు. త్రైమాసిక పత్రిక 'ఒడియా'కు, మరో పత్రిక 'దిగంత'కు సంపాదకుడుగా వ్యవహరించాడు. ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యుడిగా సేవలందించాడు. ఒరియా సాహిత్య అకాడమీ అధ్యక్షుడుగా విశిష్ట కృషి చేశాడు. రావుత్‌రాయ్‌కి సంస్కృతి, కళలపట్ల ప్రత్యేకాభిమానం. 'ఒడియా కళా-సంస్కృతి సంగ్రహాలయ్' స్థాపించాడు. కలకత్తాలో 1968లో జరిగిన అఖిలభారత కవుల మహాసభకు అధ్యక్షత వహించాడు.

ఉద్యోగంతోపాటు రావుత్‌రాయ్‌కి చిన్ననాటనే కవితావేశం అలవడింది. పాఠశాల విద్యార్థి దశలోనే కవితా రచన ఆరంభమయింది. పదహారో ఏటనే 'పాథేయ' అనే కవితా సంపుటిని వెలువరించి సచిబాబు (రావుత్‌రాయ్) అందరినీ విస్మయపరిచాడు. మరుసటి సంవత్సరమే 1933లో 'పూర్ణిమ' వెలువడింది. అప్పట్లో ఒరియా సాహితీ క్షేత్రంలో 'సబుజ' ధోరణి ప్రచారంలో ఉంది. ఈ రెండు సంపుటాలలో అక్కడక్కడ దీని ఛాయలు కనిపిస్తాయి. ఆయన కవితా దృక్పథం




తదనంతర కవితల్లో పూర్తిగా మారిపోయింది. 'పల్లీశ్రీ' ఇందుకు నిదర్శనం. ఒరిస్సా పల్లె జీవితానికిది అపూర్వ దర్పణం. కొత్త ఒరవడి దిద్దిన కవిత. రావుత్‌రాయ్ విప్లవశంఖం కవితల్లో పూరించడానికి ఎక్కువ కాలం పట్టలేదు. ప్రతీక వాదంతోపాటు 'గణకవి'గా ఉగ్రరూపం ధరించాడాయన. కవితలో ఎంతో వైవిధ్యం చోటు చేసుకుంది. మానవీయతకు ఆయన కవితలు పట్టం కట్టాయి. ఛందస్సుతో ప్రయోగాలు జరిగాయి. వచన కవిత అద్భుతంగా ఆవిష్కృతమయింది. కొత్త కొత్త భావచిత్రాలను, రూపకాలను కవితల్లో ప్రవేశపెట్టి తనదైన ముద్రను సుస్థిరం చేసుకు

న్నాడు. నిశిత భావాలు చోటు చేసుకున్నాయి. 'రాజజెమా' అనే కవితలో 'నేను ఇరవయ్యో శతాబ్ది దాటి వచ్చాను/ నా గళంలో రగులు తున్న విప్లవం/ నా భుజంమీద పాతశవం' అంటారు. రావుత్‌రాయ్ తాను శ్రామిక, ప్రజా కవినని ఒక కవితలో ఇలా బహిర్గతం చేశారు. 'నేను శ్రామిక కవిని/ లేఖినిని ఆయుధంగా ధరించి నిలుచున్నాను/ జనావళి ఆత్మత్యాగాల నుంచి లేచి/ శిరసెత్తి నిల్చునే సుదినం వస్తుం దని/ నా కళ్ళలో స్వప్నాన్ని నింపుకున్నాను/ స్వాతంత్ర్య భానూదయమవుతుంది/ నా కవి లే ఖిని మనుష్యులపై విశ్వాసంతో వారి గురించి/ నూతనాధ్యాయాన్ని తప్పక రచిస్తుంది'. విప్లవ కవితా రచనలో ఆయన భావ నైశిత్యం, విప్లవ శంఖానాదం అసమానాలు. పోలీసు తుపాకికి జంకేది లేదని ఎలుగెత్తి చాటిన కవిత. "మార తుజేతే గుళి/ మరిబు పఛే డరిబునాహి/ పతే యిదేయి ఛాతిరహాడ హోయిబు ఆగభర...' (గుళ్ళవర్షం కురిపించు/ మేం మరణానికి సిద్ధం/ భయంలేదు మాకు/ గుండె చూపుతాం ముందు కురుకుతాం) దీనిని ఉద్యమకారులు రణగీతంగా పాడేవారు. రక్తశిఖ, బాజీరావుత్, పాండూలిపి, భానుమతిర దేశ్, హసంత్, స్వాగత్, అశియార స్వప్న మరికొన్ని కావ్యాలు, కవితా సంపుటాలు (18) ఆయన కలం నుంచి జాలువారాయి. గద్య రచనలోనూ రావుత్‌రాయ్ సిద్ధహస్తుడు. కథలు, ఒక నవల కూడా రచించారాయన. ఛాయ్, మసాణిర ఫుల, మాటీర తాజ్ వంటివి ఆయన కథా నిర్మాణ గరిమకు నిదర్శనాలు. ఒరియా నవల ప్రక్రియను 'చిత్రగ్రీబ' కొత్త మలుపు తిప్పింది. పలాయనవాదుల్ని ఈ నవల తీవ్రంగా నిరసించింది. వ్యవహారిక శైలికి పట్టం కట్టింది. మానవతావాదానికి పెద్దపీట వేసిన నవల యిది. విచిత్రమేమంటే ఆయన కళాశాల విద్యార్థి దశలోనే ఈ నవలను రచించాడు. ఇది ఒరియా నవలా జగత్తులో మైలురాయిగా నిలిచిపో యింది. రావుత్‌రాయ్ పరిశోధనాత్మక రచనలు కూడా చేశాడు. 1972లో వెలువడిన 'సాహిత్యరే మూల్యబోధ్' అనే గ్రంథంలో ఆయన భారతీయ సాహిత్యాన్ని సాకల్యంగా విశ్లేషించాడు. కొన్ని నాటికల్ని వెలువరించాడు.

రావుత్‌రాయ్ సాహితీ సృజనను మూల్యాం కనం చేస్తున్నప్పుడు అగ్రస్థానంలో నిలిచి జ్ఞాన పీఠ పురస్కార ప్రదానానికి మార్గం సుగమం చేసింది ఆయన దీర్ఘ కవిత 'బాజీ రావుత్'. ఈ వీరగాథ 1939లో ప్రచురితమైంది. హరీంద్రనాథ్ చటోపాధ్యాయ దీన్ని ఆంగ్లంలోకి అనువదించ డంతో దేశవ్యాప్త ప్రఖ్యాతి లభించింది. బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిపిన పోరాటంలో పన్నెండేళ్ళ బాలుడు బాజీ తుపాకీ గుళ్ళకు బలి కావడం దీని ఇతివృత్తం. నవతరానికి అనూహ్య స్పందన ఇచ్చిన కావ్యమిది. ఒరిస్సాల్లో ఇరవై అయిదుకు పైగా స్వతంత్ర సంస్థానాలుండేవి. ఢెంకానాళ వాటిలో ఒకటి. నీలకంఠపురంలోని నిరుపేద ఖండాయతుల కుటుంబంలో పుట్టిన వాడు బాజీరావుత్. తల్లి ధాన్యం దంచి కొంత సంపాదించేది. బాజీ ఏటి పడవ నడిపి కుటుంబ పోషణకు తోడ్పడేవాడు. అది 1938, అక్టోబరు 10. కారుచీకటి చలిరాత్రి. వర్షం కురుస్తోంది. అలిసిపోయి బాజీ పడవపాకలో నిద్రపోతు న్నాడు. ఆ బాలుడు ప్రజామండళి బాలయో ధుడు. రేవు కాపలా కాయడం అతని వంత యింది. అర్ధరాత్రి దర్బార్ పోలీసులు భుబన గ్రామంలో తుపాకులు పేల్చి తిరిగి వస్తున్నారు. బ్రాహ్మణి నదిని దాటించమని బాజీరావును అడి గారు. 'ప్రజామండళి ఆదేశం లేదు. పడవ వద లను' అని కచ్చితంగా చెప్పాడు. వెంటనే తుపాకి గుండు అతని తలను తీవ్రంగా గాయపరిచింది. బాజీ భయపడలేదు. బలం కూడగట్టుకుని ప్రజా మండళి యోధుల్ని పిలిచాడు. కొందరొచ్చారు. పోలీసులు పడవ మోకు కోసి పడవను ముందుకు నడుపుతూ గుళ్ళవాన కురిపించారు. బాజీతో పాటు మిగిలినవారు ఆహుతయ్యారు. 'చీకటి రాజ్యం/ సడిలేని నడిరేయి/ ఏడుగురి ఉడుకురక్తంతో బ్రాహ్మణి నది/ క్షణంలో ఎరు పెక్కి పరుగులు తీసింది' అని కావ్యాంతంలో అంటారు. ఇది ఒరియా మహాకావ్యం.

రావుత్‌రాయ్ గొల్లపల్లి రాకుమారి భూదేవిని వివాహం చేసుకుని తెలుగువారికి బంధువ య్యారు. అమెరికా, ఇంగ్లాండ్, జపాన్, న్యూజి లాండ్, ఇండొనేసియా, మలయా తదితర దేశా లలో జరిగిన సాహిత్య సభల్లో పాల్గొన్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, సోవి యట్‌ల్యాండ్ నెహ్రూ అవార్డు, కేంద్ర ప్రభుత్వం నుంచి 'పద్మశ్రీ' గౌరవం, బరంపురం, ఆంధ్ర విశ్వవిద్యాలయాల నుంచి గౌరవ డాక్టరేట్లు అందుకున్నారు. ఆయన 2004 ఆగస్టు 21న పర మపదించారు. 'కవులకు కవి'గా సాహితీలోకం ఆయనకు నీరాజనాలర్పించింది.

*– గోవిందరాజు రామకృష్ణారావు*

# రచయితలకు, అనువాదకులకు, కార్టూనిస్టులకు
# సూచనలు

★ ఇతివృత్తంలో నూతనత్వం, రచనా సంవిధానంలో వైవిధ్యం గల తెలుగు కథలనూ, అనువాద కథలనూ 'విపుల' ఆహ్వానిస్తున్నది. హాస్య వ్యంగ్య రచనలకు ప్రత్యేక ప్రాధాన్యత. ప్రచురించే ప్రతి తెలుగు కథకు రూ. 500/- పారితోషికం ఉంటుంది.

★ ప్రచురించిన అనువాద కథకు పారితోషికంగా మూల రచయితకు రూ. 250, అనువాదకునకు రూ. 350 లభిస్తుంది. అనువాద కథలు పంపే వారు ఆయా మూల భాషా రచయితల నుండి లిఖితపూర్వక అనుమతి పొంది కథతోపాటే అనుమతి పత్రం కూడా జతపర్చాలి. మొదటి షీటు లోనే 1. మూలభాష 2. ఆ భాషలో ఆ కథ పేరు 3. రచయిత పేరు, చిరునామా 4. ఆ కథను ప్రచురించిన పత్రిక లేదా సంకలనం పేరు, తేదీ 5. ప్రచురణకర్తల చిరునామా 6. అనువాదకుని చిరునామా తెలియజేయాలి.

★ అనువాదకులు మూల రచయిత అనుమతి పొందలేని సందర్భాలలో పై వివరాలు తెలిపితే మేమే అనుమతి పొందగలం.

★ అనువాదానికి ఎన్నుకునే కథలు సమకాలీన రచయితలవే అయితే బాగుంటుంది. తెలుగు పాఠకులకు సుపరిచితులయిన ప్రసిద్ధుల కథలు పంపవద్దని మనవి.

★ ప్రతి రచనకు తగిన స్టాంపులు అంటించి స్వంత చిరునామా గల కవరు జతపరచాలి. అలా జతపరచకపోయినా పోస్టులోగానీ, ఇతరత్రాగానీ రచనలు పోయినా మా బాధ్యత ఉండదు. పోస్టుకార్డులు జతపరచటం అనవసరం.

★ కార్టూన్లు 5×10.5 సెం.మీ. సైజుకు తగ్గించడానికి అనువయిన సైజులో డ్రాయింగ్ పేపరుపై ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి. కాప్షన్ స్పష్టంగా అర్థమయ్యేలా ఉండాలి. చుట్టూ బార్డర్ తప్పనిసరిగా ఉండాలి. ప్రచురించిన కార్టూన్‌కి రూ. 40 చొప్పున పారితోషికం ఉంటుంది.

★ కార్డు కథలు పంపేవారు విధిగా పోస్టుకార్డుపైనే రాసి పంపాలి.

# విపుల

'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500 082

ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

# మనసున ఉన్నదీ...



★ నాలుగేళ్ళుగా నేను చతుర అభిమాన పాఠకురాలిని. చతురలో నవలతో పాటు వుండే శీర్షికలన్నీ వేటికవే హైలెట్. మొదటి నుండీ ట్యాంక్‌బండ్ కథలు ఆసక్తిగా చదువుతున్నాను. ప్రతీ కథ సమస్య- పరిష్కారంతో సాగుతూ ఇంట్రెస్ట్ కలిగిస్తోంది. కాలాతీతం, కథ వెనుక కథ తదితర శీర్షికల ద్వారా గొప్ప గొప్ప రచయితలు, మేధావుల గురించి తెలియజేయడం చతురకే చెల్లింది. కొత్తగాలి చిరుకవితలు ముచ్చటగా వుంటున్నాయి.

*– కటకం మహాలక్ష్మి,* విజయవాడ-1

★ డిసెంబరు చతుర సంపూర్ణంగా, విశేషంగా వుంది. కీ.శే. కొండముదిగారి విశిష్ట నవల స్థాయికి తగ్గట్టు శీర్షికలన్నీ చాలా చాలా బాగున్నాయి. కొన్ని దశాబ్దాల కిందటి మేటి రచన ఉన్నవవారి మాలపల్లిని మళ్ళీ స్పృశించారు. మాకెంతో ఊరటగా అనిపించింది. తెలుగులో వచ్చిన గొప్పనవల మాలపల్లిని ఈ తరం పాఠకులు తప్పక చదివి తీరాల్సిందే. చతుర కతలు, నిన్నటి నిజాలు చాలా బాగుంటున్నాయి.

*– టి.యస్. వర్మ,* నిజామాబాద్

★ డిసెంబర్ సంచికలోని 'ఈషణత్రయం' నవల మమ్మల్నెంతో హాయిగా చదివించింది. వాస్తవిక పాత్రచిత్రణతో తెలుగుదనాన్ని ప్రతిబింబించారు రచయిత. కొత్తగాలుల ద్వారా వర్ధమాన కవులను ప్రోత్సహిస్తున్నందుకు ధన్యవాదాలు.

*–బి. సాయి, సిహెచ్. శ్రీధర్,* ఏలూరు

★ చతుర నవలకు ఎంతటి ల్యాండ్ మార్క్ ఉంటుందో శీర్షికలన్నీటికి అంతే ల్యాండ్‌మార్క్ ఉంటోంది. ప్రపంచ ప్రసిద్ధ నవలలు, ఆ రచయితలను కాలాతీతం ద్వారా పరిచయం చేయడం చతురకే చెల్లు. ఈనెల ఫ్రెంచి నవల గార్గాంటువా... పరిచయం చాలా బాగుంది. ఉన్నవవారి జయంతి సందర్భంగా మాలపల్లి నవలను అద్భుతంగా ప్రజెంట్ చేశారు రమాపతిరావు.

*– జి. సుబ్బరాజు,* హైదరాబాద్

★ డిసెంబర్ చతుర ప్రత్యేక ఆకర్షణలతో మా ముందుకొచ్చింది. 'ఈషణత్రయం' నవల మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది. విశేష రచయిత మైనంపాటివారి 'బుద్ధిజీవి'ని కథ వెనుక కథ ద్వారా అందించినందుకు అభినందనలు. అలాగే మాలపల్లి నవలను అక్కిరాజు చక్కగా సమీక్షించారు. చతుర కతలు, నిన్నటి నిజం, కొత్తగాలులు ఈసారి మరింత బాగా ఆకట్టుకున్నాయి. నవలతోపాటు ఇన్ని రకాల శీర్షికలనందిస్తూ పాఠకులను రంజింపచేస్తున్న సంపాదకులకు కృతజ్ఞతలు.

*– బి.పాండురంగ,* గుణదల, విజయవాడ.

★ డిసెంబరు చతురలోని 'ఈషణత్రయం' నవల బాగుంది. ఇది మా గురువుగారైన కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి చివరి నవల అని తెలిసి బాధ కల్గింది. నేటి సమాజంలో మనిషి ధన సంపాదనకోసం ఎంత వెంపర్లాడుతున్నాడో ఈ నవలలో స్పష్టంగా చెప్పారు. ప్రతినెలా జ్ఞానపీఠ అవార్డు గ్రహీతను పరిచయం చేయడం చాలా బాగుంది. వాసిరెడ్డి సీతాదేవి విశేషాలు ఆకట్టుకున్నాయి.

*–పిడపర్తి విజయలక్ష్మి,* కాకినాడ

★ నికిషా పటేల్ చిత్రంతో కవర్‌పేజీ ఆకర్షణీయంగా ఉంది. ఫ్రాంస్వా రాబెలా ఫ్రెంచి నవల చాలా బాగుంది. నిన్నటి నిజాలు మాకు ఎంతో నచ్చాయి. మంచి ఇతివృత్తంతో కూడిన కొండముదివారి చివరి నవలను చక్కని బొమ్మలతో చతురలో మాకు బహుమతిగా ఇచ్చినందుకు ధన్యవాదాలు.

*–ఎస్.వి.రమణి,* హైదరాబాద్

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ఈ మెయిల్ :

vipula.chatura@gmail.com



# చతుర ప్రవేశిక



## జనవరి - 2011

జనవరి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. రాజా, శాంతల కూతురు?
2. దివ్యను ప్రేమించిన ఆమె కొలీగ్?
3. సువర్ణ భర్త పేరు?
4. శ్రీకాంత్‌కు ఎవరితో పెళ్లి నిశ్చయమైంది?
5. వాణి కూతురి పేరు?
6. 'హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్' రచయిత?
7. 'ఆడపిల్ల తండ్రి'కథ ఎందులో ప్రచురితమైంది?
8. 'క్రియేటివ్ హెడ్' పేరు?
9. 'బాజీరావుల్' దీర్ఘ కవిత రచించింది?
10. సహజ సౌందర్యమే అందం అన్నదెవరు?

---

పంపినవారి పేరు: -------------------------- వయసు ( )

చిరునామా: ------------------------------------

------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji.Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

## ప్రపంచప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ వారి పరిశోధన ప్రకారం "మానవ శరీరంలోని A.P.O.B.EC-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కల్గిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది." శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.EC-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. డాక్టర్ సలహా మేరకు మందులు వాడి CD-4 కౌంట్ (Immunity)ని 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. ఎలాంటి ఆహార నియమాలు లేవు. ఆల్కాహాల్ సేవించరాదు

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

*మెదడు *నోరు *థైరాయిడ్ గ్రంథి *స్తనములు *ఊపిరితిత్తులు *అన్నవాహిక *జీర్ణాశయము *పసరుతిత్తి *కాలేయము *పాన్‌క్రియాసిస్ *మూత్రపిండములు *ప్రాస్టేటు గ్రంథి *మూత్రకోశము *జీర్ణ కోశము *ప్రేగులు *గర్భాశయ కంఠము (సెర్విక్స్) *గర్భాశయము *అండములు *పురుషాంగము *వృషణములు *న్యూరోబ్లాస్టోమా *కండరములు *ఎముకలు *చర్మము *లింఫ్ గ్రంథులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల, రేడియేషన్ థెరపి, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) కొద్ది రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మాననిపుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.2000/-) TYPE - II COURSE 3 MONTHS. TYPE - 1 COURSE 6 MONTHS.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న (OLIGOSPERMIA) మగవారికి కణాలలో కదలిక (MOTILITY) లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసీల్‌వీన్స్ (Varicoseviens) (Per month Rs.4000/-) Course : 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట, అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువశాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా తరచూ గర్భ స్రావములు జరుగుచున్నా, గర్భాశయ లోపములకు (PCOD) - రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs.4000/-) Course : 3 months.

## ఆల్కాహాల్ - స్మోకింగ్ - గుట్కా - డ్రగ్స్ మానండి! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి!! Per Month Rs.1500/-) Course : 2 months.

**నూతన యవ్వనశక్తికి :** శీఘ్రస్ఖలనము నరాల బలహీనత - నపుంసకత్వము (IMPOTENCY) అంగస్తంభన గట్టిగా లేకపోవుట - లైగిక వాంఛ లేకపోవుట (LIBIDO) - రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట-వృషణములు శుష్కించిపోవుట (ATROPHY OF TESTIS) రతిలో పాల్గొనక ముందే వీర్యము బయటికి వచ్చుట - నిద్రలో వీర్యము పోవుట - శృంగారమంటే భయం - శృంగారములో తమ సామర్థ్యము మీద తమకే నమ్మకం లేకపోవుట - శృంగారపరమైన సమస్యలను నివారించి - మగువదగ్గర మృగరాజులా రెచ్చిపోయే శృంగార సామర్థ్యము - 60లో 20లా యవ్వనాన్ని తరగనీయదు - శరీరము వజ్రమంత దృఢముగా, శక్తివంతముగా - వృద్ధాప్యాన్ని రానీయని మహత్తర ఆయుర్వేద ఔషధము. (Per Month Rs.3000/-) Course : 3 months.

**సుఖవ్యాధులు:** గనేరియా - సిఫిలిస్ (per month Rs.1500/-) Course : 3 Months. హెర్పిస్ సింప్లెక్స్ (HERPES SIMPLEX) (Per month Rs.3000/-) Course : 3 months.

**లివర్ వ్యాధులు - లివరు గట్టి పడుట** (Cirrhosis) - **లివర్‌లో పుండు** (Abscess) - **లివర్ వాపు, నొప్పి** (Hepatitis) (Per month 4000/-) Course: 3 Months

**మూర్ఛ** (Fits) **అపస్మారకము** (Epliepsy) - **సోరియాసిస్** (Psoriasis) - **బొల్లి** (Leucoderma) - PROSTATE ENLARGE - THYROID - KIDNEY STONES - స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు (UN WANTED HAIR) తిరిగి మొలవకుండా చేయుటకు :(Per month Rs.3,000/-) Course : 1 month.

**స్థూలకాయము** (Obesity) - **బరువును - లావును తగ్గించుటకు** (No Diet, No Exercise)- **సన్నగా బలహీనముగా నుండు వారు, బరువు - లావుపెరుగుటకు - (21సం॥లోపు వారు ఎత్తు పెరుగుటకు) - నత్తిని తగ్గించుటకు** (Stammering) - **జ్ఞాపకశక్తిని పెంచుటకు - నిద్రపట్టకపోవుట** (Insomnia) - MAIGRANE - T.B - PSYCHOLOGICAL PROBLEMS , Per month Rs.2000/-) Course:3months.

**స్త్రీల స్తనముల సైజు పెంచుటకు - స్త్రీల పొత్తికడుపు మీద** (SCRATCH MARKS) **చారలు, గీతలు పోవుటకు** (Per month Rs.1000/-) Course : 3 months

**కీళ్ల కండరాల నొప్పులకు - ఎనీపెయిన్ - నడుమునొప్పి - వెన్ను నొప్పి మెడనొప్పి** - PILES - FISSERS - GAS - TROUBLE - ACDT - ULCER - (Per month 900/-) Course: 3 Months) - **తుంటినొప్పి** (SCIATICA) - FITULA (Per month 2000/-) Course: 3 Months)

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, జుట్టును నల్లగా పొత్తుగా, పొడువుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100ml Rs.500/-, 250ml Rs.1100/-, Kerala Herbal Shampoo - 100ml Rs.50/-; 250ml Rs.120/-; Herbal Hair Capsules 60 - Rs350/- (Per Month Rs.900) Course : 6 Months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కఫం, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, బస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు అన్ని రకముల శ్వాసకోశ సమస్యలకు Asthma Sanjivini 200ml Rs.350/- (Per month Rs.700/-) Course : 9 months.

**నమ్మకముతో రండి! జీవితాంతం ఆరోగ్యముగా జీవించండి!! - అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. - మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, TQS Showroom పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదారాబాద్-20, ఫోన్ : 65526109, 9392355590, 9866155109

Note : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు, ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపీలో పోస్టల్ /కొరియర్ ఛార్జీ రూ॥ 100/-, ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలయును. మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10 A.M. - 8 P.M. Sunday 10 A.M to 2 P.M

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78


సంతాన సాఫల్యతకు సృష్టి IVF ICSI






✆ 998943 2345, 998946 2345

- పేద, మధ్యతరగతి వారికి అందుబాటులో, అత్యాధునిక సౌకర్యాలతో
- 45 సం॥లు పైబడిన స్త్రీలలో కూడా సంతానం పొందే అవకాశం
- కుటుంబ నియంత్రణ ఆపరేషన్ అయినవారిలో కూడా సంతాన సాఫల్యత
- IUI, IVF, ICSI, సరోగసి, ఎగ్ డొనేషన్ సౌకర్యం

# సృష్టి టెస్ట్ ట్యూబ్ బేబి సెంటర్

www.srushtiivf.com

4వ లైన్, కె.పి.హెచ్.బి., కుకట్‌పల్లి, హైదరాబాద్ - 72

Z.P. జంక్షన్, మహారాణిపేట, విశాఖపట్నం - 2

వెంకటరత్నం వీధి, సూర్యారావుపేట, విజయవాడ - 2

లిటిల్ కృష్ణా థియేటర్ ఎదురుగా, కొత్తపేట, గుంటూరు - 2